శ్రీ శ్రీధరాయనమః.

శ్రీ నీలపురీధామ సీతారామచంద్ర సాంద్రకారుణ్య సంప్రాప్త
సాధుకవితాధార శ్రీమహాగిరాలాన్వయ క్షీరపారావార
పూర్ణిమారాజ, వీరసుధీరాజకుమార వినయవిద్యాసనాథ

రంగనాథకవి

ప్రణీతంబైన

# ద్విరేఫవర్ణదర్పణము.

ఇది

నెల్లూరు పురమతల్లి నల్లసిల్లు
పూండ్ల రామకృష్ణయ్యగారిచే
పరిష్కృతమై
శ్రీమత్సరస్వతీనిలయ, విక్టోరియా, రమానిలయ, ఎంపరరు
ముద్రాక్షరశాలలయం దపుడపుడును
గట్టగడపట
ఎంపరరు ముద్రాక్షరశాలాధికారులవలనను
సంపూర్ణముగ ముద్రితమై
శ్రీమదముద్రితగ్రంథ చింతామణ్యధిపతియగు
పూండ్ల రామకృష్ణయ్యగారిచే
ప్రకటితమయ్యెను

నెల్లూరు.

1903.

శ్రీశ్రీధరాయనమః

# ద్విరేఫవర్ణదర్పణపుంబీఠిక.

1. ఈ గ్రంథమును గోదావరీ మండలాంతర్గతమగు కాకినాడ పట్టణమునకు సమీపముననున్న నీలపురీనామ నివాసులగు యోగిరాలరంగనాథకవి రచియించెను. ఈ వడుమ నూతనముగా వెలువడిన సుమనోమనోభిరంజనమను కృతికర్తకునీకవి పితృవ్యపుత్త్రుఁడు. (చూడుఁడు, సుమనోమనోభిరంజనము, పుట 207) సుమనోమనోభిరంజన కృతికర్త యోగిరాల జగన్నాథముగారు. వీరు 'ఆంధ్రపదపారిజాతము' అను శుద్ధాంధ్ర నిఘంటువును వ్రాసిరి.

2. ద్విరేఫవర్ణదర్పణమనఁగా రెండురేఫములగు (ర-ఱ) లఘు గురురేఫములకు నద్దమువంటిదని యర్థము. ఆంధ్రభాషయందీరేఫము రెండువిధములై విలసిల్లు- శుద్ధరేఫమనియు శకటరేఫమనియు [మెలురాయనియు, బండిఱాయనియు] వీనినందురు. ఎప్పుడుభాషపుట్టెనో యప్పటినుండియు నివి భాషయందగపడుచునేయున్నవి- అతివిస్తరమేల- నన్నయభట్టీయమునందే "రస్త్వత్ర గృహ్యతేద్వివిధః" అనియున్నదిగదా- ఓహో- ఆంధ్రశబ్దచింతామణియగు నన్నయభట్టీయము నన్నయ విరచితముగాదను నొకవాదము పండితులలోఁ బ్రబలియున్నదనుమాటను మఱువఁజాలము. దానికేమి వాదమేల! దానినెవ్వారురచియించినను నీవర్ణద్వయము భాషాప్రపంచమునెప్పటికిని విడచిపోవఁజాలదు. ప్రప్రథమమున, బ్ర- గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు 1878 సం॥ మునఁ గవిజీవితములను వ్రాయుచు బమ్మెరపోతనామాత్యునిచరిత్రమున 47వ- పుటయందు 'ఈఱకారంబునకును మన రేఫమునకును సంబంధము లేకుండుటం జేసియే సూత్రకారులు దీనికి వైధర్మ్యంబు నెప్పిరి' అనునట్టి కొన్నివాక్యములురచించి శకటమైఁగటకటఁబడి యొకవ్యాసముం బ్రకటించిరి. అప్పటికి నాంధ్రశబ్దచింతామణి నన్నయ విరచితముకాదను వాదముప్పతిల్లదయ్యె. పిమ్మట శ్రీరావుబహద్దరు వీరేశలింగముపంతులవారు 'ఆంధ్రకవులచరిత్రము' వ్రాయునప్పటికి నన్నయభట్టీయము కల్పితమను వాదము వచ్చినది. అందుపైఁ గొన్ని పూర్వపక్షములు వెడలియున్నవి. పర్యవసానమెట్లు ముగియునో చూతముగాత. మఱికొందఱు 'షట్త్రింశదత్ర తే' యనియుండుటచేఁ దెలుఁగున 36 వర్ణములేయున్నవిగాని 37 వర్ణములు లేవుగదా, బండిరేఫ మెట్లువచ్చినదని వాదించుచున్నారు. అవుఁగాక. వాదానువాదములచేఁగాని నిజము తెలియదు. ఈ తెలుఁగు భాషకు వర్ణములెన్నియను వివాదము మున్నొకపరి పరిపరి విధముల మా పత్త్రికాసంపుటములో 1891 సంవత్సరమునఁ జర్చింపఁబడియున్నది-

దానిని మరల ముద్రింపించుట చర్వితచర్వణము. అయినను అందలి యహోబలపతి వ్రాసినసారాంశమును మాత్రమిట నుదాహరింపఁబడు:—

“షట్త్రింశదత్ర తే. అత్ర శుద్ధవికృతౌ షట్త్రింశద్వర్ణానాంవ్యవహారః. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః. రేఫస్యద్వైవిధ్యకథనేన గురురేఫస్యాపి వర్ణమధ్యే పరిగణనదశాయాం సప్తత్రింశదిహాన్యేచ ఇత్యప్పకవి పుస్తకపాఠోపి సాధురేవ. తస్యభేదత్వేన వర్ణాంతరత్వా దపరిగణనదశాయాం మయంపాఠ ఇతివివేకః. సప్తత్రింశదితి పాఠానుసారే రయుగ లయుగ వ ష హా శ్చేతి పాఠాంతరంజాగర్తి”

అనియున్న దానింబఠించి సారాసారమారయుఁడు. వెండియు గద్వాలలోనుండు శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యులవారను వారొకరు హేవళంబివత్సర చైత్ర శుద్ధ ౯ లు భానువారమున ‘శకటరేఫవిచారమును గుఱించిన నిర్ణయపత్రిక’ అను నొక దానిం బ్రకటించియున్నారు. అందువారు ప్రకటించిన మాటలలో

“నన్నయభట్టులవారు తెనుఁగుబాసయందు 36 వర్ణంబులని వచించియుండురు. ఈశకటరేఫ నంగీకరించిన 37 వర్ణంబులౌనుగాన వారివచనంబులకు విరోధంబుప్పతిల్లును. ర యుగమని వచింపఁబడలేదుగదా.”

అనివారి ప్రకటనపత్రికలోని ముఖ్యమైనవాక్యము. ప్ర ప్రథమమున నప్పకవీయము ముద్రితమైనపుడు 1859 సంవత్సరమున ‘సప్తత్రింశదిహాన్యేచ’ యనియుండెను. అట్లు 1885 సంవత్సరమువఱకు నప్పకవీయము ముద్రితమగుచుండెను. హఠాత్తుగా నీవల నెవ్వరో ‘షట్త్రింశదత్రతే’ అనిమార్చి యప్పకవీయమును ముద్రింపసాగిరి. అందుచే నీపుల్లగుమ్మి వేంకటాచార్యులవారిట్లు ప్రకటించియుండురు. వీరిమాటఁ బరిపాటింపఁదగినదిగాదని మేము 1897 సం॥ జూలైనెల మాపత్రికామయూఖములోని 57-58-59-60- పుటలయందుఁ బ్రకటించి, యీ “ద్విరేఫవర్ణదర్పణమును” బ్రకటింపవలయునని యపుడే బద్ధకంకణులమైతిమి.

౩. ఈ గ్రంథమును మేము 1897 సం॥ ఆగష్టునెలలోఁ బ్రకటించుటకుఁ బ్రారంభించితిమి. దీనిం బ్రకటించుటకుఁ బ్రోత్సాహకులు మ-రా-రా-సి- వేంకటరామానుజరావు నాయఁడు బి-యే- గారు. వీరు, బియే పరీక్షకుఁ దెలుఁగులోఁ బరీక్షాధికారులుగానుండిరి. ఈద్విరేఫవర్ణభేదములను బ్రయోగములను దెలుపునట్టిగ్రంథమునొకదానిం బ్రకటించిన నది సర్వకలాధికారులకు మిగుల నుపయోగమనియు, దానిం బరీక్షాధికారులు సమ్మానింతురనియుఁ బలుమాఱు మాతో ముచ్చటించుచు వచ్చిరి. ఈ రేఫద్వయభేదమును మూలమట్టుగఁ దెలిసికొనవలయునని వారు 1890 సం॥

బి-యే- పరీక్షాపత్త్రికములలో, 'కాఱింతువు కొమ్మలనదివారల తొల్లింటిపాపఫలము దలంపఁగా- అని వ్రాసెనని యాక్షేపింతురు- మీయభిప్రాయమేమి?' అని వారు ప్రశ్న నిచ్చినారని వింటిమి. వారుగాకున్న మఱియొక రిచ్చియున్నను బాధకములేదు. ఈ కాఱియశబ్దము భారతానుశాసనమున శకటగనే శాసితము. ఈ వర్ణద్వయము యొక్క లోఁతుపాఁతులను గనుఁగొనవలయునని శ్రీరావుబహద్దరు వీరేశలింగముపంతులవారును దమ 'ఆంధ్రకవులచరిత్రమునఁ' గొంత విచారించియేయున్నారుగద-

4. ఈవర్ణద్వయ విచారమునుదెలుపు గ్రంథములిదివఱకే కొన్ని ప్రకటింపఁబడియున్నవి. అవ్వియెవ్వియనిన:— ౧- రేఫఱకారనిర్ణయము- ౨- అడిదముసూరనకవిగారి కవిసంశయ విచ్ఛేదమునందు ద్వితీయతరంగములో 29 వ- లక్షణము- ౩- కూచిమంచితిమ్మకవిగారి సర్వలక్షణసార సంగ్రహమున రేఫశకటరేఫ ప్రకరణము- ౪- భారతములక్ష్మీపతిగారి శకటరేఫనిర్ణయము. ౫- అప్పకవీయమునందలి ద్వితీయాశ్వాసములోని రేఫాక్షఱ సీసమాలికయును, ఱకార సీసమాలికయును, ౬- గణపవరపు వేంకటకవిగారి రేఫఱకారనిర్ణయపద్ధతి- ౭- బహుజనపల్లి సీతారామాచార్యులవారి అలఘుకౌముది-

5. పైనుదాహృతమైన గ్రంథములనన్నిటినింజదివిన తర్వాతనే యీ ద్విరేఫవర్ణదర్పణగ్రంథకర్త గారీగ్రంథమురచించి దాన నిట్లువక్కాణించినారు.

చ॥ మును దెలియంగ నప్పకవిముఖ్యులు రేఫయుగీ విభాగక
ల్పన మొనరించిరీవు మఱలం రచియించినఁ బౌనరుక్త్యమౌ
ననవలదార్యులార మది నాదరమొప్పఁగ మత్ప్రబంధముఁ
గనుఁగొని తత్ప్రయోజనముఁ గాంతురు, నే, వివరింపనేటికిన్॥

అని వ్రాసియున్నారు. ఈ ద్విరేఫవర్ణదర్పణమున నాలుగాశ్వాసములుగలవు. ఇందు మొదటిదానిలో రేఫస్వరూప నిరూపణమును, రెండవయాశ్వాసమున శుద్ధరేఫగలశబ్దములును వానికిఁ బ్రయోగములును, మూఁడవదానియందు శకటరేఫవిషయమును, నాలవదాన నుభయరేఫములును వానికిఁబ్రయోగములును, మున్నూటడెబ్బదిమూఁడు (373) రేఫములకును బ్రయోగములు చిక్కెను.

6. ఈ రేఫలవిషయమై పండితులు వ్రాసియున్నట్టి కొన్నినిర్ణయములంగనుఁడు.

ఆ॥ విన్నిలక్షణంబులెఱిఁగిన రేఫలు। బండిఱాలు నెఱుఁగకుండునట్టి
కవి కవిత్వమెల్ల గవ్వకుఁగొఱగాక। కొఱఁతఁజెందు రజితకుధరనిలయ॥

తే॥ ఆరసమ లశబ్దచిత్రంబు లనియతద్వి। రేఫవృత్తులు దుష్కవి కృతకృతితతు
లెంచినకాలంకులంబలె నింపుఁగనమి। సుకవివారంబువానిఁగాంచు నెయొకింత॥

క॥ అయ్యు ద్విరేఫసరోజులు। చయ్యన విగతద్విరేఫ చర్చలగుదుర
య్యయ్యలు ససులోచనులై। యొయ్యనను ద్విరేఫసిద్ధి నొందుదురిందున్॥

క॥ గురులఘువర్ణంబులకుం। బరస్పరాన్వయము గూర్పఁబాల్పడిన ఘనీ
శ్వరుఁడైదుష్టకవీ। శ్వరుగతిఁ జెలుపఁడె కృతిప్రపంచము నెల్లన్॥

తే॥ జాతివైరంబునొంది ప్రాసంబులందు। విశ్రమములందుఁ దమలోన వేఱుగలిగి
దేవదానవులట్లనఁ దెలుఁగునందు। మించి రేఫఱకారము ల్మెలఁగుఁ గృష్ణ॥

క॥ భ్రమయక రేఫములకును రే। ఫములును ఱాలకును ఱాలుఁ బ్రాసములను వి
శ్రమములను జెప్పఁదగు నీ। క్రమ మెఱుఁగక రెండునుం గుకవిగూర్చుఁ గృతిన్॥

చ॥ అవిరళవైఖరిన్ సరసులట్లు ముదం బొదవింప నేర్చునే
కువలయభాసురత్వమునకున్ వెలియై సతత ద్విరేఫ సై
భవ సువిచార దూరతకుఁ బాల్పడి భూరిరసాభియుక్తి తే
క వితతమౌ తమోభరముఁగాంచెడు దుష్కవిశూన్యకూపముల్॥

7. ఈ గ్రంథము ముద్రించుటకుఁ బ్రారంభింపఁబడి చాలకాలమైనందున నిది సంపూర్ణముగ ముద్రితమైయుండునని యనేకులు మాపేర వ్రాసియున్నారు. 'శ్రేయాంసిబహువిఘ్నాని' అనుమాట నందఱెఱింగినదేగదా. అయినను 'ఈశులుదీన దయాళుదర్శనుల్' అను వాక్యముపొల్లువోకుండ మహారాజరాజశ్రీ. శ్రీ వేంకటగిరి ప్రభువుగారి కరుణాకటాక్షమువలనను, వారిసోదరులగు మహారాజరాజశ్రీ. శ్రీవేంకట కృష్ణయాచేంద్రులవారి దయావీక్షణముచేతను దీనింబ్రకటింపఁ గడఁగితిమి.

8. తాము ప్రాణపదముగఁ గాపాడుకొనుచున్నట్టి దీనివ్రాఁతప్రతిం గాకినాడ పుర వాస్తవ్యులును బండితవర్యులును లక్షణవేత్తలును నగు మహారాజశ్రీ. పాఁడి వేంకటస్వామిగారు గ్రంథకర్త వంశజుల యిష్టానుసారముగఁ బ్రకటనమునకై మా కార్యస్థానమున కనిచిన కృతజ్ఞతను మేము మఱువఁజాలమని విన్నవింతుము.

ఇట్లు

పూండ్ల రామకృష్ణయ్య,

అముద్రితగ్రంథచింతామణ్యధిపతి. నెల్లూరు. 1—12—03.

# ఇది

సంస్కృత పదములలోఁ గొన్నిటికిఁ దెలుఁగు కవులు ప్రయోగించినట్టి శుద్ధాంధ్ర సమానార్థక పద పట్టిక. కొన్నిచోట్ల నక్షత్రపుగుఱుతులిడి సంస్కృతపదములిందుఁ బొందుగఁ బొందింపఁబడె. ఈ పదజాత మాంధ్రపదపారిజాతమను జాతముగఁ గననగును.



బహుమానము - మన్నన, మన్నిక, మన్నింపు,
తిరస్కారము - అలసు, ఎల్లిదము, చౌక,
క్షాంతి - ఓరుపు, సైరణ, సైపుడు, తాలిమి, తాల్మి, తాళిక,
ఈర్ష్య - ఓర్వమి, ఈరసము, ఈసస, ఈసు, సూళు,
వైరము - వేరము, పగటు, ఒంటమి, పగ, ఒమ్మమి, కంటు,
ప్రతివైరి=సూడు * తీక్ష్ణకోపము=రవరవ * ప్రణయకోపము=పొలయలుక
మాత్సర్యము - కరకరి, చలము, మచ్చరము, * శోకము - ఆలము, ఆకురు, కస్తి,
కోపము - కనలు, బైడాలము, కనుపు, కినుక, కినుకము, అలుక, చిందు, కాంతాళము, రోసము, చిందర, కనరు, కసరు,
కోపమానము=మోడి * సుస్వభావము=ఈలువు * భక్తి=బత్తి
ఉన్మాదము - వేళాకోళము, త్రిక్కు, రిమ్మ, రిబ్బ, వెఱ్ఱి, పిచ్చి, ఉమ్మాదము,
ప్రేమ - నెయ్యము, నెయ్యమి, నెమ్మి, నేస్తము, నెనరు, ఎలమి, మేలు, కూరిమి, చెలిమి, అరితి, మచ్చిక, బాళి, ప్రేముడి, మక్కువ,
ఎడతెగని ప్రేమ=మరులు * యువయువతులచే ధరింపఁబడిన ప్రేమ=వలపు
వాత్సల్యము - అర్మిలి, ఆయర్లు, * విస్మృతి - మఱుపు, మఱుకువ,
కాంక్ష - ఇచ్చ, కాయువు, కోర్కె, ఏఁకటు, కోరిక, ఆస,
అర్థాశ=అడియాస * స్మృతి=తలంపు * స్మృతివిశేషము=పోచె
మనోవ్యథ - అంగలార్పు, అంగద, వెంజిలి, మనికితము, తుందుడుకు,
ఉత్కంఠ=అగ్గలిక * ఉత్సాహము - హాళి, జతనము, * అధికక్రీడ=చెరలాట
కపటము - గబ్బు, గారు, గబుసు, కైపు, కిటుకు, కాడు, డబ్బు, కబడు, డంబు,
అపదేశము - నెపము, నెవము, * నిష్కపటుఁడు=నిక్కువుఁడు

స్వప్నము—కల ※ విలాసము—లలి [ఇది యవ్యయము) ※ హిక్క - వెక్కు, వెగటు,

ప్రమాదము - ఏమరిపాటు, ఏమరిక, మోసము, పరాకు,

అవధానము - ఎచ్చరిక, ఎచ్చరింపు, ఏవ, పదిలము, హవణిక, పోణిమి,

కుతూహలము - వేడ్క, వేడుక,

విలాసము - బిత్తరము, కులుకు, జెళము, వెళకు, గునుపు, గొనపు, మురిపెము, మురువు, సొగసు, నిక్కు, మిటారింపు, సీటు, మిటారము, తెక్కు, తెక్కరము, ఎమ్మె, టెక్కు, టీకు, హొరంగు, హొరగు, చిన్నె, పొలుపు, పొలపము, ఒయ్యారము; ఒయారము, బులుపు, హొయలు,

పరిహాసము - గేలి, తచ్చన, కేరడము, గేలి, మేలము, మందెమేలము, ఆట, త్రస్తరి, హాళి,

క్రీడ - త్రుళ్లాట, గొండ్లి, ※ సహక్రీడ - సయ్యాటము, సయ్యాట,

సంభ్రమము - ఉత్తలము, తమకము, తహతహ, తమి, తత్తరము, చిడిముడి, తరితీపు, తరము, చిడిముడిపాటు,

రోమాంచము - పులకలు, పులకరము, గగ్గురు, గగురు, గరుడాల్పు,

రోదనము - ఏడుపు, ఏడ్పు, గోడు, ※ జృంభణము - ఆవలింత, ఆవరింత,

నిద్రావిశేషము - నిదురతూగు, తందర, ※ నిశ్చయస్వప్నము—నిక్కల

నిద్రాసమయముననుత్పన్నమగుధ్వని - గురక, గురుపెట్టు,

స్వప్నప్రలపనము - కలవరింపు, కలవరింత, కలవలము, కళవళము, (ఉపవడము,

అవబోధము - మేలుకొనుట, మేల్కనుట, మేలుకొంట, మేలుకాంచుట, మెలకువ,

భ్రుకుటి—బొమముడి ※ స్వభావము—సాజము ※ అధికకంపము—వడవడకు

కంపము - వలి, వలిపిడి, వడకు, ※ పర్వము - పబ్బము, పండుగ, పండువ,

క్షుద్రదేవతోత్సవవిశేషము - తెవ, తంతు, సాకు, సయంపు, జాతర, కొలుపు,

పాతాళలోకము - పాపజగము, నేలయడుగు, ※ దేవతావేశము—సివము

బిలము - విలము, సురంగము, సురంగ, (గ్రంత

కందరము - తూము, తూటు, తూపరము, దొండ, చిల్లి, తొల్లి, కన్నము, కనుము,

సంపూర్ణము.

# శ్రీ శ్రీధరాయనమః.

# ద్విరేఫవర్ణదర్పణము.

## ప్రథమాశ్వాసము.

---

౧. శా॥ శ్రీమత్తుంద సముల్లసద్భువనముల్ క్షిత్యగ్రతాపఘ్నముల్ । శ్యామంబుల్ చపలాభిశోభితము సారంగావనంబుం బర । వ్యోమాక్రాంతవిహారిమైన హరి విద్యుత్త్వంతముద్యత్కృపో । ద్దామాసారపరంపరల్సిలికి నిత్యంబుల్ మముం బ్రోవుతన్ ॥౨॥ శా॥ వామాంకంబున జానకీరమణియున్ వాతాత్మజుం డగ్రతో । భూమిం బార్శ్వమునందుఁ దమ్ముఁడు గడున్ బాల్పొందనీలాంబుద । శ్యామాంగంబువిశాలవక్షమురుబాహాయుగ్మముల్ జ్ఞానము । ద్రామాధుర్యముగల్గునీలపురసీతారాము సేవించెదన్ ॥౩. చ॥ తరుణతమాలభూజనిరతశ్రితహాటకవల్లికైవడిన్ । సరసిజపత్రలోచనుని సన్నిధినుండి కటాక్షవీక్షణ । స్ఫురితకృపామృతంబు నవపుష్కరధారిత పంకమున్బా రిం।బోరిఁదొలఁగించునజ్జనకపుత్రి జగజ్జననిం భజించెదన్ ॥౪. మ॥ కలశాంభోధితరంగశీతలవళక్షద్వీపకల్పద్రుమా । కలితస్ఫాటికమండపాగ్రమణిమత్కల్యాణపీఠోపరి । స్థలిఁగూర్చుండి మునీంద్రసంతతికి విజ్ఞానోపదేశంబు ని । చ్చలుగావించుహయాస్యదేవుపదకంజాతంబుభావించెదన్ ॥ ౫. సీ॥ అనఘమంత్రి ప్రగడాన్వయకలశాబ్ధిసంతానులక్ష్మీవంశకాంతభావ్య । వైయాసికోక్త్యాదివర శాస్త్రపారగుల్ శ్రీరమారమణ పాదారవింద । భక్తాగ్రగణ్యులు బహుళాంధ్రసంస్కృత భాషాకవిత్వ సంపత్సమగ్రు । లైన వేంకటరామభూనిర్జరేంద్రులకారుణ్య రసపూరకలనవలన । నుభయసా కవిత్వసంయుక్తి నెసఁగు । వాఁడభవ్యాగిరాలాన్వవాయసరసి । జాకరనభోమణికిఁ జేరనార్యమణికి । నగ్రతనయుండ రంగనాథాహ్వయుండ ॥ ౬. పంచచామరము॥ ద్విరేఫవర్ణుఁడైన దేవదేవునుల్లసత్కృపన్ । ద్విరేఫవర్ణదర్పణంబుఁ దేటగా నొనర్తుస । త్పురాణకావ్యశోధనప్రఫుల్లమానసుండనై । పురాణపూరుషాంకమిందుఁ బొల్పుమీఱ నెల్లెడన్॥ ౭. ఉ॥ హంసకులావతంసుఁడు సమగ్రకృపానిధియాదశాన న । ధ్వంసియనుగ్రహంబున బుధస్తవనీయమదీయ భారతీ । హంసికరేఫలఘ్వలఘుతాంబుపయః ప్రవిభాగమెల్లని । ద్వాంసులు మేలుమేలనిముదంబునఁ దేలనొనర్తునీ యెడన్ ॥ ౮. క॥ నాకొకశక్తియుఁ జొప్పడు । నేకబ్బముఁగూర్పనీలనిగమస్థితసీ । తాకాంతనిరంతరకరు । ణాకలితకటాక్షవీక్షణ శ్రీదక్కన్ ॥ ౯. చ ॥ మునుదెలియంగనప్పకవిముఖ్యులు రేఫయుగవిభాగక । ల్పనమొనరించిరీవుమరలన్ రచియించి నఁ బౌనరుక్త్యమా । ననవలదార్యులార మదినాదరమొప్పఁగ మత్ప్రబంధమున్ । గనుఁగొని తత్ప్రయోజనముఁగాంతురు నే వివరింపనేటికిన్ ॥

ఆన్ధ్రశబ్దచింతామణౌ. సూత్రమ్. రస్త్వత్రగృహ్యతేద్వివిధః॥

వ్యాఖ్య ॥ రేఫస్త్వత్రాన్ధ్రవ్యాకరణే ద్వివిధోలఘ్వలఘుభేదేనగృహ్యతే॥ రేఫమైనచో నీయాంధ్రవ్యాకరణమునందే లఘువు అలఘువు అనుభేదముచేత రెండు విధములుగలదై గ్రహింపఁబడుచున్నది. గురుత్వలఘుత్వము లుచ్చారణగౌరవము చేతఁ దల్లాఘవముచేత సిద్ధించుచున్నవి. దేనియుచ్చారణమందు నాలుకయొక్క యగ్రమునకు నుపాగ్రమునకు మధ్యమునకు మూలమునకు శిథిలత్వము గలుఁగునో యది లఘూచ్చారణము. దేనియుచ్చారణమందు వానికి శిథిలత్వము లేదో యది గురూచ్చారణము. అత్రయనుటచేత నీరేఫద్వైవిధ్యము సంస్కృత ప్రాకృతములయందు లేదనుట. అప్పకవీయమునందలి 'కీరతరీ' త్యాదిసూత్రములచేత నీరెంటికిని రూపభేదములు విధింపఁబడియెను ॥

సూత్రమ్॥ రయోస్తునిత్యంస్యాత్॥

వ్యాఖ్య ॥ గురులఘువులగు రేఫములకైనఁ నిత్యమైనవిరోధమగును. అనఁగా నెప్పుడును యతిప్రాసమైత్రి లేదనుట. ఇచ్చటఁ గొందఱు ప్రాసమైత్రిమాత్రమే లేదనియు యతిమైత్రి కలదనియుఁ జెప్పిరిగాని యదియుపపన్నముగాదు. ఎట్లనిన "సాన్యేషాంవైధర్మ్యం లఘ్వలఘూనాం" అనుపూర్వసూత్రమునందు లఘ్వలఘువులగు, య, వ, ల, లకు వైధర్మ్యము లేదు. అనఁగా యతిప్రాసమైత్రికలదని వ్యాఖ్యానము చేయఁబడుటయేగాక వాగనుశాసనాది ప్రయోగములవలన నట్టిమైత్రియుంతటఁ గానంబడుచున్నది గావున నీసూత్రమున నపకర్షింపఁబడిన వైధర్మ్య శబ్దమునకు యతిప్రాసమైత్రి లేదనియే చెప్పవలయును. ఇచ్చట శహాబలపతిగారు లెస్సగా వివరించినారు, దానిని వివరించెదము ॥

మూలము. ౧. సీ॥ వికృతిని రేఫంబు శకటరేఫంబన రెండు దెఱంగులై రేఫ నమరు। నారెంటికిని నిత్యవైరంబుయతులందుఁ బ్రాసంబులందుఁ గూర్పనగుదోష। మమరేశ్వరుండుఁ దిక్కనయాజిభాస్కర కవిమొదలైన ప్రాక్పండితేంద్రు। లెఱిఁగి విమర్శించి యేర్పాటుగాఁ బ్రయోగించిరి తమతమకృతులయందుఁ। గొందఱవిచక్షణులు వెన్కఁగూర్చినార। భేదముగ వారినేటికిఁ బేర్కొనంగ। నయ్యథర్వణుఁడును నన్నపార్యునతమె। కైకొనియెఁ జుమ్ము జనకపుత్రీకళత్ర॥

వ్యాఖ్య ॥ అత్రాహబలపతిః ॥ రయోర్గురు లఘ్వోర్రేఫయోస్తు నిత్యంవైధర్మ్యం స్యాత్కదాచిదపి యతిప్రాసమైత్రీ నాస్తీత్యర్థః ॥ వికృతివివేకేపి ॥ కశ్చిద్వాదతిసాంగత్యం యథావేహానయోస్తథా, అపరశ్చాత్రసాంగత్యం ప్రాసేష్వపిచకశ్చనైత్యుక్త్యాకయోశ్చ త్తవైన్మత్రికల్పకయోర్మత ముభయత్రకశ్చిచ్ఛబ్దప్రయోగేణాత్యంతం ఖండితం మన్యతాధ్వననద్వారా పరాకృత్య ద్వితీయాచార్యేణ। అనయోస్సంగతిం

యస్తుకరోతికవితాకృతౌ । అస్యాఅత్యంతదోషత్వాద్దుష్కవిస్సహికథ్యత ఇతి స్వమతం ప్రకాశితం । ఏవంస్థితే ॥ కం ॥ పురసతులవిలోకనముల । సరసాలాపముల నర్మసంభోగముల । న్మఱగెహరిమనలనొల్లఁడు । నరవరులోయమ్మనూతనప్రియులుగదే ॥ క ॥ గ్రక్కునఁ జనిత్రాలుదునో । తెక్కలుగట్టుకొని దేవరిపుమేడలపై- నిత్యాదిపద్యేషుపోతన్న సూరన్న ప్రముఖైః కైశ్చిదుభయోర్మైత్రీ ఉక్తా । సాచానాకరత్వాదప్రమాణికేతిసుధీపురోగైరనుసంధేయం. అనఁగా గురులఘురేఫములకు యతిప్రాసమైత్రి నాపాదించిన యనామకకవిద్వయముయొక్క మతమును రెండుచోట్ల కశ్చిచ్ఛబ్ద ప్రయోగముచేత నత్యంతమూర్ఖత్వమును దోఁపింపఁజేయు మార్గమునఁదిరస్కరించి యెవ్వఁడైనఁ గవితారచనయందు గురులఘురేఫములకు సాంగత్యమును జేయునేని యదిమిక్కిలిదోషముగాన నట్టివాఁడు దుష్కవియని చెప్పఁబడునని యథర్వణాచార్యులు స్వమతము వెలిఁగించిరనియు,మఱగెననుశబ్దము లఘురేఫముతోఁ బ్రాసముగ బమ్మెరపోతరాజును, తెక్కలనుశబ్దమునకు లఘురేఫముతో విశ్రమముగఁ బింగళసూరన్నయుఁ బ్రయోగించుటయేకాక మఱికొందఱు కవులిట్టిమైత్రిఁ జెప్పిరనియు నది యనాకరము గావున నప్రమాణమనియు నహోబలపతి లెస్సగా వివరించెను. అత్యంతదోషమనఁగా యతిప్రాసభంగదోషమనుట.

మూలము. ౨. క॥ కొందఱుగుకవులుయతులం । బొందనురును ద్వివిధరేఫములకందురిలన్ । గొందఱుగుమతులు ప్రాసము । లందగుమిత్రత్వమం ద్రలాక్షణికతచేన్ ॥ 3. ఉ ॥ సర్వవిదుల్ త్రిలింగపదశాసనుతైతగుశబ్దశాసనా । థర్వణసూరివర్యులమతంబులఁ దెల్పెడరేఫయుగ్మమీ । యుర్వరమైత్రిచేఁ బొసఁగదోడకకూర్చినవాఁడు సత్తగం । థర్వకులేంద్ర దుష్కవియనాఁజనుఁదత్కృతితుచ్ఛమైచెడున్ ॥ ౪. మ ॥ వరశాస్త్రార్థవిచారశూన్యులగు దేవానాంప్రియుల్దర్పమం । థరతన్రాలకుఁ బొత్తుఁగూర్చిరదియంతర్వాణులంగీకరిం । తురెశాస్త్రాతిగవర్తనంబున గురుద్రోహం బుసిద్ధింపదే । గురుకణ్వాదుల సూక్తులంగనుఁడు మీకున్ దీఱుసందేహముల్ ॥

వ్యాఖ్య ॥ దేవానాంప్రియోమూర్ఖ ఇతిపదకల్పలతాయాం । అలుక్సమాసః॥ అంతర్వాణిస్తుశాస్త్రవిదిత్యమరః ॥ అల్పజ్ఞానాంప్రయోగేషునవిశ్వాసోత్ర శాస్త్రత ఇత్యాథర్వికాముద్యాంబృహస్పతిః ॥ శాస్త్రస్యయద్విరుద్ధంస్యాత్తత్త్యాజ్యంనాత్రసంశయ ఇతితత్త్వైవేంద్రః । అథర్వణిష్ణారనుజ్ఞాకృతస్యమద్వ్యాకరణస్య ద్రోహీగురుద్రోహీతికణ్వః ॥ సన్మూలవత్వాత్ప్రామాణత్వా ద్గృహీతత్వాచ్చసాధుభిః । నాపభ్రంశస్యమేతస్యాన్నియమాభావతస్తుతత్ । నివారణాయతస్యైవప్రవృత్తిర్విదుషామభూత్ । తద్ధర్మమేవహివయం భూయసాప్రయతామహే । కవితోపశ్రుతౌదోషం నైనకించిత్సహామహే । శ్రుతేపశబ్దేచోక్తేవాప్రమాదాత్పాణినిం స్మరేత్ । అథనాపాణినామ్నీ

శంకింతయేద్బహుశోబుధః । ప్రాకృతేషద్విధేచాపి వాల్మీకింవామహేశ్వరం । ధ్యాయేదత్రతుమామేవస్మరేత్పండితసత్తమ ॥ ఇత్యథర్వణాచార్యః ॥ మఱియు నప్పకవి ॥ గీ॥ జాతివైరంబునొంది ప్రాసంబులందు । విశ్రమములందుఁ దమలోన వేఱుఁగలిగి । దేవదానవులట్లనఁ దెలుఁగునందు । మించిరేఫరకారముల్మెలఁగుఁగృష్ణ ॥ క॥ భీమయ కరేఫములకు రే ।ఫములును ఱాలకును ఱాలుఁబ్రాసములును విశ్రమములను జెప్పఁదగునీ । క్రమమెఱుఁగక రెండునుంగుకవిగూర్చుఁగృతిన్ ॥ గీ ॥ చెల్లునని మున్న భీమనసెప్పెననుచుఁ । గలుపుదురు రేఫములను ఱకారములను । దుష్టకవులవియొకటైనఁదొంటిపెద్ద । లందఱును నేల విభజింతురని తెలియరు॥ క॥ వలసిన రేఫ ఱకారము । లలవడుఁజా మొకటికొకటియని భీమనయే । పలుకుటఁగలిగిననాతఁడు । గలపినలక్ష్యమొకటైనఁ గన్పడకున్నే॥ గీ॥ సారిదిభోజకన్యనరదంబుపైనిడి । రేయిఁదెచ్చెననఁగ రేఫమయ్యె । మఱఁదియనకసిగ్గుఱచి రుక్మిణిఁజాల ।అట్లు నేసెననఁగ ఱాముకుంద ॥ వళిప్రాసపరిచ్ఛేదమునందు॥గీ॥ మహిని రేఫాక్షరంబును మఱిశతాంగ । నామక ఱకారమును సవర్ణంబులయ్యెఁ।గావ్యములయందు నొకటికొక్కటిగలయక ।తమకుఁదామయ యగు నేకతరయతులన॥

మూలము. ౫. తే॥ గీ॥ అవని ఋత్వంబు రేఫావయవమటంచు । శాబ్దికులు దెల్పిరటుగాన శకటరేఫ । ములకు విశ్రమములఁ బ్రాసములనిడంగ । వలువదమ్మైత్రి లఘురేఫములకుఁగలదు ॥

ఉదాహరణము ॥ అప్పకవి వళిప్రాసపరిచ్ఛేదమున ॥ క॥ ఋత్వైత్వంబునఁ దొలఁగక । ఋత్వంబును ఋవళియనఁగ రేఫముతోమి । త్రత్వంబు నెరపునెట్టిమ । హత్వాము యట్లనగుఁ గాదులంచున్నపుడున్ ॥ సీ॥ ఋత్విజుండని విచా*రించి పూజించి తేద్వైపాయనుండుండధర్మయుక్తి ॥ సభాపర్వము. క॥ ధారుణి ఋప్రాసమునన్ । గా రేఫాక్షరమునకు ఋకారము జెల్లున్ ।నారికినైనాకకుజం । బాఋభుపతిగెలిచి తెచ్చెనచ్యుతుఁడనఁగన్ ॥ క॥ ఆఋషిపుత్త్రిఁడుగట్టిన । చీరములతిమృదులములు విచిత్రములు మనో । హరులు నతనిబృహత్కటి । భారంబున నొక్కకనకపట్టముప్రేలున్ ॥ అరణ్యపర్వము.

మూలము. ౬. క॥ గురులఘురేఫమ్ములు భి । న్నరూపములు రిపులుగావునఁగవీంద్రులుగూ। ర్పరు మున్న శ్లేషమైత్రియు ।నిరురావులుగలుగు ఱాలకిడుదురుగృతులన్ ॥

వ్యాఖ్య ॥ ఇవ్విధి మూలగ్రంథములందు లేమిగదా యెట్లుచెప్పవచ్చునందురేని వివరించెదము. దంత్యతాలవ్య, చ, జ, లను గుఱించి "మిథస్సవర్ణాశ్చ" యనిసూత్రకారులుచెప్పిన నుచ్చారణభేదముండుటవలన శ్లేషకృతియందు నొకయర్థమున దంత్యము, నొకయర్థమునఁ దాలవ్యమునుఁ జెప్పఁగూడదని యప్పకవి చెప్పినాఁడు. విశ్రమ

ప్రాసమైత్రి గలిగిన దంత్యతాలవ్యములకే యుచ్చారణభేదమాత్రమువలన శ్లేషమై
త్రి కూడదనిచెప్పుచుండఁగా నట్టియుచ్చారణభేదము వీనికిం గలుగుటయేగాక వి
శ్రమప్రాసమైత్రియుం గూడలేకుండె నిట్టివీనికి మైత్రికలుగునని యెట్లుచెప్పవచ్చును.
ఇందుకునుదాహరణము. భాస్కరరామాయణము. క॥ నారులఁ బట్టినవారికి । నార
యధర్మములుగలవె యన నారిఁగరం । బారఁగఁబట్టుచు రాముఁడు । పౌరులు బెద
రంగధనువు* భగ్నముచేసెన్॥ నారులనఁగా స్త్రీలకును, ధనుర్గుణములకును జెల్లును.
స్త్రీవాచకమగు నారీశబ్దము సంస్కృతము. గుణవాచకమగు నారిశబ్దము తెలుఁగు.
ఉదాహరణము. మనుచరిత్రమునందు. మ॥ భరమైతోఁచుకుటుంబరక్షణకుఁగాఁ*
బ్రాల్మాలిచింతన్నిరం । తరతాళీదళసంపుటప్రకరకాం * తారంబునందర్థపుం । దె
రువాటుల్దెగఁగొట్టి తద్జ్ఞపరిష * ద్విజ్ఞాతచార్యక్రియా । విరసుండైకొఱతంబడుంగు
కవిస్ప * ధ్వీభృత్సమీపక్షితిన్ ॥ ఇందుఁగొఱఁత యనఁగా న్యూనతయుఁ గొట్టును.
ఉభయత్ర గురురేఫమే. కావున నివ్విధముగఁబ్రయోగింపవలయును॥ తే॥ హరిపురా
భోగవార్తపెం * పపుడువారి । మదిఁబొడమఁదలపోసిర*ట్టిదియటంచు॥ నని రా
ఘవపాండవీయము॥ తలపోసి । అట్టు । అనఁగా అపఖ్యాతి - ఇదియటంచు నహ
ల్య యనుకొనినదని యర్థము. తలపోసిరి, అట్టిదియటంచునని పాండవార్థము। తల
పోసిరియను పదములోనిది క్రియాంతప్రత్యయము కావున లఘురేఫము. అట్టు అను
నది గురురేఫము. దీనికిరూపాంతరముగానరాదు గావునఁ జింత్యమైయున్నది.

మూలము. చ॥ ఇరవుగరేఫయుగ్మమున * కిద్దరమైత్రియొనర్పనల్పమా ।
నెరుసిదిదీన నేమియని * నెమ్మది నెంచకుఁడార్యులారసుం । దరతవహింపదాకృతి
జ * నవ్రజమోహనమైన దేహమం । దరయఁగస్విత్ర మల్పతర* మయ్యనసూయజ
నింపఁజేయదే ॥ క॥ గురులఘువర్ణంబులకుం । బరస్పరాన్వయము గూర్పఁ * బాల్ప
డిననసీ । శ్వరుఁడైకవిదుష్టకవీ । శ్వరుగతిఁజెలుపఁడెకృతిప్ర * పంచమునెల్లన్ ॥
క॥ కావుననుక్తవిధానము । గావిరతిప్రాసముఖ్య * కార్యములఁగవుల్ । ప్రావీ
ణ్యంబునసంకర । భావముదొలఁగించి యిడుఁడు * భయరేఫములన్ ॥

## అధర్వణకారికలు.

శ్లో॥ ద్వివిధాదిదుతశ్చస్యురయవౌచ కగౌతథా । చజౌపబౌతదౌవర్ణా న
మరావససంయుతాః । ఎతేద్వ్వతయసంయుక్తాః ॥

వ్యా॥ ద్వివిధ - హ్రస్వదీర్ఘరూపములగు । అత్-ఇత్-ఉత్ । అకార - ఇకా
ర - ఉకారములు । అయవౌచ- ఏకార - ఓకారములును। కగౌ-కకార-గకారము
లును। తథా- అట్లనె। చజౌ - దంత్యతాలవ్యచజలును । పబౌ-పకార- బకారములు

ను । తదౌ-తకార-దకారములును । వసనంయుతాః -వకార- సకారములతోఁగూడిన।నమరాః - నకార మకార రేఫములును । ఏతే- పూర్వోక్తవర్ణములు। ద్వితయసంయుక్తాః - గురులఘు రేఫములతోఁ గూడినవగుచున్నవి. అనఁగా, అఆ ఇఈ ఉఊ ఎఏ ఒఓ కగ చ జ చెజె పబ తద న మ వ స.

ఈయక్షరములకుఁ బరంబున రేఫములును, శకటరేఫములును గలవనియు, రేఫాదిశబ్దములలో నాదివర్ణము ద్వివిధమనియుఁ దాత్పర్యము. ఇంతియకాని యితరవర్ణమునకు వలె రేఫమునకుఁ గూడఁబరంబున గురులఘువులున్నవని చెప్పరాదు. అట్టిశబ్దంబులెచ్చటనేనియుఁ గానరావు. ద్వివిధములగు రేఫాదిశబ్దములనఁగా అట్టు-రచ్చ - ఇత్యాదులు ప్రసిద్ధములు. మఱియును, రేఫ పరమునందు లఘురేఫంబె కాని గురురేఫము లేదు. అదియుందెలిపెదము. ద్వివిధాయను విశేషణము హల్లులకుఁగూడనపకర్షింపఁబడుఁగావున దీర్ఘవర్ణపరంబున గురురేఫములు లేవని కొందఱు చెప్పినమాట నిరస్తంబయ్యె.

మూలము. సీ॥ హ్రస్వదీర్ఘములైన * యదిమదేదోత్తులు నాదిపరుషసర* ళాక్షరములు । రదతాలుభవచజల్ *తదపబనమవసల్ గురువుల లఘువులఁ*గూడియుండు । రేఫాదిశబ్దముల్ * రెండు దెఱంగులై తనరు నింతియకాని * తత్పరంబు । నందుండుననుటకా * దట్టిశబ్దంబులెచ్చటఁగాన మీదృశ * శబ్దతతులు । సుప్రసిద్ధంబులిటుగాని * చోఘటించు । హానివీనికిఁగావున * నస్మదుక్త । రీతియెబుధాళికంగీక * రింపఁదగియె । నీలపులహూర మధ్యేంద్ర * నీలరత్న ॥

అథర్వణకారికలు.

శ్లో॥ లఘువహ్నిఖిశైలాగ్న్యో న్యైఖగజబర్హిషః । వేద్యాశ్చైత్ప్రయోగేషు స్యురుచ్చారణభేదతః । కేచిద్వదంతిచలఘూన్బిందుబాణశిలీముఖాన్ । తథావదంతికేచిత్తుహర్యంఘ్రిఖశరాన్ పురాన్ ॥ హర్యంఘ్రిశబ్దస్యాకాశపరత్వేనబిందునాచకః.

మూలము. గీ॥ శౌరిమున్నూటయెనుబది * శకటరేఫ । ములును, మున్నూటడెబ్బది * మూఁడు రేఫ ।ములును దగులక్ష్యములవీనిఁ * దెలియవలయుఁ । దద్వదుచ్చారణప్రభే * దంబువలన ॥ గీ॥ పరగ నేనూఱుశకటరే * ఫములురేఫ। ములును నేనూటయేఁబది * వెలయుననుచుఁ । గొందఱార్యులువలికిరి కొలఁదిపెట్టి । దానినంగీకరించెన * థర్వణుండు ॥

అథర్వణ కారికలు. శ్లో॥యథాయథం ప్రయోగార్హారేఫాస్సర్వేప్రయోగతః॥

మూలము. క॥ గురులఘు రేఫములన్నియుఁ । బురాతనకవిప్రయోగములఁ గనుఁగొనిసం । కరభావమందఁజేయక । యురుమతులు యథేష్టముగఁ బ్ర * యోగింపుఁడిలన్ ॥ క॥ ఈరేఫమ్ములఁ బ్రాక్తన । సూరిగ్రంథములయందు * శోధింపఁ

గఁజే । కూరినయన్నివచింతును । దారగుణాకల్పమిళదు * దాహరణముగ౯॥ మ॥
పానరుస్విశ్రమ మైత్రిదీర్ఘపరమె * ష్ఠనేఘమేయంచుఁదా । తనముఖ్యు ల్వాలుకంగ
నమ్మిచనిరా * దారింగవుల్ గొందత్రై । ననునన్నింటికి భారతాదులనె పాం * ద
నాప్రిమిఁగాసారజీ । వనరీతింగయికొంపవానినియచు * భ్రష్టంబులన్వీడెద౯ ॥

మ॥ తులనాతీతసమగ్ర శౌర్యనిజపా * దాయుగ్మనిర్వర్తితా
ఖిలభూరక్షణ కార్యరోపదమునః * కీలాయితాలోకనాం
చలపీతాంబుధి నీరసాధుపరిష * త్సంభావ్యసంచారయు
జ్జ్వలతేజస్సుహృదగ్నిసాత్కృతరిపు * ప్రాసాదశ్రీసాదరా ॥

వ్యా॥ పాదూఃపాదుకా । దమునాఅగ్నిస్సాంతః। అథపాదుకాపాదూరుపాన
త్స్త్రీత్యమరః సప్తార్చిర్దమునాశ్శుక్ర ఇత్యమరః । ఉజ్జ్వలప్రాసాద । మిత్రాయశత్రు
సంపదర్పణస్యోచితత్వాత్ । శ్రీరామభద్రస్యాగ్నిస్తేజస్సుహృత్వేనస్వశత్రోర్దశ
ముఖస్య సౌధాదికంతస్మైదదావిత్యర్థః । తథాచతెజస్సుహృదిత్యానెన। భగవతోనకె
వలంస్వాశ్రితెష్వేవకింతు స్వీయాశ్రితెష్వపిమహాద్వాత్సల్య మితివ్యజ్యతె । స్వప్రతాప
తుల్యతీవ్రాగ్నినాలంకాందాహయామాసెతిభావః ॥

క॥ తారకకోరకితాంభో । జారిస్తబకితపురాంత * కాచలఫలిత
స్ఫారమనోజ్ఞయశోమం । దారజటాయితఫణీన * నమదీనానా ॥

వా॥ కోరకితస్సంజాతకోరకః । ఎవముత్తరత్రాపిద్రష్టవ్యం । మూలం। మూలే
లగ్నకచెజటెత్యమరః ॥

పంచచామరము॥ సురాసురాభిపూజితావి * శుద్ధసత్వరాజితా
సరోజపత్రలోచనాకృ * శశ్రితాఘమోచనా
యరిష్టదైన్యసూదనామ * బాంధశత్రుభేదనా
హరాద్యుపాస్యతారకాద * శాస్యగర్వహారకా ॥

వ్యా॥ అరిష్టః కాకాసురః । కాకెతుకరటారిష్టబలిపుష్టసకృత్ప్రజా ఇత్యమ
రః। తారకాఖ్యోమంత్రవిశేషః ॥

గద్య॥ ఇది శ్రీనీలపురధామ సీతారామచంద్ర సాంద్ర కారుణ్య సంప్రా
ప్తసాధుకవితాధార శ్రీమదోగిరాలాన్వయక్షీరపారావారపూ
ర్ణిమారాజ పేరసుధీరాజకుమార వినయవిద్యాసనాథ
రంగనాథ ప్రణీతంబైన ద్విరేఫవర్ణదర్పణంబు
నందురేఫస్వరూప నిరూపణంబనునది
ప్రథమాశ్వాసము.

శ్రీ శ్రీధరాయ నమః.

# ద్విరేఫవర్ణదర్పణము.

## ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీమత్ప్రణవప్రతిపా । ద్యామేయాకారజరఠ * యతిచిత్తహరా
త్మా మోద్దీపకజలద । శ్యామలకోమలశరీర * జగదాధారా ॥

క॥ స్వరవర్ణగతులవిడువక । వరపదములనెల్లఁ బొందు * పఱచి భవత్స్వా
త్కారణమొనరింతు రాగము । చెరయఁగొనుము సప్తతాళ * భేదధురీణా ॥

టీ॥ స్వరవర్ణగతులవిడువక । వరపదములనెల్ల బొందుపఱచి । స్వర=అచ్చుల యొక్క । వర్ణ=హల్లులయొక్క । గతుల=క్రమములను । విడువక అనఁగా ముందు అకారము, పిమ్మట నికారము, ఈరూపమగునచ్చులక్రమమును, ముందు క కారము, తరువాత గ కారము, ఈరూపమగు హల్లుల క్రమమును విడువక యని యర్థము । మఱియు హల్లులకుంగూడ స్వరక్రమము విడువకయే చెప్పఁబడునని యోచించుకొనవలయు । రెండవపక్షము - సంగీతశాస్త్ర ప్రసిద్ధములగు షడ్జాదిస్వరములు, వర్ణములు, వీనియొక్క గతులను, సంచారములు, వరపదములు, సుకవిప్రయోగ రూఢశబ్దములనుట । రెండవపక్షము। సంగీతశాస్త్రప్రసిద్ధపదములు, భవత్స్వాత్కారణమొనరింతు=నీయధీనముఁ జేతు । రాగము అనఁగా ననురాగము। రెండవపక్షము । సంగీతశాస్త్ర ప్రసిద్ధరాగము। సప్తతాళభేదధురీణా। అనఁగా సప్తతాళవృక్షఖండనమందు సమర్థుఁడని యర్థము । రెండవపక్షము । ఏడైన ధ్రువాది తాళములయొక్క భేదము నెఱిఁగినవాఁడని యర్థాంతరము.

### మూలము.

సీ॥ అఱయిక యరికట్టె * నరవాయియరగలియరుగుటయరుదరి * యరిగెయరిది
నిరుగిరవిరవందె * నిరులిరునిరసయు నిరుగుడునురియాడె * నురువడియును
నురళించెనురియుట * యుదువుటయురులుటయురువణించుటయురి * యొరయొరగలి
యొరువెర వెరియుట * యొరిచన్నొరిమ యొరుడొరనుటకరవాడి * కరముకరువు
కరణికరువలితొల్కరి * కనికరంబు । కరకరయు నాక్కటుండు జ * క్కరకరుల్లు
కురువుకురువేరుకురియుట * కురులు కెరలె । పక్కెరయు ముక్కెరయు నీల * పల్లిధామ ॥

ఇందలి పదములకర్థోదాహరణములు దెలుపఁబడు.

అఱయిక=విమర్శ, పరిశీలనము.

ఉదాహరణము. చ॥ అఱయికగల్గి భూమివల * యంబఖిలంబును నీతిబాధలం । బొఱయకయుండ నా నృపతి * పుంగవుఁ డేలుచునుండ నొండుచో । నిరవయియుండకుండుటఁ జు * మీ యతి వర్షములాశ్రయించెడ । త్పరనరనాథయూధవని * తాజనతా నయనోత్పలంబులన్ ॥ నైషధము.

అరయుట=విమర్శించుట, విచారించుట, వెదకుట.

గీ॥ బొడ్డుఁదామరయందొక్క * పురుషుఁ డుద్భ । వించునట్లుగఁ జేసెఁద * ద్విరచనావి
భవమునఖిలచరాచర * ప్రభవమయ్యె । నరయసామాన్యమే కృష్ణు * సరసలీల ॥ భా॥

అరవాయి=వెనకఁదీయుట.

క॥ అరవాయిగొనక పెట్టుగఁ । బరిగొనియక్కడిఁదిమగల * పై నడరుట యు
ద్ధురగతినగ్నిజ్వాలో । త్కరముపయిన్మిడుత యడరు * కరణి యకాదే ॥ భా॥

అరగలి=మనస్సంకోచము.

చ॥ నరునకుఁబూనిపల్కితివి * నంజవిమాలిన దొడ్డపల్కులే
నరగలి లేకబిట్టడరి * నప్పుడు సూడుము నన్ను నాతనిన్
దిరమయిబాహుశక్తియును * ధీరతయుస్వైరవుంజలంబు నె
వ్వరి దెసఁగాంచెదెక్కుడుగ * వారి నుతింపుము మానుమంతకున్ ॥ భా॥

అరుగుదెంచుట=వచ్చుట । అరుదెంచుటయనియుఁగలదు.

గీ॥ అభవుఁడుమతోడ గూడిలీ * లార్థమచటి
కరుగుదెంచి ప్రసన్నుఁడైవరమునొసఁగె ॥ కా. ఖం ॥

అరిగి=పోయి.

క॥ నరనుతులయ్యెదిక్కుల । కరిగిమహీపతులచేత * నరిగొనిధనమున్
దెరలఁగ దెచ్చినమార్గము । బరువడినెఱిఁగింపుమాకుఁబరమమునీంద్రా ॥ భా॥

అరిది=వింత, అశక్యమనియును . అరుదు=వింత.

క॥ అరిగరమునసేదాల్చిన । నరిగరము నగేంద్రధీరుఁ * డైనంజెడఁడే
అరిదిరమైనన్నడుగుట । యరిదిరమైకాభిలాషు * లగు నృపతులకున్ ॥ సో. హ॥

చ॥ అరుదుగదివ్యరత్ననివ * హంబులఁజేసివెలుంగుచున్నమం
దరశిఖరంబు నెత్తుకొని * తద్దహనార్చు లడంగునట్లుగాఁ
దెరలఁగవైచినన్ దపన * తేజుఁడుబాండుసుతుండు దాని జ
ర్ఝరితముఁజేసివజ్రమయ * శాతశిలీముఖవారిధారలన్ ॥ భా॥

అరి=నారి, పన్ను.

క॥ అరియనివిప్రులచేతను । ధరణీశులురూకయునుమొ * దలుగాఁగొనరె
వ్వరు నిప్పాపుఁడుమానిసి । యరిగొనియెడు భిక్షుణార్థి * యైవిప్రులచేన్ ॥ భా॥

అరికట్టుట=నిరోధించుట.

సీసపాదము ॥ తెరువులునరుగంగ * నరికట్టిచంపెనాబాలవృద్ధముగను * బహు
జనముల ॥ తి। ఉ। రా॥

ఇరుగు=ప్రాంతము.

చ॥ తిరుగుచుఁబుట్టలంబొదలఁ*ద్రిమ్మరుపాములనెల్లఁ రోసి ని
ష్ఠురభుజదీర్ఘదండమున * డొల్లఁగనేయుచువచ్చివచ్చి య
య్యిరుగునదుండుభంబునన * హింగనివ్రేయఁగఁదండమెత్తుదుఁ
హారిహారియంచు దుండుభమ * హాహిభయంపడిపల్కెభార్గవుఁ॥ భా॥

ఇరవు=నివాసము.

క॥ ధరియించినమొదలొకవ । త్సరమాత్రముతావకీన*ధమ్మిల్లములో
నిరవుకొనిమగుడనవ్విరి । తరుణీ యలపారిజాత * తరువునకేగుఁ॥ పా॥

ఇరు=రెండు.

సీ॥ పా॥ ఉరుచిత్రకాగ్నిశి * ఖోన్మేష మిరువంక నిరువంకఁ గుండలి * స్ఫురిత
కర్ణ॥ వసు॥

ఇరవొందుట=చక్కనగుట, అమరుట.

క॥ తురగంబులపై నాశ్వికు । లరదంబులమీఁద రథికు * లప్పుడునిద్రఁ
బారసిరికొందఱుభూస్థలి । నిరవుగసుఖనిద్రసేసి * రిట్లున్నంతఁ॥ భా॥

ఇరులు=చీఁకటి.

సీ॥ పా॥ కన్నులపండువు* గ్రహసార్వభౌముండు సురలయాఁకటిపంట * యి
రులబాయ ॥ నై.

ఉరియాడుట=డోలాయమానమగుట.

గీ॥ అనుచుసంచరించు నడియాసగ్రమ్మర । బాసదలఁచి ధృతికిఁ బట్టువెట్టు
మరునికోహటించియురియాడుఁదుదిమట్టు । గాన నిశ్చయించుగలుగుదేఱు॥ భా॥

ఉరువడి=అతిశీఘ్రము.

సీ॥ పా॥ ఉరువడి నరిగి య * ద్ధరణీశు నన్నిఁదెగఁ జూచిరా హైహయ * సుతు
లుగడిమి ॥ భా॥

ఉరళించె=ప్రకాశించె, విజృంభించె.

ఉరళించుటురులుబ్రోయు ॥ అప్ప॥

ఉరియుట=భయాదులవలనంజిత్తముబిగితప్పుట,

క॥ అరదముననరిగెసముచిత । పరివారముతోడఁజెఱల*పడఁతులడెందం
బురియఁగఁబుష్పకమున ని । ర్భరవేదనమండనసుర*పతినిష్ఠురుఁడై॥ తి। ఉ। రా॥

ఉరువుట=పరిత్యజించుట.

చ॥ హరినఖిలేశ్వరేశ్వరుఁద * యానిధి నాశ్రితరక్షణై కత
త్పరుఁదగవొప్పఁగన్నఁదను * దాహముగ్రక్కునవాయఁగందుఁదు

ష్పురుషులఁజేరుమంచు మదిఁ*జూచెదరేని లతాంగులార యే
నురువుదు నీక్షణంబ యను*కోర్వఁజుడీ యనునింతిబోటులన్॥ ఎ।హ॥

ఉరులుట=వెలువడుట, విడిపోవుట.

క॥ నరనాథసమర్పితమగు । విరవాదుల దండయొప్పె * వెన్నునిపాదాం
బురుహంబు నంగుటంబున । నురిలిన యాకాశ గంగ*కుపమానంబై॥ నై॥

మ॥ ధరణీచక్రము గ్రక్కునం గదల ది* గ్దంతావళశ్రేణికం
ధరముల్ స్రగ్గబడన్ దిశావలయము * త్కంపంబుగానీబలం
బురులంబారఁగభీష్ముపైఁగవియు రా*దోర్దేకముంజూచి ఖే
చరలోకంబునుసంచలింపహరిచం*చద్బాహుఘోరాకృతిన్॥ భా॥

ఉరువడించుట=పేఁగనొత్తుట, శీఘ్రముగఁబైఁబడుట.

సీ॥ పా॥ పరవీరమర్మముల్ * బాయక లక్షించి పొరిఁబ్రయోగించుచు* నురువ
డించి ॥ రా । క । రా॥

ఉరి=మరణసాధనరజ్జువు, వాగుర.

క॥ ఉరిద్రెవ్వఁగొఱికియిప్పుడ । వెరవారఁగ నీకునేను * విరుగడసేయం
దొరకొనుటనీదుభాగ్యం । బరిత్వముదొఅంగిమైత్రి * యలవరపునదిన్॥ భా॥

ఎర=ఆమిషము.

ఆమిషంత్వస్త్రియాంమాంసేతథాస్యాద్భోగ్యవస్తునీతి కోశః॥

క॥ నరపశులనెల్లభీష్మున । కెరఁగానొప్పింపఁజాల * నేనడవులకు
న్నరలఁగఁబోయెదనచటనె । తిరిగెదఁగూరాకుఁగోసి*తినియెదననఘా॥ భా॥

ఎరగలి, ఎరవలి=దవాగ్ని.

క॥ ఎరగలియొండినయడవుల । దరికొనుచందమునమిగులదర్పముమెఱయన్
హరిసేనగణఁగిదైత్యుల।బొరిగొనఁగాఁజొచ్చెముష్టి భూరుహ హతులన్॥ రా॥

ఎరువు, ఎరివి=మేషకరీషము.

మ॥ గురుగుంజెంచలితుమ్మిలేఁతగిరిసా*కుందంత్రిణీపల్లవో
త్కరముంగూడఁబొరంటి నూనియలతోఁ*గట్టావికుట్టారిగో
గిరముల్మెక్కితమింగొమల్ పొలముబోఁ * గ్రొవ్వుల్ మెయిన్నాఁక మేఁ
కెరువుంగుంపటివంచ మెక్కురిప్రభు * త్వైకాప్తిరెడ్లజడిన్॥ ఆ॥ మా॥

ఎరవు=అన్యద్రవ్యము, భిన్నరీతి, అనఁగాఁగల్పికోలుతనములేకుండుట.

క॥ ఇమ్మునరేశ్వరమాతుర । గమ్ములనీకార్యమయ్యెఁ*గాదే కడులో
భీమ్మునవాండులసొమ్ముల । రమ్మన్ననువచ్చునే యెరవుసతమగునే॥

క॥ హరిపలికిన తెఱఁగంతయు । నెరవైయున్నయదికంటె*యీమాటతెఱం
గరయుదమూతొలుత నీపెను । పరిచందంబెల్ల నెఱుక*పడియెడుఁబిదపన్॥ భా॥

ఎఱియుట = కాలుట, తపించుట.

క॥ శరవేదన సర్వాంగము । లెఱియఁగ నాకిపుడు పెదవు * లెండెడుఁ దృష్ణా
భర ముడుగఁదగిన నీళ్లులు । వెరవున దేనేర్తువీవు * వేతెమ్మనఘా॥ భా॥

ఒఱిచన్ను = ఒకచన్ను.

క॥ కరుణయుఁ గోపముఁ గనుఁగొన । నొఱిచంటం బాలుగుఱియ * నొఱిచంటను నె
త్తురుగుఱియుగతి జనార్దను । ధరణిపతనయద్వయంబు * తప్పక చూచెన్॥ సో॥ హ॥

దీనివలన నొఱిగాలు మొదలైనవియు ఱేఫములే యని యెఱుంగవలయు.

ఒఱిమ = ఆనుకూల్యము, మైత్రి.

గీ॥ రాజు దొడిగిన దివ్యాభ * రణచయంబు । నెల్లవారలు రతిఁ జూచు * నేమి సెప్ప
నొఱిమ నొండొంటిఁ జూచునా * భరణములను । విమలహారి నీలమణిశిలా * వీక్షణముల॥ వై॥

ఒరుఁడు = అన్యుఁడు, అన్యోన్యము. ఒండొరులు.

క॥ ఒరుల ధనమునకు విద్యా । పరిణతికిం దేజమునకు * బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడున । న్నరుఁడు దెవులు లేని వేద * నంబడు నధిపా॥ భా॥

క॥ మురహరబలహరు లిట్లాం । డొరుతూపులఁ గప్పఁబడుట * నొదవించిరి త
మ్మిరువురఁ గనుఁగొనఁ దివిరెడు । గరుడోరగముఖులకోరి * కకు విఘ్నముగన్॥ పా॥ హ॥

ఒరముట = పొందుట, కలియుట.

క॥ శరధిన్ననుగ్రోలినని । ర్భరజలములఁ గురిసి మేఘ * భావంబఱియ
క్కరములు కరము లెకాజిగి । నొరమెనన నివియు మెఱసె * నుడిగెన్నొయిలున్॥ ఆ॥ మా॥

కరవాడి = అతిశితము.

క॥ కరవాడి సూదితుద మొన । నరదరువంబడిన ముత్తి * యంబును బోలెన్
గరమొప్పె రజనికరిణీ । కరవమథువు హిమగుసితశి * ఖాశిఖరమునన్॥ వై॥

కరము = భృశార్థము, అత్యంతము.

క॥ జరయను రాక్షసి నీకుం । గరముపకారంబు సేసె * ఘనముగ దానిం
ధరణీశ యేనెఱింగితి । నిరుపమ నిరతిశయ యోగ * నిష్ఠితబుద్ధీ॥ భా॥

కరువు = గర్భస్థితపిండము. మూస.

క॥ చరువులు నమ్మని చెప్పిన । తరువులు పీడ్వడి యొసుతకుఁ * దల్లికి నట్లై
యిరువురు నుపయోగింపఁగఁ । గరువులు దత్తత్ప్రకార * కలితములయ్యెన్॥ భా॥

క॥ కరువునఁ దరువున శిలఁ జి । త్తరువున నినచంద్రరుచులఁ * దారకరుచులన్
హరిహరధాత్రాదులకీ । హరిణము సరిరూపువడయ * నలవియె యింకన్॥ రా॥

కరణి = వలె, ఉపమావాచకము, సామ్యము.

గీ॥ అరణి నగ్ని వొడము * కరణి దేవకియందు । విప్రయజ్ఞకర్మ * వేదగుప్తి
కైజనించె నవ్వఁ * డవ్వసుదేవనం । దనుభజింతు నేక * తానిరూఢి॥ భా॥

కరువలి = వాయువు.

క॥ ధరణీనాయకులుండఁగ । హరిపతిసుగ్రీవుఁడుండ * నంగదముఖ్యుల్
తరుచరు లనేకులుండఁగఁ । గరువలిసుతు నడుగ నేమి*కారణమయ్యా॥ రా॥

తొల్కరి = వర్షర్తువు.

చ॥ తరుణులుచంచలాతలు * తత్కరఘాండ నికాయమంబుదో
త్కరములుపాలుఁదేనెలుఘృ * తంబులు వానలఖండఖండశ
ర్కరలునుద్రాక్షపండ్లువడ * గండ్లుగ శోభనభుక్తివేళఁదా
ల్కరిసమయంబుపేరెలమిఁ * గైకొనకుండునె భోక్తృసస్యముల్ ॥ నై॥

కనికరము = దయ.

చ॥ ......మనోజబా । రికినెరజేసిలోఁగనిక * రింపనివారివిగాకనేరముల్॥ వసు॥

కరకరి * ఆగ్రహము, అనగాఁజలము.కలఁత.

చ॥ కరకరిగూటకట్టియుడఁ * గామొఱవెట్టెడులీల బాలఘా
స్కరకరకాండకండళవి * ఘట్టన...... మను॥

క॥ ఒరులుదలలెత్తిచూడఁగఁ। గరకరిమనలోనవలదు* గాన మదాజ్ఞన్
భరతుకడనుండెనీతి । స్థిరమతిరాజ్యంబునీవ * చేయింపవనా॥ రా॥

మొదటిపద్యములోఁ గరకరియనఁగాఁ జలమనియు రెండవపద్యములోఁగలఁతయనియు నర్థములు.

ఒక్కరుఁడు = ఒకఁడు.

గీ॥ తరుణియేపురకంబైనా* క్కరుఁడుభర్త । యగుటలగ్గుజూదంబునం* దాలినోటు
వడనివానిఁగాఁదగుభర్తఁ*బడయుమింక।ననుచురాధేయుఁడుల్లస*మాడెనంత॥

జక్కర= నది.
కరుళ్లు * తరంగములు.
కరువు = తోడ.
} వీనికి యతిప్రాసములఁబ్రయోగములుగ్రంథములనగపడవు.

కురువేరు = పరిమళద్రవ్యవిశేషము.

సీ॥ కురువే రునిచివచ్చి* తిరదేముగుదయన్న నతివతెచ్చెదనని* యరిగెనాకతె॥ నల॥
సీ॥ కల్వతేకులమిద్దఁ*గావించియాచుట్టుఁగురువేరుదడిఁగట్టి*విరులతేనె॥యయాతి॥

కురియుట = వర్షించుట.

సురపతిసభలోనన్ * జూడనంగారవృష్టుల్
గురిసెఁగులిశధారల్ * కుంఠితంబాండెదిక్కుం
జరమదములకొంగెన్ * సర్వదిక్పాలకాంతః
కరణములుభయోద్వేభ* గంబునన్సంభ్రమించెన్॥ భా॥

కురులు * అలకలు.

చ॥ సురతసుఖంబులన్నిగులఁ * జొక్కుచునొక్కవిభుండుకాంతనీ
కురులకుఁగృష్ణవర్ణమునుఁ * గుంకుమగుబ్బలకచ్యుతత్వమున్
దొరకెననన్ నిజేశుకర * తోయరుహంబుఁదెమల్చినీకునీ
కరములుశంఖచక్రములు * గాఁబురుషోత్తముఁజేసెనావుడున్॥ జై॥

కెరలె = కోపించె. ఉద్గమించె.

క॥ పరులయపరాధములకు । గ్గెరలకతముఁబొగడుచోటఁ * గీడాడెడుచోఁ
బరితోషమురోషమునెదఁ । జొరనీనితపస్విసుమ్ము * సుకృతిధరిత్రిన్॥ మను॥

చ॥ కెరలుస్రవంతిపైనిసుక * క్రిందగువేళనినుండుమేఘమున్
దెరవునఁజల్లగాఁవిరహ * దీప్తకరప్లుతమౌ సజీరకో
త్కరగుణమట్లపద్మినుల* గ్రమ్మునకేసరమాధ్విబొల్చెఁబై
గరమరుదారిఁదేంట్లసెకఁ * గందినముత్తెపుసేసలోయనన్॥ ఆ॥ మా॥

పక్కెర = అశ్వకవచము.

సీ॥ అశ్వతనుత్రాణ * మలరు పక్కెరనాఁగ ॥ ఆంధ్రభాషార్ణవము॥

సీ॥ పన్నగారికినెదు*ర్పడవేఁడిఱెక్కలుధరియించెననఁగఁబ*క్కెరలువెలుఁగ॥పారి॥

ముక్కెర = నత్తు= నాసాభూషణము.

సీ॥ కరవాలుముక్కెర * కరకరల్ కరకరి॥ ... ... అప్ప॥

మూలము.

క॥ గరుగులుబంగరుగరగలు । గరుపారుటయుంగరంబు*గరితగరుసుమొ
గ్గరముగరపచేల్గరువుతొ । గరుగరగరికలు తమోవి*ఘటనప్రవణా॥

ఇందలిపదములకర్థోదాహరణములు తెలుపఁబడు.

గరుగులు = వృక్షవిశేషములు.

మ॥ సురపొన్నల్ కలిగొట్లుచెందుగలుఖ * ర్జూరంబులుంబెందలున్
గురువెందల్పొగడల్మొగల్లువిరుగ * ల్గోరంటలున్సంపెగల్
గరుగుల్ చిన్నలుదాడినిమ్మలుమొద * ల్గామాత్రికులొక్కుమ్మడిన్
విరులన్ గన్నులపండుపైదనరెడిన్ * వేంచేసిచూడందగున్॥ యయాతి॥

బంగరు = స్వర్ణము.

మ॥ చరమాశానికషోపలాంచముల * న్సంధ్యాప్రకాశోదయం
బొరగావించివిరించిచేకొనినసూ * ర్యుండన్సుదార్వన్నెబం
గరపుంబూఁదియకై వియద్విఘణివే * ర్కన్ గాలమన్పచ్చుసె
చ్చెరఁజెల్లించినగవ్వచొకమనమిం * చెద్దారకాచక్రముల్॥ నై॥

గరగలు = కలశములు.

గీ॥ గరగలొసఁగినరుండుభూ * సురులొనర్చు। నాచమనముఖకర్మంబు * లందుపట్ట
భావఫలమొందు నెగడికి* చాచనమున। కింధనములిచ్చిధనముల* నెసఁగ మెసఁగు॥

గరుపారుట = పులకించుట.

క॥ నరపతియానందాశ్రులు। కరసరసీజములనొత్తి *కనుదనియఁగ న
య్యిరువురఁజూచుచుమేనులు। గరుపారఁగఁగ్రుచ్చియొక్కకొఁగిటఁజేర్చెన్॥

తోటక॥ గరుపారఁగమేనుప్రకంపమునన్। బొరిఁదొట్రుపడన్బడ*ముల్దొలఁగన్
జొరనెచ్చొటులేమిన*సువ్యయభీ। భరమొందినఁజే*ర్పడు*భావముతోన్॥ భా॥

ఉంగరము = అంగుళీయకము.

చ॥ గరుడకిరీటిజాతులఁబ్ర* కాశమునొందినమేలిపచ్చతా
లురవుగఁగూర్చితీర్చినస * ముజ్జ్వలకంకణముల్మహీసుతా
కరములనుల్లసిల్లనాడి * కంబగునంగుళులన్వెలింగె నుం
గరములుమేలితీఁగియలఁ * గన్పడుపుష్పఫలంబులోయనన్॥ భాస్క॥

గరిత = స్త్రీ = పతివ్రత.

గీ॥ గరితరతనంబ నాయంబ * గురు నిబంత॥ ఆహెూబలపండితీయము॥

గరుసు = మరియాద = కట్టడి.

క॥ గురునకునాకున్బాండవు। లరయఁగఁగూరిమికిఁబాత్రమగుమరపైనన్
దురమునఁజుట్టరికంబును। గరుసునకొనుఁటేలఁగల్గుఁ *గౌరవనాథా॥ భా॥

ఈపద్యంబునందుఁగల గరుసుశబ్దమునకు బాంధవమునుఁగట్టడియనియర్థము.

చ॥ పరిభవచింతచిత్తమునఁ * బట్టుకొనన్దఁపోతలున్వగల్
గరుసునదాఁటనించుకయుఁ * గంటికిఁగూరుకురాక॥ రామా॥

ఈపద్యమందు గరుసునదాఁటననుచోట మేరమీఱఁగాననియర్థము.

మొగ్గరము = వ్యూహము.

గీ॥ మెఱుఁగుమెఱసినట్లు * మెఱయంగనరదంబు। కర్ణికారకేతు * కాంతివెలుఁగ
నంపగములగురునినలయించికడచియిం। ద్రజునికొడుకుమొగ్గ*రంబుసొచ్చె॥ భా॥

గరపచేల్ = మొఱపనేలయందలిచేలు.

గరువు = ఒకచెంపకునొరుగుట.

చ॥ గరువునఁగ్రొత్తచెంగలువ * కచ్చుఘటించినమాళిఁజుట్టిచెం
దిరికతెఱంగునంబసిఁడి* తీఁగలనిండినజిల్గుపాఁగబం
ధీరనిభవాసనాపవన * పారణచేలనలందికస్తురిన్
మరకతముక్తికాదిమణి * మండనమండితుఁడయ్యెనయ్యెడన్॥ మను॥

తొగరు = ఎఱుపు.

గరగరిక = శృంగారము = నేర్పు = తెలివి-

క॥ గరగరిగ నుండి రెండవ। మరునింబ లేవచ్చు తేని * మైబొల్పు మదిన్
బారిపొరిఁ గలపఁ గఁ గూరిమి। కరమెలమిన్ మొలక లెత్తఁ * గనుఁగొని తనలోన్॥ య॥

మూలము-

గీ॥ గురుజు గురుపోఁతు గురువెంద * గురుగు గురిగి। గురుసు గురువులు జేగురు * గురువు గౌరక
గౌరిజ గౌరవంక చరచుట * చిరిగ చెరిగ। చెరివె చెచ్చెర చొరుట యు * చొరవ శౌరి॥ ౫॥

ఇందలి పదముల కర్థోదాహరణము తెలుపఁబడు-

గురుజు = శిఖరము-

చ॥ అరుదయి చూడఁగా ననురె * నఁదులఁ గ్రందుగఁ గుందనంపుఁ బె
ద్దగురుజులయందు దాఁకొనిన * గ్రొత్తగు పుత్తడిబొమ్మ లెల్లెడన్
సొరిదిని తేనిసోఁబనపు * సొంపుగ నుంగొనవచ్చినట్టి య
చ్చరపువు బోఁడ్లచందమునఁ * జక్కదనంబున నొప్పఁ జెంపుగన్॥ యయాతి॥

గురుపోఁతు = సవయము-

గురుపోఁతు గురుసు వట్టి॥ అప్ప॥

గురువెంద = వృక్షవిశేషము-

క॥ గురువెందఁ జైత్రుఁ డొందినఁ। గరమలుకన్నాలియపుడు * కఱచిన నునువా
తెరమీఁదఁ గాననగుపలు। వరుసయనన్ ననలుపల్లవము పైఁ దోచెన్॥ పారి॥

గురుగు = శాకవిశేషము-

“ఎరవు” అను పదమునకు వ్రాసిన యాముక్తమాల్యదలోని “గురుగుం జెంచలి” అను పద్యమును ౧౧ వ పుటయందుఁ జూచుకొనునది-

గురిగి = స్వల్పమృత్పాత్ర-

గురుగురులు బెట్టుము * గ్గురునువండి॥ ॥అప్ప॥

గురుసు = దంతాదులమూలము-

చ॥ వరుసఁ దలప్రహారముల * వాజుల నొంచుచుఁ బడ్డ వత్కళే
బరములనుగ్గుగాఁ గరథ * పఙ్క్తుల వేయుచుఁ గొండలెత్తిస
త్వరగతిఁ గుంభముల్వగుల * వైచుచు దంతులదంతకాండముల్
గురుసులఁ గూడి రాఁ దిగిచి * ఘోరనిశాచరకోటి మోఁదుచున్॥ భాస్క॥

గురువులు = పరుగులు-

క॥ నరుఁడును రాధేయుఁడునొం। డొరువులతోఁ బెనఁగు వేడ్క * లుల్లంబులలో
గురువులు హారఁ గఁ బొలిచిరి। యిరుదెఱఁగుల సైన్యమునకు * నేడ్తెఱమిగులన్॥ భా॥

జేగురు = ఎఱుపు-

సీ॥ గిరగిర వ్రాసివే * గిరపడి జేగురుకొండలై॥ అప్ప॥

గురువు = గొప్ప- దొడ్డు.

క॥ గురు నుపదేశమునడుపున్ | బురహరవిన్మాత్రవేగ * ముననాకవితోఁ
బోరయండభ్యాసనమునను | గురువుగనాహారమెప్పుడుఁ*గొనఁడేచవులన్॥ ఘా॥

గోరక = చిన్నయీఁటె - బాణము.

గీ॥ క్రొవ్వినడగొండక్రైవడి*గునుకునాక్క | యొంటిగానిమహీనాథుఁ*డొదిగివ్రేయ
గోరకమేనుచ్చిధరఁగాఁడి*శిరసువిసరె | లేదసృక్కారమనుచుఁదె*ల్పెడునసంగ॥

గోరిజ = డెక్క. ఇదిఖురశబ్దభవమనికొందఱందురు.

మ॥ హరిణంబొక్కటికుక్కతండముఁబుళిం*దానికముల్ దోలిచియు
ర్వరఁగాలూఁదకదాఁటునేటులవికిన్ * వాహంబు నడ్డంబునూ
కిరసావల్లభుఁడేసెభల్లమునని*గింగాళ్లుజోడింపుచో
గోరిజల్ నాలుగు ద్రెవ్వసేనబొగడన్ * గోదండపాండిత్యమున్॥ మను॥

గోరవంక = శారిక.

శ్లో॥ గోరంకుః పక్షిజాతౌతు భవేన్నగ్నకవందినోః॥ అనువిశ్వప్రకాశికనిఘంటువువలన నీశబ్దము గోరువంకశబ్దమనితోఁచినది.

మ॥ శరసంధానముతో నెగొన్నియడుగుల్ * జౌజౌవ్వనన్ దాఁటియ
ద్ధరణింగాల్గొనిదోలిణముల్ దివియుదో * ర్దండంబులంజేఁది యే
సిరిబోయల్ దినుమంచునార్చిపరఁగన్ * జిట్టాసలండాయుచున్
గోరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ * ఘోషింప రోషింపుచున్॥ మను॥

చరచుట = వ్యాపించుట.

గీ॥ గట్టినయసునశీతాంశు * దొట్టిగిల్లి | తరళచంద్రాతపము నేలఁ * జరచికాయ
వంతదురటిల్లి వెన్నెల*వగచివగచి | గంధవతిపట్టియొకభంగిఁ*గన్నుమోడ్చె॥ భీ॥

చిరుగుట = శిథిలమగుట- బ్రద్దలగుట.

చ॥ చూరనిబిలంబులున్ వెడలఁ * జూడనిక్రంతలుగాలురాపడన్
దిరుగని త్రోవలున్ విడియఁ * దీర్పనిగొందులు నాలుబిడ్డలే
కరయనిరేలు చీమచిటు * కన్నను విప్పనిమూఁకలుంబయిం
జిరుగని కోకలుంగలవె * చేరినయీసునకోటికచ్యుతా॥ సో. హరి॥

చెరుగుట.

చేటను జెరుగుట చెరువులోఁ జోరఁగఁ జేసె॥ అప్ప॥

చెరువుట= గ్రుచ్చుట, అలంకరించుట.

చ॥ కరమునమున్నశూలమునఁ * గ్రమ్మనెఱుంగులుశత్రుసైన్యభీ
కరములుగా గజాశ్వభట * కాయములన్ గుదిగ్రుచ్చినట్లుగాఁ

జెఱువుచువచ్చువానిఁగురు ※ సింహుఁడుబాచిమదాంధసింధురో
త్కరశరఘాతిభీమణముగాఁ ※ గఁ సెన్నటువిక్రమోద్ధతిన్॥ భార॥

సీ॥ పసిఁడికెంజాయలింపె※సలారజడముడిఁజెరివినమందారసురభికుసుమ॥ ఎ. హరి॥

చెచ్చెర = శీఘ్రము.

చ॥ కురుపతికిన్ యుధిష్ఠిరున※ కున్ సకలక్షితిపాలసేవ్యసు
స్థిరవిభవాభిరామునకు ※ ధీరునకున్ దగసర్వలోకసుం
దరమగుదానినొక్కసభ ※ ధాత్రికపూర్వముగానొనర్చిచె
చ్చెరఁగొనిరమ్ము నీదయిన ※ శిల్పకళాకుశలత్వమేర్పడన్॥ భా॥

చొరుట= ప్రవేశించుట.

క॥ నరుఁడునుసాత్యకియు వృకో । దరుఁడునుమనసేనఁగలఁచె ※ దరుసైంధవుఁజే
రిరినీకుఁదగుసె నరునిన్ । జొరనిచ్చినయేనివారిఁ ※జొరనీననఘా॥ భా॥

చొరవ = ప్రవేశము.

గీ॥ అలవరించిమున్న ※ యధ్యయనంబునఁ । జొరవగలిగిధర్మ ※ చరణవేది
యైప్రజాభిరతుఁ ※ యధ్వరకరణంబు । వలనుమెఱసినడప ※ వలయునధిప॥ భా॥

మూలము.

గీ॥ తరముతరవాయిపాతర ※ తరచెవిత్త। రి తరిగొండయు తిరుగ తి※రిగెతిరుగుడు
తిరిసెనెత్తురుకూఁతురు※ తెరవుతెరలె । తెరలతెరతెరువాటుపు ※ ష్కరదళాక్షు॥

ఇందలి పదముల కర్థోదాహరణములు తెలుపఁబడు.

తరము = పురుషాంతరము- శక్యము - క్రమము.

క॥ నిరతంబుబ్రహ్మమొదలుగ । వరుసనయెడతెగకయిట్లు ※ వచ్చినవంశం
బురుభుజనీవుండఁగనీ । తరమునవిచ్ఛిన్నమగుట ※ ధర్మువెయనినన్॥ భా॥

క॥ తరతరముప్రజలఁజునిమెడు । నరునప్పటియొత్తికోలు ※ నకునరవిద్యా
ధరఖేచరులతిభీతిన్ । బొరసిరితమచెసకునేమి ※ పుట్టునొయనుచున్॥ భా॥

చ॥ అరదముపై నుదగ్రుఁడగు ※ సంగిరునిన్ గనిసెమ్మొగంబునన్
దరహసితంబుజెన్నొసఁగ ※ దానవసూదనుఁడల్లనిట్లనున్
మరలు మునీంద్ర నీకువస ※మా యసమాయుధకేళి కేలికిన్
దరమెమదీయసాయకవి ※ తానములిప్పుడగోలుపుచ్చవే॥ సౌ. హరి॥

తరవాయి= అనంతరము.

సీ॥ పురుషుఁడిందులనొక్కపొలఁతిరమింపుచుఁదరువాయిజవరాలిమరునియింట॥ కొక్కో॥

పాతర = ధాన్యాదిగర్తము.

శ్లో॥ 'ధాన్యాదిగర్తికాపీనంపాతారంపాటికఁతథే' తిపర్యాయపదమంజర్యాం.

ఇంపువలననీశబ్దము పాఠాంతరశబ్దభవమని తోఁచుచున్నది.(పునరుదాహరింపఁబడియె

సీ॥ పెరిగిననూతిపా * తరబొఱియల. ఆముక్త. పెరుగుటయీకవిమతమున రేఫమేకా

తరచుట= మథించుట.

క॥ వెరగొప్పఁగ వేనజనే । శ్వరుదక్షిణకరతలంబు * సంరంభముతోఁ

దరువంగ నరణిమథన । స్ఫురణుండగుజాతవేదు * పోలికయమరన్॥ ఎ. హరి॥

బిత్తరి = విలాసిని.

సీ॥ సురపొన్నఁజేరిబి * త్తరికేరిసవ్వన నెమరునవ్వినరీతి * నాదవెఱిరులు. కాక- మ॥

తరిగొండ = మందరపర్వతము.

క॥ సిరిమీఱిన రాజులచే । వరిమానిసితపముఫూని * వచ్చినసెకకన్

దొరవేలుపలుకనిలుకడ । తరిగొండ యమీనుఖాన తలఁపులనైలవా॥ యయా॥

తిరుగ = రెండవసారి. (డమెడుఁ

గీ॥ అనఘమణికంధరుండట్లు * తనదుతపము । విఘ్నమొనరించుకొనుటకు * వెతబా

దిరుగఁదపమొనరింపఁగ * దొరకొనియెనా । యిపుడురంభతోనున్నాఁడొ యెఱుఁ

తిరుగుట=సంచరించుట-భ్రమించుట-మరలుట. (గవలయు॥ కళా॥

ఈశబ్దమునకుఁదిమ్మకవి రూపద్వయముఁ గనంబఱచినాఁడు. అందులకు వ్రా సియున్న యుదాహరణములు మూఁటిలో శ్రీపర్వరామాభ్యుదయములకుఁ బాఠాంతరములు గానఁబడుచున్నవి. ఎట్లనిన:— తే- గీ॥ ఉడుకుగస్నీరువడయంగ * నొఅలుచునువి । చేష్టయైయూరకుండుచు * జెలులతోడఁ। దిరిగిపోగలుచువేనలి * విరియమనల । యవలఁదిరుగుచునున్నదియక్కటకట॥ క॥ "తిఱిగినకపులంగనుఁగొని" అనుచోట "విఱిగినకపులంగనుఁగొని" యని పాఠాంతరము. భాగవతమునందు, మ॥ ఉఱుకుంగుంభయుగంబుపై హారిక్రియన్ * హుమ్మంచుపాదంబులం । దిఱుగుం గంఠమువెన్నుఁదన్ను * నెగయున్నైలాగతిన్॥ ఈపద్యమునకుఁ దిమ్మకవివ్రాసిన పాఠమే గానవచ్చుచున్నదిగాని, భాగవతము నప్పకవ్యాదు లుదాహరింపకుండుట చేతను, బహుప్రయోగములకిది ప్రతిఘటించుటయేకాక, దీనిననుసరించు ప్రయోగములు గానరాకుండుటచేత నీరూపాంతరమంగీకరించుట ప్రామాణిక సమ్మతము గాదు గావుననిది లఘురేఫమేయని యెఱుంగవలయును. ఎరచూడవలయు.

చ॥ అరదమునెక్కి- కేతనపటాం * చలచంచలమైనతాల్మితోఁ

దురగజవంబుమున్గడువఁ * ద్రోచికడంగెడిచిత్తవృత్తితోఁ

దిరిగెడుబండికండ్లపగిదిన్ * భ్రమియించు మనంబుతోడ నా

హరిసనుదెంచిసత్యసము * దంచితకాంచనసౌధవీథికిన్॥

క॥ తిరిగినపందలనేటికిఁ । బురికొలుపఁగనున్నవారు * పోదురుగాకీ

కురుపతిజయంబుగొనియు । ద్ధరయేలంజూడనేర్చె * దసెవినునన్నా॥ భా॥

తిరుగుడు = సంభ్రమము.

క॥ ద్విరదములొరిగెడివియు నె । త్తురుగ్రక్కుచుఁదూలెడివి క * దుప్రశైకలయం
దిరుగుడుబడునవిభువిఁబడి। పొరలెలిడివియునయ్యెఁబవన* పుత్త్రమునుమునా॥

తిరియుట= విచ్చమెత్తుట.

చ॥ దురమునఁదెంపుఁజేవయును * దుర్దమలీలవెలుంగుచుండను
స్థిరతశమంతపంచకవి * శిష్టతలంబునఁబోరిసద్గతిం
బొరసెడునీకునైవగపు * బుట్టునుబంధులురాజుదేవులుం
దిరియుమరింకవారికగు * దీనతకోర్వకయుమ్మలించెదా॥ భా॥

నెత్తురు= రక్తము.

తిరుగుడను పదములోఁ జూడవలయు.

కూఁతురు= పుత్త్రిక.

క॥ ధరఁగొండొకకాలమునకు । సిరిదళుకొత్తంగనింద్ర* సేనయనఁగఁగూఁ
తురుపుట్టెనారుబొలిచిరి । శరనిధికడచంద్రపద్మ * సద్మలపోల్కా॥ నల॥

తెరవు = మార్గము.

సీ॥ కామములమరల్ప * గానోపుధీరుండువిరజస్కుఁడైముక్తి* తెరవుఁగాంచు॥ భా॥

తెరలుట= విచ్చుట.

క॥ తెరలినబలములఁగనియు । ద్ధురవృత్తిఁబ్రహస్తుఁడతని * తోఁదలపడిమొ
గరిఁగేసరిహరిణముఁబులి। నురగముగరుడుఁదలపడ్డ* యొప్పమరంగా॥ తి॥ఉ॥రా॥

తెరలఁగ = లెస్సఁగా.

క॥ నరపతులయ్యోదిక్కుల । కరిగిమహీపతులచేత * నరిఁగొనిధనముా
దెరలఁగఁదెచ్చినమార్గముఁ। బరువడినెఱిఁగింపుమాకుఁ* పరమమునీంద్రా॥ భా॥

తెర = తరంగము.

సీ॥ తెరలెత్తిసప్తసా * గరములువారలంగ వరుణదేవుఁడుగొండ్లి* పరిభవించె॥

తెరువాటు= మార్గచౌర్యము. (సో॥ హరి॥

సీ॥ భోజనార్థులఁదుష్టి * బొందించునతఁడును దెరువాటువలనఁద* స్కరుల చేత॥ భార॥

మూలము.

క॥ దరికొనుటపరియుపందిరి । దురటిల్లుటదురము కుమరు * దురదురదోరకే
దొరదొరయుటదొరకొనుటయుఁ । గరుణావనరాశిహృతస * కలపలలాశీ॥

ఇందలిపదముల కర్థోదాహరణములఁదెలుపఁబడు.

దరికొనుట = అగ్నియంటుకొనికాలుట.

దరికొనుట = అగ్నియంటుకొని కాలుట.

క॥ దరికొనిదహనుండెగసెను । వరుసను సహదేవుసకల * వాహినిమాద్య
త్కరులపయిఁదురగములపయి। వరరథములపైఁ బదాతి*వర్గములపయిన్॥ భా.

దరి= ప్రాంతము - తీరము.

క॥ కురునృపవిను సంసారము । దరిఁద్రొక్కినవారమింకఁ * దలఁకుదుమే సం
గరమునకు నేమునీకై । పొరలితిమెల్లైన నవున * పోయెదమనుచున్॥ భా.

క॥ సిరిగుబ్బచన్నుఁగొండల । దరులంగటి మొగులపగిదిఁ * దవిలితిరుగు న
మ్మరుతంద్రి మనుపు నసముల । నెరయునమీర్ఖాన సింగి * ణీసుల్తానా॥ య.

పంచచామరము॥ దరింగరంబునిల్చిపొల్చి * దాఁటి నీటిలోఁబారిం
బారిన్మనింగి తేలి తేలి * పొల్తుకల్దలిర్తుర
చ్చరల్మలంగ లంచమిచ్చు * సంద్రమందుఁబుట్టుచున్
ఘురిల్లలేచునట్టిజాడఁ * దోఁపఁజూపరెన్నఁగన్॥ య.

చ॥ కరిపతి నీరుఁద్రాఁగుటకుఁ * గాఁజనుదెంచిన కూర్మరాజుసం
గరమొనరించుచుండి తమ * కంబున నీళులుబాసి పీఁకమై
దరి నడరంగఁ బట్టునది * తత్సమయంబున రెంటి గూడను
న్వారవునసూఁదిచిత్తమున * వేగిరపాటును లేక చంపుమీ॥ భా.

పందిరి= కాయమానము.

సీ। శైత్యపాండిమలుతు*షారాంతమునఁజేరెనిరులుక్రొంద్రాక్షపం*దిరులవిరుల॥ ఆము.

దురటిల్లుట= దుఃఖించుట.

క॥ ధరణీరాజ్యము నాకును । నరవరసౌఖ్యంబుసేయు * నా? నీవిపైన్మ
దురటిల్లదుష్కరంబగు। నరణ్యావాసమునకేగు * నట్టిదయైనన్॥ భా॥

దురము= యుద్ధము.

క॥ నరనాథయింకభీష్ముని । దురమునకుంజేసుమేను * దోర్బల విభవో
ద్ధురతంబాండుకుమారో । త్కరమందత్సేనలను మ * దంబణఁగింతున్॥ భా॥

కుదురు= ఆధారము.

క॥ కరి తురగ రథసమితిపొం । పిరివోయెడునాదులక్ష్మి * పెంపునకెల్లన్
సరసిరుహనయన నీవ కు । దురుగానానరించెదఁగు * తూహలమెసఁగన్॥ భా.

చ॥ సరస రసాయనంబులును * జక్కనిచక్కెరకమ్మతేనియల్
పరిపరి రీతులన్వలచు * భక్ష్యఫలంబులు పానకంబులున్
దురదురఁగొంచునెచ్చెలుల * తోఁజనుదేరఁగ నప్సరోజనో
త్తరతరళాక్షులేగిరిము * దమ్మున దమ్మున శ్రీమదమ్మునన్॥ భా.

దొరకుట= లభించుట.

చ॥ పరహితశీల సత్యకుల * భావ దయా శమధర్మపుణ్య స
చ్చరితవివేకబుద్ధిభయ * సత్త్వగుణంబులు కాంతలున్న య
ప్పురుషునఁబోవుచర్మమయ * పుత్త్రికలందాకయింతసౌఖ్యముం
దొరకునె మోసపోయి కడు * దూషితచిత్తుఁడనైతి నక్కటా॥ రామా॥

దొర= ప్రభువు. స్వామ్యము.

క॥ కురుపాండవసైన్యంబుల । దొరలడియాలములమొప్ప * తోమెఱయుసము
ద్ధురవీరధ్వజములఁబొలి । చిరిశౌర్యస్ఫూర్తిమూర్తిఁ * జేకొన్నక్రియన్॥

చ॥ కురుకులజుండుపాండునకుఁ * గుంతికిఁబుత్త్రుఁడు రాజధర్మ బం
ధురచరితుండు నీవతని * తోడరణంబొనరించెదేని వి
స్తరముగనీదు వంశమును * దల్లినిఁదండ్రినిఁ జెప్పుచెప్పినన్
దొరయగునేని నీకెదిరి * దోర్బలశక్తినితండు చూపెడిన్॥ భా.

దొరయుట= సమానమగుట. చేరుట.

చ॥ సరియగునాకు దివ్యశర * జాలములందలపోసిచూడ న
న్నరుఁడు దృఢత్వలాఘవగు * ణంబులఁదక్కువ దూరపాత వి
స్ఫురణగరంబుఁబట్టఁబడు * భూవరసౌష్ఠవరేఖనేమియుం
దొరయఁడుధైర్యశౌర్యపటు * దోర్విభవంబుల హీనుఁడెంతయున్॥ భా.

చ॥ మరునకుఁజైత్రమంత్రి వన * మండల రాజ్యఫలైకకాంచనో
త్కరము కరంబొసంగుటయుఁ * దావులబచ్చులుసేరి తచ్ఛదా
వరణమువాయ విప్పిపరు * వంబున నెన్నికకెక్కఁజేయుచున్
దొరయఁగనీవుగంటె చెలి * ధూర్తవతంస మలీమసాళులన్॥ వసు.

దొరకొనుట= సంభవించుట. ఆరంభించుట.

క॥ శరనిధిఫేనంబుననా । హరివాంఛిజగద్విరోధి * యగువృత్రునిఁదాఁ
బరిమార్పనీకు విజయము । దొరకొనియెంగాక చీన * దోషముగలదే॥

క॥ గురుఁడైదుదివసములు ని । ర్భరసమరమొనర్చెనతనిఁ * బరిమార్పఁగ నా
వెరవుననర్జునుప్రాపున । దొరకొనియెహుతాగ్నిభవుఁడు * ద్రోణసుతుండున్॥ భా.

మూలము.

సీ॥ నరములు నరలును * నురుగులు నెరవును, నెరసుచప్పరముడె * ప్పరము పరగె
పరగించె పరిమార్చెఁ * బరిగొనెఁబరిపరి, పరుసుదాఁపరమును * బరిపరాకు
పరిఢవిల్లుటపరు * వంబు బొంపిరివోయెఁ. బరిగొనెఁబురణించెఁ * బురుదుపురుగు
పురికొల్పెఁదుంపురుల్ * పురపురపెరడుపె, రపెరిగెపెరుగుపొ * రకలుపొరలె

పొదుగుపొరిఁబొరిపొరయుట * పొరపొరిగాౘ। బరడుబరిమేనుబుదుజులు * బరవసంబు
బరిబరాబరిబిరుసున * బ్బురముబురుద । బెరసెఁగొశ్బరకాయలు * పరమపురుష॥

ఇందలి పదములకర్థోదాహరణములఁ దెలుపఁబడు.

నరములు= నాళశబ్దభవమని కొందఱందురు.

క॥ నరములుఁ బ్రేవులు నెమ్ములు । వెరవారఁగఁ ద్రుంచి త్రెంచి * వితిచయుదగ్ర
స్ఫురణమునలోనుండిన । గరళముచంపమునఁ బోర్వఁ * గారాకున్నఁ॥ రామా.

నరలు= పలితకేశములు.

క॥ నరలుగలకాముఁడైనం । దరుణులురోయుదురుడాయ * ధనపతియైనం
బురుషుఁడు దుర్వారజరా । పరిభూతినశిష్టభోగ * బాహ్యుఁడుకాఁడే॥ భా.

నురుగు= ఫేనము.

చ॥ కరువునఁ బోసిరో, విధునిఁ * గాంతిసుధాబ్ధితరంగ దెచ్చి గం
డరువానరించిరో, హరుజ * టాస్థలికిం బొడవైనయేటి పె
న్నురువునఁ జేసిరో యనమ * నోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లు సుం
దరతురగోత్తమంబు * దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్॥ భా.

నెరవు= శ్రేష్ఠము. ఉచితము.

చ॥ ధరణిపుఁడెందునేఁదగదు * తాఁజననూరట కొక్కనిందగున్
దొరనానరించి సంపనరి * దుర్బలు చేఁజెడఁ డాతఁడర్థభూ
కరితురగర్ధి లేకకాఅ * గాఁడటుసేయ ద్విజాన్యుఁడల్ల కా
నెరవునతండు చన్వలయు * నిందుగదుర్గబలోర్వియీఁదగున్॥ ఆము.

నెరుసు= తప్పు. లేశము.

సీ॥ ఆశార్థులముమాయ * హంక్రియాస్ఫురణకు, నెరుసుబట్టకుమయ్య * వరుణదేవ॥ నై.

చప్పరము= శాలావిశేషము.

చ॥ తెరయును మేలుకట్టుదగు * దీపములుం జెలువొందమేలుచ
ప్పరమునఁ జారుహృద్యమగు * పాన్పున నాదటనిద్రవోవు న
గ్గురువధకారిగాంచి మదిఁ * గ్రొత్తగఁ గ్రోధము సందడింప సు
స్థిరతఁ దలప్రహారమునఁ * దెల్పెఁ బృణీకరణాభిరాముఁడై॥ భా॥

డెప్పరము= కీడు. ఆయాసము. కష్టము.

చ॥ పరమపతివ్రతం గడుత * పస్విని పాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి * మానవభామినిగాఁ దలంచి డె
ప్పరములు పల్కఁగాఁ దగునె * బాల్యముదక్కవు దుష్టవాసనం
బెరిగితి నీనిమిత్తమున * బెద్దయు దుఃఖితులైరి పాండవుల్॥ భా.

పరగించుట= ప్రయోగించుట.

క॥ శరములొకఁడొకఁడు పది పది। పరఁగించిన మాఁటమాఁట * పార్థుఁడు నొంచెన్॥

గీ॥ హరియనతనిపైఁ జెల్లుగ * నంపగములు। పరపి పైదర్పుఁడచ్యుతు * గరుడకేతు
నొక్కయమ్మున సారథి * నొకశరమునఁ। దాఁకనేసె రథ్యమ్ములఁ * దరలనేసె॥ ఎ-హ

పరిమార్చుట= సంహరించుట.

(ఈశబ్దమునకు 22 వ పుటలో "దొరకొనుట" కుఁగా వ్రాసిన ప్రయోగ
గములఁజూడఁదగును.)

పరిపరివిధములు= అనేకరీతులు.

(ఈశబ్దమునకు 21 వ పుటలో "బిరబిర" కుఁగా వ్రాసిన ప్రయోగములఁజూడం
దగును.)

పరుసు= సమయము- విధము.

చ॥ గిరికుహరస్థితంబులగు * కేసరులంజడిబేర్చు సప్రయో
ధరములగర్జలంబెగడి * దాఁగఁగనున్నవి యున్నచోన య
చ్చెరువున గుండియల్వగిలి * చేష్టితమేమియు లేక యుండెన
ప్పరుసున వాన తోన మృగ * పక్షులు మ్రగ్గుట చెప్పనేటికిన్॥ హరివంశ.

క॥ బరవసమెసఁగఁ ద్రిగర్తే। శ్వరుఁడిట్లను నుచితమింక * జననాయకఁడై
ప్పరుసున నానతియిచ్చెను। దొరలేమనిరట్లు సేయఁ * దుదిఁగార్యమగున్॥ భా॥

దాపరము= గోపనము.

తే-గీ॥ రమణి నా పట్టున దాఁప * రమ్మగలదె॥ కళాపూర్ణోదయము.

పరాకు= స్మృతిలేకపోవుట.

ఉ॥ అవ్వలిదిక్కు మోము ద్రిప్పి * యంబుననొండులతోడ ముచ్చటల్
ద్రవ్వుచు నొక్కకోమలి పరా * కుననుండఁగ ధూర్తుఁడొక్కరుం
డివ్వలవచ్చి వంచనమె * యిచ్చనుమించు మెలుంగుటద్దము
న్నవ్వుచుఁ బట్టె దానిచర * ణంబులకున్నదుమైన మేదినిన్॥ నైషధము.

పరిఢవిల్లుట= ప్రకాశించుట.

సీ॥ ఒకచోట సాలభంజి * కకత్తెలు పన్నిన, మురిపెంపు గొండ్లిని * బరిఢవించు॥

పరువము= పరిపాకము.

క॥ పరిమళము చెడదు వాడదు। పరువము దప్పదు పరాగ * పరిభరితంబై
నిరతము జగదేకమనో। హరమగు నీకుసుమరాజ * మంబుజవదనా॥ పారి॥

పొంపిరివోవుట= నిండుట.

(ఈశబ్దమునకు 21 వ పుటలోఁ "గుదురు" కుఁగా వ్రాసియున్న ప్ర
యోగములఁజూడందగును.)

పిరిగొనుట = పెనఁగొనుట.

తే. గీ॥ ఇవ్విధంబునఁ బల్కిన * నింతిపలుకు । గాన నేరక తనయప్ప * కడకు మగుడ
నరిగె నెవ్వగ మనమునఁ బిరిగొనంగ । జిన్నఁబోయిన మోముతో సింహబలుఁడు

పురణించుట = సామ్యమగుట.

మ॥ వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డ * శ్వత్థామ గాండీవితోఁ
బురణింపందగువాఁడు వీని కెనయౌ * భూలోక సంచారులె
వ్వరు లేరీతఁడు బ్రాహ్మణుండనినభా * వంబూనఁగా నూర్వమిం
దరమూహింపఁగ లేమకా నిజము చం * దంబయ్యెడిం బోరులన్॥ ॥భా॥

పురుడు = జాతాశౌచము, సామ్యము.

క॥ ధరణిఁగడుఁ బేదవారును । బురిటికి ఘృత తైలధాన్య * ములు ముందఱఁ జె
చ్చెర సంగ్రహింతురవి మన । కరుదుగ నతిదుర్లభంబు * లర్థము లేమిన్ ॥భా॥

క॥ పురుషోత్తముతోఁ జెప్పడు । పురుడితఁడననిట్లు పొల్లఁ * బోవునె నీకున్
హరికి విను హస్తిమశకాం । తరమెన్నఁగ రజ్జులింకఁ * దక్కుము కుమతీ॥ ఎ-హరి॥

పురుగు = కీటకము.

సీ॥ పురు డీడు పురికొల్పు పురి తుట్టె పురుగులు॥ ॥అప్పకవీయము॥

పురికొల్పుట = ప్రేరేపించుట, ఉత్సాహముఁ బుట్టించుట.

(ఈ శబ్దమునకు 19-వ పుటలోఁ "దిరుగుట" కుఁగా వ్రాసియున్న ప్రయోగములఁ జూడఁదగును.)

తుంపురులు = శీకరములు.

సీ॥ కరువలి నెగయుతుఁ * పురులముమ్మరమెల్లఁ గ్రమ్మెడు పుష్పాళ్ళదుమ్ము గాఁగ॥ య॥

పురపురఁబొక్కుట = మిక్కిలి దుఃఖపడుట.

క॥ నరుఁ డనునయించె వెస న । న్నరపతి నెత్తుచును దాను * నయమున వనటం
బురపురఁబొక్కుచుఁ గురుభూ । వరయిద్దఱి తెఱఁగు రామ * వాక్రువ్వంగన్ ॥భా॥

పెరడు = దొడ్డి.

సీ॥ ......పెరుగుట నిక్కుట * పెరుగు పెరడు॥ ॥అప్పకవీయము॥

పెరయీఁగ = తేనెటీఁగ.

క॥ పెరయీఁగలగతిఁగవయుచుఁ । బోరిఁబోరిఁగ ఱుదురుల పగిదిఁ బొదువుచు నెఱుకై
వెరవునఁ గాకులఁ గ్రోఁతులఁ । బరువడిఁ జేఁకొను పఱచు భంగిసలఁచుచున్ ॥భా॥

ద్వి॥ గిరులెక్కుచరులందుఁ గ్రిక్కిఱియున్న। పెరలతేనియలాని పెల్లార్చికొనుచు॥ ౧౦॥

పెరుగుట = తెగుట.

చ॥ కరఁగినపూఁతచేఁగనక * కందుకకాంతివెలుంగుచన్నులం
బెరిగినదొడ్డముత్తియపుఁ * బేరులువాయఁగ మన్మథాంకముల్
తరుణుల నంబికావిభుఁడు * దార్కొనుచోఁ గనుచోటుమాటుగాఁ
బరగలుసల్లు శీకర వి * తానము మాసముఁ గావకుండునే॥ ॥సో-హ॥

పెరుగు = దధి.

క॥ తరువంబెట్టిన చట్టుల। పెరుగులు మును గిలకరించి * పేర్చిన వెన్నల్
గురువులెసఁగఁ గ్రోలిపిదప। సురులం ద్రొక్కుచును బోవు సురుతరశక్తిన్ ॥ఎ-హ॥

పొరకలు = ఈనెలు.

సీ॥ ......పొరలుటచీఁపురులు * పొరకలుబరికట్టె॥ ॥అప్పకవీయము॥

పొరలుట = పరివర్తించుట, పొంగిపొరలుట.

(ఈశబ్దమునకు 21-వ పుటలో "దరికిఁ" గావ్రాసియున్న ప్రయోగములఁ జూడందగును.) మఱియును

చ॥ తరుణులవీరమద్దియల * తాఁకునఁ జిందఱ వందమైన క్రొ
న్నరుపులలోన శైవలము * నూలుకొనంగ నితంబపఙ్క్తిపైఁ
బొరలుతరంగరాజి విరి * పువ్వుల వీడినకుంతలంబులన్
బరఁగఁబదంబులం దెరఁగి * పైఁబడ నేడ్చు విటాలికైవడిన్॥ ॥సో-హ॥

సీ॥ కాఁగినయెసరుల * కరణిఁ బొరింబొరి శరథులు పొంగుచుఁ * బొరలఁబడియె॥ భా॥

పొరుగు = ప్రాంతము.

క॥ బిరుదులగు మగలు గలరని। తరమిడి చంపింపఁజూచె * దవు జనముల నీ
పొరువునఁ బోవె ఱతుము మా। పురమును రాష్ట్రమును విడిచిపొమ్మొటకైనన్ ॥భా॥

పొరిఁబొరి = మాటిమాటికి, (పొరియనియుంగలదు)

(ఈశబ్దమునకు 25-వ పుటలోఁ "బెరయాఁగ" కుఁగావ్రాసియున్న ప్రయోగములఁ జూడందగును.) మఱియును

క॥ తురగముఁ దురగముఁ గరిఁగరి। నరునరుఁడును దేరుఁదేరు * నలిఁదాఁకిన న
ప్పురుసదనమేమి చెప్పఁదుఁ। బొరిమిణుఁగుబులెసఁగెఁగైదు * పులపొడిరాలన్ ॥భా॥

పొరయుట = పొందుట.

క॥ దొరకొనని దానిఁ గోరక । దొరకొని నందున నమమత్వ * దుష్టహృదయతం
బొరయక విగతవిస్పృహులగు । పురుషులు శుచులేల తీర్థ * ములు వారలకున్ ॥భా॥

పొర = త్వక్కు, కౌటిల్యము.

సీ॥ పొరలెత్తి ఘనసారతరువులఁ దనుడాసఁ దొరఁగిన పచ్చకప్పురపురజము ॥మను॥

క॥ పొరిముకఁడు * నీవాకండును । బరమాప్తులు గల్గ నరుఁడు * భారవుఁబనికిం
బొరనలుకడు నీకూరిమిఁ । బొరఁబొచ్చెము గాక యుండఁ * బోరఁగవలదే ॥భా॥

పొరిఁగొనుట = చంపుట; పొరిఁబోవుట = చచ్చుట.

క॥ ఎరవలిఁ బొందిన యడవుల । దరికొను చందమున నమిగుల * దర్పము మెఱయన్
హరిసేనకణఁగి దైత్యులఁ । బొరిఁగొనఁగాఁ జొచ్చె ముష్టి * భూరుహతతులన్ ॥భా॥

క॥ ఉరగాంగనఁ గనిపట్టెడు । గరుడుని క్రియ శక్తిఁ బట్టి * క్రమ్మఱ వైచెన్
నరసుతుఁడు శల్యసూతునిఁ బొరిఁబోవఁగ నార్చెఁ బాండు * పుత్త్రబలంబుల్ ॥భా॥

బరడు = గఱుకైన పట్ట; బరిమేను = ప్రక్క.

సీ॥ బరులబ్బ గానానఁ బాలుఁ ద్రావుట బరిమేను గందవుఁ జెక్కు మీఁది బరడు ॥అప్ప॥

బరుజులు = గజ్జెలు.

సీ॥ ......బరికట్టె బరుజులు * బరవసంబు॥ ॥అప్పకవీయము॥

బరవసంబు = ఉత్సాహము.

(ఈ శబ్దమునకు 24-వ పుటలోఁ "బరుసు" నకుఁగా వ్రాసియున్న ప్రయోగములఁ జూడందగును.)

బరి = పార్శ్వము.

బరిమేనను శబ్దమునకుఁ బైన వ్రాసిన ప్రయోగముం జూడఁదగును.

ద్వి॥ బరులును బిరుదు జబ్బలు మధ్యములును । శిరములుఁ జెవులును జెక్కులోష్ఠములు.

బరాబరి = హెచ్చరిక.

సీ॥ మరుని ముందఱ బరా * బరి సేయ కంచుకిములకు చేతుల వెండి గుదియలనఁగ॥ పారి॥

బిరుసు = కాఠిన్యము.

చ॥ బిరుసుగ నేఁటికిం దఱుచుఁ * బ్రేలెదు శూరుఁడవైన నిల్చి నీ
పరుసదనంబుఁ జూపుమని * పాండుతనూజుఁడు చిత్తజల్లు గాఁ

గుఱియుపమోద్ధరంబు క్రియ * ఘోరశిలీముఖ వృష్టిముంచినం
దురమునబభ్రువాహనుఁడుఁ * దూలె బలంబులుఁ గూలె నెల్లెడన్ ||

అబ్బురము = ఆశ్చర్యము.
దీనినద్భుత శబ్దభవమని కొందఱందురు.

చ|| శరనిధిరాజు పాలఁదెర * చాలువిధంబున నొండొకళ్ళవి
స్ఫురితమనః ప్రసాదరస * పూరము పెందెరలో యనంగ న
బ్బురమగుడాల్గుకూలములు * బొల్పు తెరల్ ప్రహిమీఱ నెత్తిరాం
డొరులకుమాటుగాఁ బ్రణయ * యోగముఁ దాఁ దెరలెత్తి పైకొనన్ ||
|| రామకథాభిరామము ||

ఉ|| అబ్బురపాటుతోడ నయ * నాంబుజముల్వికసింపఁ గాంతిఁ బె
ల్లుబ్బి కనీనికల్వికసి * తోత్పలపఙ్క్తులఁ గుఱిమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁజన్నులు గ * గుర్పొడవన్మదిలోనఁ గోరికల్
గుబ్బతిలంగఁ జూచె నల * కూబరుసన్నిభు నద్ధరామరున్ || || మను ||

బురద = పంకము.

చ|| దురములవారువంపుగమిఁ * దొక్కఁగ లేచినదుమ్ము గ్రమ్మినన్
బురుదయియుండునాకడలిఁ * బూనిక నేనిక మూఁక ఠేసి వే
మరు బుసకొట్టఁగా నెగయు * మవ్వపుఁదుంపురు నీటిచేత రా
సిరిపఱుఁ గూర్మిమైమగుడఁ * జెల్వుగనించిన యాభగీరథా || || య ||

బెరయుట = కలియుట.

క|| గిరిజయుగిరిశుండునునొం । డొరులకు నైదవమొనర్చి * యొక్కరొకళ్ళం
బెరయఁబడసిపరమసుఖా । చరితాత్మకులైరి జగము * సమ్మదమొందన్ || భా ||

కొబ్బరకాయలు = నారికేళశలాటువులు.

సీ|| బిరుదులబ్బురము కొబ్బరకాయ బెరయుట || || అప్పకవీయము ||

మూలము.

తే. గీ|| మరులు చెమరించె నొకమరి * మిరియము చలి
మిరియు మురిపెంబు మురియలు * మురువు మురిసె
మెరమెరయనంగఁ దెమ్మెర * మొరసె మొరప
వాన కృతకేతరోక్తిని * ర్వావ్యమహిమ ||

ఇందలి పదముల కర్థోదాహరణములఁ దెలుపఁబడు.

మరులు = మోహము.

సీ॥ నునుదీఁగెఁజీరికిఁగొననీని మొయిదీఁగె మురిపెంబు డెందంబు మరులుకొల్ప ॥భా॥

చెమరించుట = ఆర్ద్రమగుట.

ఉ॥ కంపనలీలమై నసదు * కౌనసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమ * రింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమ్ము * దుధ్వనితాళగతిన్ జెలంగఁగా
సంపెఁగనూనెయంటె నొక * చంద్రనిభానన కంసవైరికిన్ ॥ ॥పారి॥

ఒకమరి = ఏకవారము.

(మరియనఁగా వారార్థకము గావున నది రెండుమూఁడు విధములుగఁ బ్రయోగింపఁబడు. ఇమ్మరియనఁగా నీసారి. ఇట్లూహింపవలయును, ఒకపరి యనియునుగల దదియు నేతదర్థమే. లఘురేఫమే.)

క॥ ధరణియుఁ గస్యపవైశ్వా । నరమార్కండేయులోవి * నజగద్ధితవా
క్పరులై రొక్కెడఁదా రొక । మరి గోష్ఠినిరతినుండి * మనుజాధీశా ॥భా॥

క॥ సురసరిదాత్మజుఁడును శర । గురుఁడును గర్ణుండుఁ దెగుట * కుందలఁకక యె
వ్వరి బాహుబలముఁగొని యి। మ్మరి కోల్తలఁజేసిరొక్క * నునవారసికిన్ ॥భా॥

మిరియము = మరిచము.

క॥ తరుణికి ధాత్రీపతికినిఁ । బరిచుంబన వేళదంత * పరిపీడనమి
త్థురసంబుఁ బానకములో । మిరియపుఁగారంబువోలె మెచ్చొనరించెన్ ॥నై॥

చలిమిరి = శైత్యము.

సీ॥ చల్లనయివం బిగరుజీము చలిమిరి చలి............. ॥ఆంధ్రభాషార్ణవము॥

చ॥ సురభికురంగనాభికలు * చొక్కపుఁగుంకుమఁగప్పి కుంకుమ
స్ఫురితమహోష్మఁ గప్పురపు * సోఁకులమానిపి కప్పురంపుఁ జ
ల్మిరి మెఱుఁగుం జవాది నెడ * లించి కదంబముగూర్చి నెచ్చెలు
ల్తరుణి కలందిరన్నియును * దత్తనువాసనఁ బూవుఁగట్టుచున్ ॥వసు॥

మురిపెము = సొగసు.

(ఈశబ్దమునకు రాఁగల 30-వ పుటలో "మురియుట" యను శబ్దమునకు వ్రాసియున్న ప్రయోగములఁ జూడఁదగును.)

ద్వి॥ మురిపెంబులింపారమొగిమృదంగాదివరవాద్యములు వేడ్కవాయించువారు॥ర

మురియలు = తునకలు.

క॥ తరులును గిరిశృంగంబులు । నురువడిఁగొని మీఁదవైవ * నురుపల్లములన్
మురియలు సేయుచునయ్యు।చ్చరకొదుకుభనుఃకళావి*శారదుఁడగుటన్ ॥రా॥

మురువు = శృంగారగర్వము, సంతోషాతిశయము.

సీ॥ కరములుదునిసిన మురువుఁజెప్పెడివారు పొట్టలుచీరినఁ దొట్టువారు ॥రామా॥

మురియుట = సంతోషించుట.

క॥ కరములురెంటను దాల్చిన । పరికరములఁ జూచియతనిఁ బరమేశునిఁగాఁ
బరికించిలేచివలఁగొని । మురియుచుసాష్టాంగదండములొనర్చి వెసన్ ॥అప్ప॥

మెరమెర = కలఁక, అనఁగా హృదయగ్రంథి.

క॥ పురుషుండన వేఱొక్కఁడె।పురుషోత్తముఁడైననేన పురుషోత్తమతా
స్ఫురణకుఁబురుషత్వంబును।మెరమెరగలదదియకాదె మేకొనఁగ్రియలన్ ॥భా

తెమ్మెర = వాయువు.

చ॥ హరికిన్ స్వాస్థ్యముగల్గె, వహ్నికినిఁ బ్రాజ్యస్ఫూర్తియబ్బెన్, నిశా
కరమార్తాండుల కాత్మమండల సమగ్రప్రాప్తిసంధిల్లెఁ దె
మ్మెరకామోదముపూనఁగల్గెఁ ద్రిజగన్మిత్రుండు కాకుత్స్థుఁడు
గ్ర రణక్షోణి సబంధు వర్గముగ లంకానాథునింద్రుంచినన్ ॥హరిసల॥

మొరయుట = ధ్వనిసేయుట.

క॥ సురలార్చిరి తూర్యంబులు।మొరసెననేకంబులపుడు మోదమున మునుల్
హరిహరులంగీర్తించిరి । సురేంద్రునగ్గించి రధికశుభవాద్యములన్ ॥భా॥

మొరపవాన = శర్కరిలవర్షము.

సీ॥ మొరపనేలయనంగ మొరసనేలయనంగ శర్కరిలావనిసంజ్ఞవెలయు ॥ఆం-భా॥

తే॥ మొరపవానపెల్లుఁ గురిసెనులాకతతి।దుల్లఁబడియెఁ బిడుగులెల్లయెడల ॥భా॥

మూలకము.

తే॥ రమణ రహి రంగు రట్టడి రజ్జులాఁడు।రెండు రెంటము రెట్టించె రెడ్డి రోదయు
వరుస వరిచేను వరపు డోవరి వరకులు।వరుగు వరుజులు వరువు నేవకసురాగ.

ఇందలి పదముల కర్థోదాహరణములఁ దెలుపఁబడు.

రమణ = ఒప్పు.

తే॥ జనులు నిగ్రహా నుగ్రహశక్తుఁడైన। రాజు శాసనమునఁ జేసి రమణతోడ॥ భా॥

రహి = కోరిక.

సీ॥ ............రహిఁ గళల్వ్యాను సర్వజ్ఞమౌళి॥ ...॥వసుచరిత్రము॥

రంగు = ఒప్పు.

క॥ ............రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్॥ ...॥అప్ప॥

రట్టడి = అధికము.

ఉ॥ రట్టడికాకునూరి పెద రంగయసోముఁడు గాంచె వేడుకన్॥ ॥అప్ప॥

రజ్జులాఁడు = ప్రల్లదుఁడు.

సీ॥ రంకెలు రజ్జులు రమణరక్కసి రహి॥ ... ...॥అప్ప॥

రెండు = ద్విసంఖ్య.

సీ॥ తనకులంబునకట తక్కువకులముల రెంటను బరిణయశ్రీవహింప॥ అప్ప॥

రెంటము = ద్విపటి (దుప్పటి)

సీ॥ కటిమానికంబుల గములరేటలుగఁ గూరిచిన మేల్పట్టంపు రెంటములును ॥య॥

రెట్టించుట = ఇనుమడించుట.

క॥ నిజభూషణాతపత్ర। ధ్వజకంకటబంధ వేష్టితము లైనకురు
వ్రజగాత్రశకలములు వా। రిజనాభ కనుంగొనంగ రెట్టించెవగల్ ॥భా॥

రెడ్డి = జాతివిశేషము.

క॥ శ్రీరెడ్డివేమవిశ్వ। క్ష్మారమణ కృపాకటాక్ష సమధికృతైశ్వ
ర్యారూఢవిభవశృంగా। మారారిపదాబ్జభృంగ మామిడిసింగా॥ ॥నై॥

రొద = ధ్వని.

లయవిభాతి॥ ...కా। శ్మీర కృతసేతువులదాఁటిఁ జనుచో నచటఁ
గూరుకలహంస లగడై రొదలు సేయన్॥ ॥వసుచరిత్ర॥

వరుస = క్రమము.

ద్వి॥ వరుసదివ్యులు పుష్పవర్షంబుగురియ సురనాథుఁడా రాజుసుతు మేనితోడ॥రం

వరిచేను = కేదారము.

సీ॥ వరిచేను వరుజులు వరుసయు వరుపును ... ...॥అప్పకవీయము॥

వరపుడు — దాసి.

సీ॥ బోనగత్తియ తొత్తు వరపుడు దాసినా॥ ... ...॥నిఘంటువు॥

క॥ వరపుల్లఁ గలసితనయులు । వరువడిఁదుడువంగఁగృష్ణఁ బనుచువగన్నా
సురరాజ్యదర్పమొప్పవి।దురుఁజెచ్చెరఁబనిచెదానిఁ దోడ్కొనిదేరన్ ॥భా॥

ఓవరి — గది.

సీ॥ .........ఓవరి విరవిరఁబోవుటయును॥ ... ...॥అప్ప॥

వరకులు — చిక్కులు ; కపటపువంచనలు.

చ॥ స్థిరమతిబుష్యశృంగునిటఁ దేరఁగ భూవర యేము సాల మ
ప్పరమ తపోధనోత్తముని పాలికిఁగాంతలఁ బంపు పంపినన్
సరసతరోక్తినేగి మునిసత్తము చిత్తము వచ్చునట్లుగా
వరకులఁబెట్టితెచ్చెదరు వారవిలాసినులెన్నిభంగులన్ ॥ ...॥రామా॥

వరుగు — ఎండఁబెట్టినకూరగాయలు.

తే॥ పెరుగు వడియంబులును బచ్చివరుగు లాలువు॥ ...॥ఆముక్తమాల్యద॥

ద్వి॥ వరుగులువడియములావసనోదకములురుతరరుచినొప్పనూరుఁగాయలును॥ర॥

వరుజులు — మడిగనిమలు.

సీ॥ వరిచేను వరుజులు వరుసయు వరుపును॥ ... ...॥అప్పకవీయము॥

వరుపు.

(పైశబ్దమునకు వ్రాసియున్న యుదాహరణముంజూడఁదగును.)

మూలము.

తే॥ వెలువరించుట సవరించె సలవరించె । విరులు విరవిరఁబోయె నీవిరులు విరివి
విరిసె విరవాది వెరసియు వెరవు కోస । లాత్మజోత్తానశాయి నీతానుయాయి॥

ఇందలి పదముల కర్థోదాహరణములఁ దెలుపఁబడు.

వెలువరించుట — బయల్పఱచుట.

తే॥ మృగయులందఱుఁగని వెల్వరించినిశిత। కాండములఁజెండిరొక పెద్దకాఱుఁబోతు
॥మను॥

సవరించుట — చక్కఁబఱచుట.

చ॥ ప్రిదిలిననీవిఁ గేలసవ * రించుతలోదరి నూర్పుఁజూచిలోఁ
గదిరిన పాపభీతిఁ బతికన్నులు మోడ్చ ॥నైషధము॥

ఆలవరించుట=సంఘటించుట, లోఁబఱచుట.

క॥ ధరగుర్వర్థిజనానా। దరమొప్పదు నీమ్ము ధరణిధవ శుభకన్య
త్వర నాకన్యలసితవా। రిరుహసమాలోకనలవరింపుము వేడ్కన్ ॥హరినల॥
(ఇందుఁబ్రకృతమగు నలమహారాజు కథయందు "లసితవారిరుహసమాలోకను" అలవరింపుమని యర్థము).

విరులు=పుష్పములు.

ఆ॥ మదగజాభిరామమృదులయానంబొప్ప। నల్లఁబోలయుచును లతాంతరములఁ
గరములీలఁగమ్మవిరులు గోయుచునున్న। పువ్వుఁబోఁడి నొకకపాలఁతిఁగనియె॥

విరవిరఁబోవుట=గాత్రావసానము, అనఁగాఁజచ్చుట.

చ॥ సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపు నేలఁజూడఁగా
విరవిరఁబోయె మేను నిదువెంద్రుకవెట్టుచుఁగంపమొందెఁజే
నిరతముగాదు గాండివమునిల్వఁగ నోర్వవు గాళ్లు లేసు ని
ష్ఠురతకుఁ జాలనెల్ల నొకఁడున్నహినేలుట యేటిసౌఖ్యముల్. ॥భా॥

సీవిరులు=వింజామరలు.

(ఈపదమునకుఁ గొందఱు చిఱుగొడుగులనిరిగాని యది సరిగాదు)

సీ॥ వింజామరములన వింజామరలనంగ వీచోపులనఁగ సీవిరులనంగఁ
జామరాహ్వయములు. ॥వేంకటేశ్వరాంధ్రము॥

శా॥ సారథ్యంబువహింపభీముఁడు సితచ్ఛత్రంబు గాండీవి చె
ల్వారంబట్టఁగ సీవిరుల్గవలిడన్ ... ... ...॥భా॥

క॥ ఉచితగతిఁజేరివంది। ప్రచయము గీర్తింపనెక్కె రథమందొనరన్
రచియించిన వజ్రంబుల। రుచులంబొలుపారు సీవిరులు బెరయంగన్ ॥భా॥

క॥ ద్విరదంబుల నరదంబులఁ। దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబుల సీ
విరులం గొడుగులఁ బడగలఁ। బరిస్ఫురితమయ్యెనతని పయనంబుగడున్ ॥భా॥

(అను నీపద్యత్రయమువలన సీవిరులనఁగా వింజామరలని యగపడును)

విరివి=విస్తారము.

చ॥ విరివియొకాని పైఁబొగరు వెల్వడకుండెడు పూఁపచన్నులన్
సరవియొకాని దంతురత చాలనిసన్నపు ముత్తరంగలన్

దరళవిధంబె కాని నిసితత్వమెఱుంగని క్రొత్తచూపులన్
సరసిజనేత్ర పొల్పెసఁగె శైశవయౌవనసంధిఁజూడఁగన్ ॥కవికర్ణ॥

విరియుట=వ్యాపించుట, విడిపోవుట, వికసించుట.

తే॥ పరఁగఁబాండవాంబుధివెల్లి విరిసెనపుడు ... ...॥భా॥

క॥ ఖురములఁబూనిన రథముల । విరిసిన వెంద్రుకలు నెఱిస్రేలఁగ దశకం
ధరుఁడు బహుశైలావృత । శరీరుఁడై దక్షిణంబు సనఁగనుఁగొంటిన్ ॥భా॥

ఆ॥ విరియుఁ గువలయంబు విధిపథంబుఁజలించు... ...॥వసుచరిత్ర॥

(ఇచ్చట భూమివిచ్చిపోవునని యర్థము. కలువ వికసించునని భావము. రెండర్థములయం దేకరేఫమేయని మున్నుగాఁజెప్పంబడియెను)

విరవాది=మాలతి.

క॥ నరనాథసమర్పితమగు । విరవాదులదండమొప్పె వెన్నునిపాదాం
బురుహంబు నంగుటంబున । సురివినయాకాశగంగ కుపమానంబై ॥నై॥

వెరసి=మొత్తము.

చ॥ తరుచరసేన సాగరము దాఁటినచందమువీటిపెంపు వా
నరభటులున్నసొంపు కపినాయకులాడెడుపంతముల్ నివా
కరసుతుసొంపురాఘవుల గర్వములొక్కొకవానిఁగొల్చు పె
న్వెరసుల సంఖ్యలుంగలయ నేర్పననేర్పడఁజూచిరందొగిన్ ॥రా॥

వెరవు=ఉపాయము.

క॥ సురతంబునఁగడునెక్కుఁడు । పురుషులకంటెను సుఖంబుపొలఁతులకు సురే
శ్వరయట్లగుటను నాకీ । వెరవున రమియించి నిలువ వేడుకగలిగెన్ ॥భా॥

మూలము.

సీ॥ ఆరగించుట యారఁగూర టారికయు నింపారె వాలారుఁజూపారెకులను
ఆరటం బీరెలు గిరిక లీరమీ రూరక యూరుపు లూరె నూరు
ఊరార్చె నోరుచు టోరసిల్లుట కారు కారించెఁ బోకారెఁ గారుకొనుట
కూర కూరిమి కూరెఁ గూరిచెఁ గేరెఁ గేరడము కోరికలు కోరడులు కోరెఁ
గోరు గోరాడె గోర బంగారు మినువ । గారె గిరనగింజలు గోరువెచ్చ
గోరు చీరికిఁగొనకుండెఁ జీరెఁ జూరు । చేరుఁద్రావుట చేరువ చేరెఁగృష్ణ॥

(ఇందలిపదముల కర్థోదాహరణములు దెలుపఁబడు)

ఆరగించుట = భోజనముంజేయుట. (ఇది తద్భవక్రియ.)

తే॥ అలరుఁబోఁడులువడ్డింపనచటఁగలహ। భోజనుఁడుదానుబహుభక్ష్యభోజ్యలేహ్య
చోష్యపానీయములమధుసూదనుండు। సారెఁగొనియాడుచును వేడ్కనారగించె.

ఆరఁగూరుట = లెస్సఁగానాఁటుట.

శా॥ ఈ రూపంబున సంస్తుతిందొరఁగి మీరెంతంతయేఁ జింతలన్
జేరంగోరక యూరకున్న నిటవిచ్ఛేయంగఁ జేయం గడు
న్స్ఫారంబే వినునంతయుంగలిగె నేబాలార్క బింబంబులో
నారంగూరిన యంధకారమన నాహా సాహసంబెట్టిదో ॥హరి॥

ఆరిక = ధాన్యవిశేషము.

ఆ॥ పూరిపంటపాలు నారికబియ్యంబు। జంతువున్నఫలము శ్రాద్ధకృతికిఁ
గావు తుమ్మ్రనేడ్పగాదుశ్రాద్ధక్రియా। చరణకర్మములఁబ్రశాంతివలయు॥భా॥

ఇంపారుట = ఒప్పుట.

ఉ॥ భూరమణీశ యాఘనతపోవ్రతచంగుని ఋశ్యశృంగునిం
దేరఁగఁబంచియాతనికి ధీయుత నీసుత శాంతనిచ్చినన్
భూరి సువర్షముల్గలిగి భూమిసమృద్ధి వహించునన్న నిం
పారఁగ మీరువేగచని యామునిపుంగవుఁ దెందునావుడున్ ॥రామా॥

వాలారుఁజూపు = మొనవాఁడిచూపు.

శా॥ సైరంధ్రిల్ పయికెత్తి కజ్జలము పక్ష్మశ్రేణికందీర్ప వా
లారుంజూపుల మీఁదుఁజూచుతఱి ఫాలాంచచ్ఛతుర్థీనిశా ॥ఆము-మా॥

ఆరెకులు = తలవరులు.

సీ॥ .............యారెకుల్తలవరులారాటమారటం ॥అప్పకవీయము॥

ఆరటము = వ్యసనము. (ఆరాటమనియుంగలదు.)

లయవిభాతి॥ స్ఫారులగువారలును బోరఁబడినెత్తురులు
గూరుటగరంబెడఁదకారటము నేయన్ ...॥వసుచరిత్ర॥

ఈరెబుఁగు = హీనస్స్వరము.

క॥ కారణమెయ్యదియగునో। వీరల దురవస్థకనుచు వెఱగందెడు నా
భూరమణుఁడుసభయునువిన। నీరెబుఁగుదలంకఁ బలికి రిట్లనిగోపుల్ ॥భా॥

ఈరికలు = పల్లవములు, తునకలు.

సీ॥ ....................యీరిక లెత్తుటయి గురువెట్టు ॥అప్పకవీయము॥

లయవిభాతి॥ ....................సారణులఁ
వేరయిన చెంగలువయీరికలలోఁగా } ...॥వసుచరిత్ర॥

(ఈరికలనఁగా నిట ఖండములుగా నేర్పఱుపఁబడిన చెంగల్వమడుఁగులు)

ఈరము = పొదరిల్లు.

ద్వి॥ బీరము ల్మెచ్చుచు భేదింపరాని । యీరముల్చొచ్చుచు నినరశ్మిలేని ॥రంగ॥

ఈరు = రెండు; (ఇరు యనియుంగలదు.)

క॥ ఈరే యొకశుభలగ్నం । బీరే వివరించి వరుసకింతికిఁగుశలం
బీరే యన వాచస్పతి । యీరేడుజగంబులేలునేలికఁబలికెన్ ॥వసు॥

ఊరక = మిన్నక.

క॥ నారాయణాభిదానులు । వారలుగయ్యంబుఁజేయువారొక్కెడ నే
నూరకనిరాయుధవ్యా । పారతనైనుండువాఁడఁ బరమాప్తుఁడనై ॥భా॥

ఊరుట = అభిలషించుట.

సీ॥ తాసుధామయుఁడయ్యుఁ దరుణికెమ్మోవిసుధారసంబునకు నూరూరుచుండు

ఊరు = గ్రామము.

ఉ॥ శూరుఁడవంద్రు నిన్నమడుఁగుఁజొచ్చుట శౌర్యముచొప్పె మాన మే
యూరికిఁబోయె నాజినృపు లోడుదురే నృపుఁడన్నమాత్రమే
కౌరవవంశజాతుఁడవు గష్టపుఁజావునఁజెచ్చికొంటి నీ
పేరునఁబెంపుఁ గ్రుంగ నరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే ॥భా॥

ఊరార్చుట = ఆశ్వాసించుట.

క॥ ఊరార్చి యింక నుచితా । చారంబులు నడపుటయ యుచితఁగృత్యము దు
ర్వారంబగు విధినేఁతకు । నేరికి నడ్డపడవశమె యేల యలదురన్ ॥నై॥

ఓరుచుట = క్షమించుట.

సీ॥ హరియాజ్ఞ రక్షించు సాక్షరోచ్చారపారుష్యభారమున కోరుచునె జిహ్వ ॥భా॥

ఓరసిలుట = ఒత్తిగిలుట.

క॥ ఓరగిలియుండకే యో । రోరి యకట మాసమీపపూరనె మనియున్
దూరము వోయితివీసా । ప్మౌరీతిని నీకుఁదక్కనే కానీరా ॥ఆము-మా॥

కారు = కాలము.

క॥ కారుమెఱుంగన మరుదే । వేరిమి తానంగఁ బైరి విడిదండల బం
గారపుబొమ్మల్గాసిం । గారంబున దేవయాన కడుఁజెలువొందెన్ ॥య॥

కారించుట = బాధించుట.

ఉ॥ సంపదదక్కియుండఁగ నశక్తులనంజను మమ్ముఁబిల్చి పూ
జింప నతండు బేలె పతిసెప్పెడువారల బుద్ధి నాఁడు మ
న్నింపఁడ యింకనేయగు నీవడియాసలవచ్చి ఆర్తిఁ గా
రింపక మానుమాతని చరిత్రము నీకును మాకు విశ్రుతమే ॥భా॥

పోకారుట = చచ్చుట.

శా॥ ఓరా వెన్నకుఁబండ్లువచ్చె నిపుడాహా పుష్కరుండంతలో
పోరుండాయెనె యింక నేమనఁగవచ్చు న్నావిగర్వంబుఁ బో
కారంజేయక మాననేర్చునె మదీయంబైన బాహాసి దు
ర్వారారాతి కఠోరమస్తక పటత్ప్రాగల్భ్యభారంబునన్ ॥న.రా॥

కారుకొనుట = సాంద్రమగుట.

క॥ కారుకొని మేఘమాలా । కారంబునఁజాలనొప్పెఁ గౌరవసైన్యం
బారూఢ వీరరస వి । స్ఫారంబై యతఁదోఁచెఁ బాండవబలముల్ ॥భా॥

కూరలు = శాకములు.

సీ॥...............చేకూరుట కూరిమి కూరఁదినుట ॥అప్పకవీయము॥

కూరిమి = ప్రియము.

క॥ దూరపథమేగి నాకా । హారముఁదెచ్చుకొనఁ జాల యటుగావున నా
కూరిమిపుత్త్రుఁడు నాకా । హారముఁగొనివచ్చి పెట్టు నాఁకలిదీఱన్ ॥రా॥

కూరుట = నాటుట, పొందుట, నిద్రించుట.

క॥ వారొక యుగ్రతపోవృత్తిన్ । గూరియు ధర్మంబు నెఱపుటకుం జాలరు దు
ర్వారబలులయ్యుఁ బాండుకు । మారులు శాంతాత్ములండ్రు మనుజాధీశా ॥భా॥

లయవిభాతి॥......కా । శ్మీరకృత సేతువుల దాఁకి జనుచోనచటఁ
గూరుకలహంసలగడై రొదలు సేయన్ } వసుచరిత్ర.

కూరుచుట = సంధించుట.

సీ॥ రేఖాచతుష్టాలఁగూరిచినయచ్చంబులో రహిఁబెంపఁడి భువనంబురవలియక్షరని॥య॥

క॥ మేరచెడకుండరేఫలు । కారంబులతెఱఁగెఱింగి కబ్బంబులలోఁ
గూరుపవలయునుసుకవులు । సారెకుఁదద్భేదములు విచారించి శివా॥తిమ్మకవి॥

కేరుట = కేరడము.

గీ॥ తప్పగలభర్తమ్రోలసోత్ప్రాసఘణితిఁ । గేరడములాడుసతిమధ్యధీర స్ఫార
పరుషవచనయధీరసబాష్పకుటిల । హారివచనధీరాధీరయనఁగఁజెలఁగు॥నరస॥

ద్వి॥ ధీరుఁడైనిలచి గద్దించి యింద్రజునిఁ । గేరడంబాడి సుగ్రీవుఁడిట్లనియె॥రంగ॥

క॥ కోరికలమఁజూరక యసం । గారూఢతగల్గియెల్ల యందున నమరుకా-
గూరినచిత్తంబులుగల । సారాత్మకులీపథమునఁ జనుటకుశక్తుల్ ॥భా॥

కోరడి = వృత్తి, కరగోడ.

సీ॥ .............. కోరాడెఁ గోరడి కోరగిన్నె ॥అప్పకవీయము॥

కోరుట, కోరు = భాగము.

సీ॥ .............. కోరిక కోరుట కోరప్పనము ...॥అప్పకవీయము॥

కోరాడె = కోర.

(కోరడియను శబ్దమునకు వ్రాసిన యుదాహరణముం జూడవలయు).

బంగారు = స్వర్ణము. (బంగరనియుంగలదు.)

గీ॥ దీవులారును జుట్టును దిరిగియుండ । దీవులకునెల్ల నేరేడుదీవియొప్ప
మేరుకైలాసగిరులబంగారుగొడుగు। ధవళతరచామరంబులైదనకునమర ॥నై॥

గారె = భక్ష్యవిశేషము.

సీ॥ గారెలుభక్ష్యముల్ గారాము బంగారు ... ...అప్పకవీయము॥

గీరనగింజలు = క్రీడావిశేషములు.

ఉ॥ తోరపుగబ్బిచన్నులఁట తూఁగఁగఁబాఱుచుఁగేరుచొండారుల్
గోరిక నిత్తుదండములలోఁ గనుపట్టెడుమౌక్తికవ్రజం
బేరిచితెచ్చి వేదలిరు టీరములందు నెయారమొప్పఁగా
గీరనగింజలాడిరి సఖీజనముల్ మనముల్ జిగుర్పఁగన్ ॥నలరాజచరిత్ర॥

గోరువెచ్చ = ఈషదుష్ణము.

ఉ॥ క్రూరతఁ గోర్చియుంచుకయు రోయకనైకొని యెల్లభంగులన్
వైరులఁజంపి భూప్రజకు వర్ధనముం గలిగించుపాడినై
గోరరిగొంచుసద్క్రియముఁ గోరియొనర్చుట రాజధర్మ వి
స్తారముగా బలారికి వచస్పతి సెప్పుట యప్రసిద్ధమై॥

(గోరరియనఁగాఁ గొంచెపుఁబన్ను. ఈశబ్దమునకు స్వల్పార్థకత్వమందు లోకవ్యవహారముఁ దెలియుటకై గోరువెచ్చయని చెప్పఁబడియె.)

గోరు = నఖము.

రగడ॥ గోరగోరఁటనించితివా కలిగొట్టుగొట్టుగఁ గోయఁబోసఁగవు
నారినారికడంపుఁ బాలెలు నాకు నాకులవృత్తినొసఁగవు ॥వసు॥

చీకిఁగొనకుండు = లక్ష్యము సేయకుండు.

ఉ॥ దారుణదైత్యసాయక వితాన విజృంభణమాత్రలోపలన్
జీరికినైనఁగైకొనక సీరధరానుజుఁ డద్రిభేదన
స్ఫారబలోగ్రమైన పవిభంగి వెలింగెడిబాణమొక్కటన్
వైరి యురంబువ్రచ్చి యసువర్గముతోఁ బెడఁబాపెఁజెచ్చెరన్ ॥ఎ-హా॥

చీరుట = భేదించుట, పిల్చుట.

సీ॥ ......చీరుట పిల్చుట ... ... ...॥అప్పకవీయము॥

చూరు = పొడి, చేరుద్రావుట = పడిదముద్రావుట.

సీ॥ ......చూరనఁగాఁబొడి చేరుద్రావుట ... ...॥అప్పకవీయము॥

చేరుట = పొందుట, వచ్చుట.

క॥ చేరఁజనుదెంచిపాండవ । వీరుఁడు మత్స్యాధిపునకు వినతుండై దే
వా రాజవాహనములగు । వారువములనరయ నేర్తువల నేర్పడఁగాన్ ...॥భా॥

చేరువ = సమీపము.

క॥ ద్వారవతినొక్క-నాతం । దోరపుఁదనువక్క-జమగు తొండమొకటి య
చ్చేరువ మెలఁగుజనులఁగని । నీరిదిగలగించునిట్లు నిలచినయేనిన్ ॥ ...॥భాగ॥

మూలము.

సీ॥ తారసిలుచుట తీరు తేరసామ్మె తేర తేపతోరము నారనారితీరు
నేరుపునేరెడు నోరు పూరేదును బూరిపేరెలుపేరు పేరఁటాండ్రు

పోరుపోరాటమి పోరుపోరితమును బోరచి బారాది బారుబారి
బారిసమనుటయు బూరుగల్పారెలు బూరిటిల్లుటయును బేరజంబు
బేరములు బోరగిలె బోరబోగుగొండ । మారిమసఁగుట మారేడు మారుతురును
మూరుకొనుటయు మేరలు మేరతోపు । శ్రితజనోద్యానమాధవాయితవఃత్ర॥

(ఈపద్యమందలి శబ్దములకర్థోదాహరణములు దెలుపఁబడు.)

తారసించుట = సమీపించుట.

సీ॥ తారసించినచోటబీరానఁజూరఁబాఱియొకటి రెంటనిదొబ్బలురులనడఁచు (మను॥

తీరు = సొగసు, విధము.

సీ॥ తీరు మీఱంగఁగస్తూరినామముదిద్ది బటువుతాయెతులుసందిట ధరించి॥ నలరాజ॥

ద్వి॥ క్రూరుఁడై పింగళాక్షునితోఁ గఁగట్టి । కారాకు సురగాలి కడువాడిఁద్రిప్ప
తీరున దిద్దిరఁద్రిప్పుచుమింటఁ । దోరణస్తంభంబుతోఁ బ్రేసిచంపె ॥౪౯॥

తేరసొమ్ము = ఊరకవచ్చినధనము.

సీ॥ ......... తేరకుఁదేర తేరోరోఁసొమ్ములు తేరముగను ॥అష్టకవీయము॥

ఏతేమట = వచ్చుట.

క॥ తేరకయుండఁగఁజేయుం । దేరంగాఁబోలియు విధి యధీనంబులు గా
కారయ విత్తంబులుపురు । షారంభాయత్తములే మహాబుద్ధినిధీ ॥భా॥

తేరు = రథము.

క॥ నేరమ్మునైవఁబుఱుఁదాడి । తేరెక్కి యుదస్పఁబ్రాంక డీఱదనీకున్
సైరంధ్రిసెప్పనీదగు । బీరంబును బెంపులావు వెరవును మాకున్. ॥భా॥

తోరము = గొప్ప, (ఇవి స్థూలశబ్దభవము)

క॥ ఆరెంటఁబలములందును । దోరంపై యున్నయట్లు దోఁచెం బాండు
పౌత్రకమణసుతబలము నర । నారాయణులునికిఁజేసి నాపంజూడన్ ॥భా॥

నార = వల్కలము.

ఉ॥ నారలుగట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారమునంగృశుండయిన బ్రాహ్మణుఁడీ లలితాంగిఁ బెండ్లియై ॥ఎ-హరి॥

నారి = గుణము.

("నారం నరసమూహే స్యాన్నారీ-జ్యాతరుణీ స్మృతా" యని శబ్దలింగార్థచంద్రికలోఁ జెప్పఁబడియుండుటవలన నిది సంస్కృతముగఁ గనంబడుచున్నది. అయినను "సీ॥ అల్లెయరినారిగొనయ మంచనఁగమౌర్వి" అనియాంధ్రభాషార్ణవములోనుండుటవలన నిట్లుచెప్పఁబడియె. సంస్కృతాంధ్రంబులయం దేకరూపంబు గలిగిన శబ్దములుగాఁ గొన్నిగలవు. పల్లకీ శబ్దము పల్యంకికాభవమనియు నాంధ్రపదమనియుఁ గనంబడుచున్నది. "ప్రోల్లసత్పల్లకీజాలైః" అని సంస్కృత ప్రయోగంబునుగలదు గావున నీశబ్దమునకు సంస్కృతాంధ్రములయం దేకరూపమనిగాని లేక తద్భవమనిగాని విచారింపవలయు. ఇట్టిశబ్దము లనేకములున్నవి.)

తే॥ కారణము లేక యూరకే నారిదెగిన। విడిచిపెట్టక రణరసావేశమొదవఁ
బట్టికోదండదండంబుఁ బరిఘుగాఁగ। విసరుచును వచ్చె వేఱొక్క వేల్పుజోదు॥ పా

నీరు = జలము. ఇది నీరశబ్దభవము. (దీనిం దత్సమమనికొందఱు)

ఆ॥ నీరిలోనఁదోఁచు తారకప్రతిబింబ। మొక్కొ యనఁగ వెలుఁగుచున్నదాని ॥భా॥

నేరుపు = నైపుణ్యము.

క॥ ............నే। రుపునం బల్లేరు లవలఁ ద్రోయుచుఁ జనుచున్ ॥ ॥ఆ-ము॥

చ॥ ......నే। ర్పునఁ దలవంచి పీఠతటరూఢమణిన్ బొటవ్రేలమీటు న
య్యనఘుఁడు కొండమీఁటినమహాద్భుతకృత్యముఁ దెల్పు కైవడిన్ ॥చ

నేరేడు = జంబువు.

ఉ॥ నేరెడుదీవియేలు ధరణీపతిముఖ్యులు వీరెకూడి యు
న్నారు మనోరథంబులు మనంబులఁ బాయక సంచరింపఁగా
నీరజపత్త్రనేత్ర యొకనిన్వరియింపుము... ... ...॥నై॥

నోరు = వక్త్రగహ్వరము.

శా॥ ఓరీబ్రాహ్మణ ధూర్త! నాయెదుట నోహో సాహసంబెట్టిదో
వైరంగోరినుతించు మాటలెటఁ గావచ్చెం గృతఘ్నాయిదెన్
న్నోరేయెవ్వరి కెవ్వరయ్యెదరు నిన్నుం బెంచి మన్నించినం
గారామైయిటు జేసితే తొలఁగుమింకం జాలు నీకార్యముల్ ॥సో-హ॥

పూరేదు=పక్షి విశేషము.

సీ॥ పూరేడు జగడంబు పేరుట పేరాఖ్య ... ...॥ అప్పకవీయము॥

పూరి=గడ్డి.

గీ॥ కాలఁగేలఁగోలఁ గపిలదండించిన। నరకవాసమునకు నరుగవలయుఁ
బూరినీరులెస్సయారనియీగోవు। సత్కరింప శుభము సంభవించు॥ ॥భా॥

క॥ నీరజగర్భాండంబుల। నారసిచూచినఁదదీయ యత్నమువెలిగాఁ
బూరితుదయైనఁగబుగ। న్నేరదదరహస్యతత్త్వ నిర్ణయమునుమీ॥ ॥క॥

పేరెలు=లంఘన విశేషములు. (పేరెములనియుఁగలదు.)

శా॥ ఈ రావేలుపు ఱేఁడు దామగఁడుగా నేనొమ్ములన్నొంఁచెనో
కా రాకానులమొజ్జహూఁతురనుచుం గార్కొన్నకోర్కుల్మదిం
బేరెల్వెట్టఁగలోనఁ బూవిలుతుఁడుం బ్రేరేపఁగానంతటన్
జేరంగాఁజనుదెంచు రాజుఁగని వేచెంబాన్పుపై దిగ్గనన్॥ ॥య॥

పేరు=నామము, హారము, విశాలము.

"ఊరు" అను శబ్దోదాహరణములం జూడవలయును.

క॥ ..................పేరెద పేరెమును పూసపేరుంబేరుం
బేరుంబోరచిపోరుం। బోరామియుఁబోరితంబు భువిరేఫలజా॥ ॥తిమ్మకవి॥

గీ॥ ధారుణీపతినిద్ధంపుపేరురమున। నలరెఁబ్రతిబింబమునుదాసు నలరుచుండ ॥నై॥

పేరఁటాండ్రు=సువాసినులు.

గీ॥ పేరఁటాండ్రురహస్తపంకేరుహములఁ। జూచియెత్తినవకంపుజాజుగుండ॥నై॥

పేరుట=ఘనీభవస్వభావము.

ఉ॥ పేరిననెయ్యి దుగ్ధమును పెర్వను మీఁగడయున్పదా వ్రజా
గారములందుఁద్రావి వెసగంతులువైచుమురారి నెంచఁగా
ధారుణిరూఢి కెక్కు నవతారవిరామముచే లసద్భరల్
భారలగంబులం గలయఁ బల్కిన నుత్పలమాల చెన్నగున్॥ ॥అప్పకవి॥

పోరామి=స్నేహము.

క॥ పోరామిచుట్టమితఁడనఁ। గూరిమిచెలికాఁడనంగఁ గూరివరుస గో
త్రారిహరిబాంధవులపే। ర్వేరంగుశలంబులడిగి ప్రియమలరారన్॥ ॥ఎం-హరి॥

పోరు—పోరితము = యుద్ధము.

ఉ॥ వారుమహాబలుల్ హరియువారికిఁ బ్రాపుగలందువారలం
బోరజయింపరామియను బుద్ధినెఱుంగుదునైనఁగౌరవ
ఘోరమణుండు సేయఁదగుమన్ననవెల్ల ... ...॥భా॥

ఉ॥ కౌరవపాండవుల్ దెఱఁగుఁజైకొని శాంతతఁబొందియున్కి—మే
లారయనాకునీకుఁ గులమంతకు నీన్నపకోటికుర్వికిన్
బోరితమైన నింతకునుబుట్టుమహాపద... ... ...॥భా॥

పోరచి = దుర్లభమైన ప్రశస్తవస్తువు.

గీ॥ గగనతలలక్ష్మిపోరచిగాఁగ నిడిన। జాలనుప్పారుముత్యాలజల్లివోలె ॥పారి॥

ఉ॥ కోరినకోర్కెకుందగఁగఁ గుంతి సుతత్రితయంబుఁగాంచె గాం
ధారియునక్కడన్ సుతశతంబు ముదంబొనరంగఁగాంచె నే
బోరచియాడఁబుట్టువునఁబుట్టి నిరర్థకజీవనైతి ... ...॥భా॥

బారాది = అధికము, బహుళము,

క॥ వారిరువురుఁ దమలోపల। వేరముఁగొని రాజ్యకాంక్ష విజిగీషువులై
హోరాహోరింబోరిరి। బారాది దినంబులవనిఁ బ్రజలుదలంకన్ ॥ఆము॥

[ఇచ్చటనాముక్తమాల్యదా వ్యాఖ్యాకారుఁడు "బారాది" యనఁగాఁ బన్నెండని యర్థమువ్రాసినాఁడుగాని, ఖాండిక్యకేశిధ్వజులు పన్నెండు దినములు మాత్రమే యుద్ధముచేసినట్టుగా విష్ణుపురాణములోఁ జెప్పఁబడలేదు. మఱియుఁ "దూర్పెత్తిగాలిపరికించి దిగువదెసపొలిమేర బారాదియగుదూరం బేగి" యనిమనుచరిత్రములో నాకవియేప్రయోగించెను. ఆఘట్టమునబహుత్వార్థమే గాననగుచున్నది. ఇదియునుంగాక, "క॥ ఓరోరిరాచవాఁడా। రారా నావెంటఁ దిరుగరా దాసుఁడవై। బారాదిమాడలిచ్చెదఁ। గోరా నీయప్పుఁదీర్చుకోరా యనుచున్॥ క॥ బారాదిసొమ్ములుండఁగ। హారము నే గొనుచుఁజనియెనండజముప్రియం। జారసిఫలకాముకులగు। వారలుగుణవత్ప్రసక్తివదలవిడుతురే." ఇత్యాదిహరిశ్చంద్రోపాఖ్యాన పాండురంగమాహాత్మ్యాది ప్రయోగములవలననునట్లే కానఁబడుచున్నయది. కావున వ్యాఖ్యాత నిరూపించిన యర్థమునకు మూలము మృగ్యము.]

బారు—పఙ్క్తి.

సీ॥ ..................బారుగట్టుట దైత్యు బారికిఁదప్పుట............. ॥అప్పకవి॥

బారి—ఉపద్రవము. శత్రుసమ్ముఖము.

క॥ వారిద్దఱివాలమ్ముల। బారింబడి యర్జునునకుఁ బ్రదుకన్వశమే
మీ రెల్ల నెఱుఁగరే యా। వీరులదివ్యాస్త్రశస్త్రవిభవసమృద్ధిన్॥ ॥భా॥

బారిసమరుట—చంపుట.

క॥ తారాపథమున కెగసినఁ। బారావారమునఁబడినఁ బాతాళము దు
ర్వారగతిఁ బాఱిదూరిన। బారిసమరిపుత్తుఁగపులఁబనుపుమనన్నన్॥ ॥రామాయ॥

బూరుగలు—శాల్మలీవృక్షములు, ఊఁదువాద్యవిశేషములు.

సీ॥ బూరుగచెట్లలో బూరుగలూఁదుట ... ...॥అప్పకవీయము॥

ద్వి॥ బూరుగపూవు నిప్పుకలతో నెగడి। యూరయ విరహుల కగ్నియైనిగుడి ॥రంగ॥

బూరెలు—భక్ష్యవిశేషములు.

సీ॥ ...............బూరెలు బేరంబు బేరజంబు........... ॥అప్పకవీయము॥

బూరటిల్లుట—నిండారుట.

సీ॥ నివ్వటిల్లెననంగ నిండారెననఁ బూరటిల్లెనా సమమునై యుల్లసిల్లు ॥ఆం-భాషా॥

గీ॥ పక్షిమృగజాతులెల్లను బ్రమసియిట్టు। నట్టులుగఁగొనఁ జెదరె వృక్షాదులదరెఁ
గురుబలంబులు బెదరెనంబరము దిశలు। బూరటిల్లంగఁ జెలఁగుఁ దదారవమున॥ ॥భా॥

బేరజము—ధూర్తుని పేరు.

సీ॥ ..........బేరజమన ధూర్తు పేరు వెలయు॥ ॥ఆం-భాషా॥

బోరగిలుట—ముఖముగర్భము నడుగుభాగము ద్రిప్పి శయనించుట.

కం॥ బోరగిలునించు కేనియు। నేరసినాఁడే పుమీఁఱ నీలిగితాఁచెన్
గ్రూరశకటంబుచరణాం। భోరుహతలమున నెయితఁ డపూర్వపుశక్తిన్॥ ॥ఎ-హ॥

బోరుగొండ—గొప్పతిప్ప.

సీ॥ బోరుగొండ లనంగఁ బోరలుక్రిందుగా బోరగిలుట... ... ॥అప్పకవి॥

ద్వి॥ బోరుతెప్పలను గెంపులమరకతంపుఁ। దోరణంబున నింపుఁదులకింపునట్టి॥ ॥రంగ॥

మారిమసఁగుట = సంహరించుట.

గీ॥ నారసములఁబొదవిమారిమసంగిన। శైలనఁజూచినరుఁడునని లసుతుఁడు॥భా॥

మారేడు = బిల్వము. (దీనిన్మాలూరభవమనికొందఱు)

సీ॥ మారేడుఁబండులగారాముఁజెఱచునీ యెలచన్నుఁగవవేడుకలనొనర్చె ॥భా॥

మారుతురు = శత్రువులు.

సీ॥ ....................వేమారుమారుతురన్ ...॥అప్పకవీయము॥

మూరుకొనుట = ఆఘ్రాణించుట.

గీ॥ పిలుచుదైవతపూజకు నెలువఁగణఁగు। నల్లనల్లనఁదమివుట్టనాసనరుగు
మూరుకొనఁజూచునెయ్యనఁజేరనరిగి। పరమసౌగ్ధ్యంబుచేనత్తపస్విసుతుఁడు

మేర = మర్యాద. (ఇదిప్రాకృత తత్సమశబ్దము)

సీ॥ కోరికాంతలతోఁజకోరికల్ చెలరేఁగ వారాశిగర్వంబుమేరమీఱె॥మను॥

మోరత్రోపు = ముఖత్రోపు.

సీ॥ మీరలుమేరలు మోరత్రోపులనంగ ... ...॥అప్పకవీయము॥

మూలము.

గీ॥ రాలెరాయుటరాణించెరాచుటయును। రావిరాణయురాణువరాయిడించె
రాపురాములక్రాఁజుటరూపురూక। భార్గవాశిర్వగర్వసర్వస్వచోర॥
(ఇందలిపదముల కర్థోదాహర్ణములుదెలుపంబడు.)

రాలుట = పడుట.

ఆ॥ రాలియున్నపుష్పప్రకరములవిదిర్చి। చెన్నుగానున్నజేసినసెజ్జయనఁగ ॥భా॥

రాయుట = ఒఱయుట.

సీ॥ ఇలధూళియెగసినఁబలుచగాకుండంగ రాసినతొడవులరజముదొరుగ ॥భా॥

రాణించుట = ఒప్పుట.

శా॥ రాణింపన్మఖిలక్షితిక్షిన్మకురమైరంజిల్లవేపట్టికిన్
మాణిక్యాయతనంబొనర్చె గిరి యాత్మశ్రీప్రభావంబునన్॥ ॥వసు॥

రాచుట = పీడించుట.

ఉ॥ ..............................పాపముల్
రాచుటయొండెగా కిహపరంబుల కూరకదూరమై వయ
శ్రీచన.............................................॥మను॥

రావి = అశ్వత్థము.

క॥ రావులునిప్పలు రాణదలిర్పన్ ॥ ... ... ...॥యయా॥

రాణ = వేడుక.

సీ॥ ............రాణరాణించుట ... ...॥అప్పకవీయము॥

క॥ రాణఁదనరారిన పరాగముల రాగముల ...॥రాఘవపాండవీయము॥

రాణువ = సేన.

సీ॥ ............రాణువ రాపాడి ... ...॥అప్పకవీయము॥

రాయిడించె = రాపుడువెట్టె.

గీ॥ నతమనస్కులౌ తాపసనాథులెల్ల । నతమనస్కులౌ తాపసనాథులుగను
వివిధబాధలనలయించె వెన్నడించె । రాయిడించెఁగలంచెనారావణుండు॥రా

రాపు = రాపిడి.

తే॥ రాముసామ్మనుటయురారాపువలదు ... ...॥అప్పకవీయము॥

రాములకు.

సీ॥ రాములకు రానురావి... ... ...॥అప్పకవీయము॥

రాఁజుట = ధూమసహితముగా మండుట.

సీ॥ రాచుట రాఁజుట రాయుట రాలుట ... ...॥అప్పకవీయము॥

రూపు = రూపము ; రూక = క్షుద్రనాణ్యము.

సీ॥ ............రూపుట రూపవిరూపురూక ...॥అప్పకవీయము॥

మూలము.

తే॥ రేవురేఁగుటచెలరేఁగె రేఁగుఁజెట్టు । రేలురోకలిరోఁజుటరోలురోఁత
వారకయువారకంబుకైవారములును । వారువమువారనిదయదేవేరివారి.

ఇందలిపదముల కర్థోదాహరణములు దెలుపఁబడును.

రేవు = జలావతరణప్రదేశము.

శా॥ రేవుల్ మాపుమతంగజంబును మణిశ్రీఖండముక్తాదియుక్ ॥ఆముక్త॥

రేఁగుట = విచ్చిపోవుట.

క॥ చేయఁదొణంగినగాంధా । రేయులువెసనుక్కపెట్టరేఁగిపయిపయిన్ ॥భా

రేఁగుఁజెట్టు = బదరీవృక్షము.

గీ॥ మహితకమలమధురమధురసాస్వాదన।పరవశాత్మమైనభ్రమరకాంత
రిక్తబుద్ధినకట రేఁగుఁబువ్వులరస । మానుటెల్లఁబేలవైలిగాక ॥భా॥

రేలు=రాత్రులు.

శా॥ రారాజెంతయు దీనవృత్తిఁ జవులారంబల్కఁగా విన్నయే
నీ రేయూరక నిద్రవోదు నటె యిట్లేలంటివీరోత్తమా ... ...॥భా॥

రోకలి=ముసలము.

గీ॥ రోకళులుఁబుట్టువంబులు స్రుక్స్రువాజ్య । పాత్రదండకమండలు వేత్రములును
నివి యులోనుగాఁగలిగిన యిద్ధహేమమయములొక్కటనడిపించె మనుజనాథ.

రోఁజుట=వగర్చుట; రోలు=ఉలూఖలము.

సీ॥ .............రోఁజు రోకలి రోలు రోవెలంది ॥అప్పకవీయము॥

రోఁత=అసూయ.

క॥ అనవుడు గురుఁడిట్లనుగ । ర్జునిచందము మున్నెఁగణఁగు రోయఁడు పాఱన్
విను మెఱిఁగియున్న యది గా । వున నీతండర్ధరథుఁడవున్ దలపోయన్ ॥భా॥

వారక=ఉమగక.

ఉ॥ వారక యిట్లు పూనివనవాస నిరంతర దుఃఖమున్మహా
వైరికృతాపరాధ దురవస్థయు నోర్చి శుభంబు నొందఁడే
యా రఘురాముఁడట్లు వసుధాధిప నీవును దుఃఖమింతయున్
సైరణ నోర్చి పొందెదవు సర్వమహీవలయాది రాజ్యమున్ ...॥భా॥

వారకంబు=సొమ్ము.

క॥ వారణఘోటకభాండా । గారంబులు మొదలు గాఁగఁగలరవములతో
సూరిమత యిన్నియును నీ । వారకములు గాఁగ మమ్ము వగవుము బుద్ధిన్ ॥భా॥

తే॥ కమ్మలంపిన రమ్మని కమ్మలంపు । వారకాంతల వలపించు వారకములు
మందులడి గెదవిందు కేమందు నోయి । ... ...॥వైజ॥

(ఇందు, సొమ్ములు వేశ్యలను వశీకరింపుచున్నవియని ప్రకరణరీత్యాయర్థ
మగుచున్నది.)

కైవారము=స్తుతి.

క॥ శారదమధురాలాప వి । శారద యిందాగ్ని శమన సలిలేశ నుతి
ద్వారమున నిషధపతిఁ గై । వారంబొనరింపఁదొణఁగె వాచాప్రౌఢిన్ ॥నై॥

వారువము — అశ్వము.

చేరుటయను శబ్దమునకు వ్రాసినయుదాహరణములఁ జూడవలయు.

వారనిదయ — అనివారితకరుణ.

క॥ దారిద్ర్యముచేఁగుందుచు । నేకినినదుగంగఁబోవ కెంతయుఁగృశతన్ జూరిన విప్రున కుర్వర । వారనిదయ నీగిఫలము వాగ్గోచరమే ...॥భా॥

దేవేరి — రాజుభార్య.

క॥ కారుమెఱుంగన మరుదే । వేరియ తానసఁగఁ బైఁడివిరిదండల బం గారపుబొమ్మలనంగా । ... ... ... ॥య॥

శ్లో॥ లఘుర్వాస్తిజకారస్యా లఘుస్సస్యకదావిన ... ...॥కారిక॥

(ఇందులక్ష్యగ్రంథకారుఁడు రచియించినపద్యము.)

మూలము.

సీ॥ కంజాతనాభ జకారపదంబునఁ గలుగదు లఘువుస కారపరము నందు లేదెపుడు శతాంగరేఫంబైన మొదలనారెంటినిమూలకారుఁ డుభయయుగ్వర్ణాళి నుచ్చరించుటఁ జేసి యత్యల్పముగనుండునంచుఁదలఁచి చెప్పెదవానిఁబెంజెరయునుజరుగుట నురనురన్నుక్కనురనురనఁగ నింకఁబ్రాక్కువులెచ్చటనేనిఁబ్రాస । యతులనిడినవితక్కంగ నాజకార పరమునను లేదు లఘువుసవర్ణపరము । నందుగురువును లేదుదయాపయోధి.

మూలకారుఁడథర్వణాచార్యులు. "ఉభయయుగ్వర్ణాళినుగ్గడించుటఁజేసి" యనఁగాఁ "జజౌ-తథౌ-పబౌ-వర్ణౌ-నమరావససంయుతా" అని జకార సకారములను మొదటఁజెప్పుటచేత ననియర్థము.

పెంజెర — సర్పవిశేషము.

తే॥ చెలఁగుసర్పభేదంబులు జెఱ్ఱిపెంజె । ర పసరికపాముసాఁగ ...॥ఆంధ్రభా॥

చ॥ బరవసమొప్పఁగాలి తడఁబాటుమెయిం గవిదూఱి యొక్కకు క్కురము తమంబులో మెఱయుకోఱలతోఁగబళించిపొట్టపెం జెర నఁడుమంచుఁదెచ్చికని చేవదొఱంగక ద్రుంచినైచెఁద ద్భురు బిరుదప్రమాదములకుం బతిమోద విషాదశాలిగన్ ॥మనుచ॥

కుర్కురమనఁగా శునకము. పొట్టపెంజెరయనఁగా సర్పవిశేషము.

జరగుట=కడచుట, వెడలుట.

క॥ గరుడుఁడు నడువఁగ దూరము। జరిగిహరియుసలిలపాలు సన్నిధిబాణా
సురగోగణములయునికియు।స్థిరముగవినియతనిదిక్కు నేరుతలఁపునన్॥ సో. హ.

జరపుటయును రేఫమేయగునని తెలియఁదగు.

☞ సకారపరగురు రేఫములకుఁ దృతీయాశ్వాసమున నుదాహరణము లీయఁబడును.

మూలము.

ఆ. వె॥ సరస సరవి సరకు సరువడమ్మును సరుల్
సరకుఁగొనఁడు సురిగె సురకరువలి
సురఁటి సరిమొదలుగఁ జూడంబడుపదంబు
లందు లఘువె సూతనాభ్రమూర్తి॥

(ఇందలిపదముల కర్థోదాహరణములు దెలుపఁబడు.)

సరస=సమీపము.

క॥ కరితురగరథపదాతులు। పరివేష్టింపంగఁగొలుచు ప్రజముందఱఁగా
సరసజనార్దనుఁడుంజన। సరిగిరివేఁటాడధరణి యల్లలనాడన్॥ సో. హ.

సరవి=క్రమము.

విరివియను శబ్దమునకు వ్రాసిన యుదాహరణముం జూడవలయును.

సరకు=వస్తువు.

క॥ నరకుఁడు యాగంబులకున్।జారకుఁడుమీరనుచు నాద్విజులనడఁచుటయున్
సరకులుచూఱాడుటయున్।వరకులకన్యకలఁబట్టివాఁడేగుటయున్॥ సో. హ.

సరువడము=ముద్ద.

క॥ అరుదుగనపుడొక్కొకయెడ। మరకతమణిపాత్రగగన మండలమయ్యెన్
సరువడముపాయసముశశ।ధరుఁడయ్యెంజుక్కలయ్యెద్రాక్షాఫలముల్ ॥నై॥

సరులు=మాలికలు.

చతుర్థాశ్వాసమునఁ దరులను శబ్దమువద్ద నుదాహరణము వ్రాయఁబడు.

సరకుఁగొనఁడు = లక్ష్యము సేయఁడు.

క॥ సరకుఁగొనరు సురవరులను । గురుశక్తిని భీష్మబాహ్లికులఁగైకొనరు॥ సా. హ.

సురుగుట = డాఁగుట.

చ॥ విరటుని గోవులన్మరలవేల్చి ముదంబున నీదుతమ్మునిం
బొరిఁగొను పార్థుఁడాఁకకెటు పోయితినాఁడలఘోషయాత్రలోఁ
గురుపతిడించి క్రీడి కృపకుం దగుపాత్రము జేసియెక్కడన్
సురిగితి చెప్పుమా నిజము సూతతనూభవ నాకునేర్పడన్ ॥భా॥

సురకరువలి = చక్రవాయువు.

క॥ సురఘునిఁదలగరుడుఁడుగొని । యరిగెడు దెమ్మన్ననాతఁడచటికిఁజని త
ద్గరుదనిలాహతి సుడివడె । సురగాలిందూలు చొప్పచొరుగుం బోలెన్ ॥భా॥

సురఁటి = చామరము.

సీ॥ సురఁటిఁదేకయవచ్చితిరదె కలికియన్న సురఁటిఁదెచ్చెదనని సురిగెనొకతె॥ నల

సరి = సమానము.

క॥ సురపతియమవరుణ ధనే । శ్వర కమలాసనుల దివ్యసభలెల్ల నరే
శ్వరచూచితి నవిదీనికి । సరిగావత్యంతవిభవ సౌందర్యములన్ ॥భా॥

(ఇది సదృశశబ్దమునకుఁ బ్రాకృతభవమని చెప్పిరి)

మూలమున మొదలుగననుటచేత నింక ననేకశబ్దములు గలవు. గ్రంథబాహుళ్యమగునని యిందువ్రాయలేదు.

ఇఁక, దీర్ఘపదములకునుఁ గొన్నియుదాహరణములువ్రాయుచున్నారము.

సారువ = తిప్ప.

లయగ్రాహి॥ ఓరగయివ్రాలిన నమేరువుల పుప్పొడుల
సారువుల వెగట ఘనసారమిళదేలా ॥వసు॥

సూరెలు = పార్శ్వములు.

క॥ ద్వారకలోపలఁజుట్టలు । సూరెల నిసుఁగొలిచినట్లు సుమనోనగరీ
సూరిజనంబులు గొలిచెడి । చారుక్రియంజేయువాఁడ జలజదళాక్షా ॥హ॥

సోరనగండ్లు=గవాక్షములు.

ఉ॥ సోరనగండ్లమార్గములఁ జొచ్చినసన్నపుగాలినొక్కఁ—యం
భోరుహపత్త్రనేత్ర ................................ ॥నై॥

(తక్కఁ—నవాని నీవిధమునఁ దెలిసికొనవలయును.)

అథర్వణకారిక॥ రేఫోన్యత్రతుసమ్మతః॥

వ్యాఖ్య॥ అన్యత్రతు=ఉక్తవ్యతిరిక్తవర్ణంబులకుఁ బరంబైన; రేఫః= లఘురేఫము; సమ్మతః=సమ్మతము. అనఁగా "ఐ-ఔ-ట-డ-ణ-య-ర-ల-హ-ళ" యీపదియక్షరంబులకుఁ బరంబునలఘురేఫమేకాని గురురేఫములేదనుట. ఇందు వలననైత్వౌత్వవిశిష్టములగునన్నిహల్లులకుఁబరంబున లఘురేఫమేయని ధ్వనితమగు చున్నది. ఇచ్చట యకారపరంబున గురువులేదని చెప్పినట్లైన "ఎఱుఁగుట-ఎఱుకలు" మొదలగు మధ్యే గురుశబ్దములు "అద్యః క్రియాసు" సూత్రమున, యకారాదులగుటచే విరోధమనవలదు. అప్పకవీయమునందలి "భూతాద్యర్థసముద్యోతినంవినా" అను పాఠాంతరంబును, "వికృతిపదాడా ప్రథమాంతస్థ తృతీయానునాసికొనస్త" అను సూత్రంబును విచారించి యాదిని యకారము పండిత హృదయంగమముగాదుగాన ద్వితీయపాఠమే సమీచీనమని యహొబలపతి యుపపాదించెఁగావునఁ బూర్వోక్తశబ్దాదిగతము ప్రాణమే. అట్లుగానిచో నన్నయభట్ట మతమున యకారమాదినుండునని తలఁచినను నాథర్వణమతమున "ఆద్యవర్ణస్తు హల్త్వేనగృహ్యతే నకదాపిచ" అను వచనమువలన యకారమాదినిలేదు. కావున నెట్లైన నియ్యుక్తి నిర్బాధకమే యగుచున్నది.

మూలము.

గీ॥ వక్రతమయుగ్మతద్యుతవ్యంజనముల। కాదిమాంతస్థములుమూఁటికలత్వమైన
యూష్మమునకు"టడణ"లకునుత్తరమున।ళాకుఁబరమునసిత్యంబులఘువుకృష్ణ॥

వ్యాఖ్య॥ వక్రతములనఁగా నైకారౌకారంబులు. తద్యుతవ్యంజనములు ఐత్వౌత్వములతోఁగూడిన హల్వర్ణములు. వీనికిఁ బరంబున లఘురేఫమేకాని గురురేఫములేదు.

ఉ॥ ..................................................ఔ
రా వలరాచవేగిరము రామకునంచుఁజెలంగినవ్వచుౙ॥ సో. హ.

ఉ॥ అంబొకకచ్ఛప ప్రవరుఁడత్యధికంబగు కాయముం బలం
బుం దనరన్వసించు జలముంగొను వాంఛ గజంబువోయినన్
జెందఁగనీక సంగరము సేయుఁబెనంగుచు నీరుఁద్రావ గొ
రుందెగియుండునిట్లు వరదోష మెలర్పఁగ నాఁడు నాఁటికిన్॥

ఆదిమాంతస్థములు మూఁటికి యకార రేఫ లకారములకుఁ బరంబున లఘువే. రేఫమనఁగా లఘురేఫమునకుఁ బరంబున లఘురేఫముగా నగుచున్నది గాని గురురేఫమునకుఁ బరంబున నెట్టిరేఫమేనియుఁ గానరాదు. ఉదాహరణము.

మ॥ హరిదాఁటించెఁబురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం
దరరే యెల్లయరెడ్డినందనుఁడు .................. ॥కాశీఖండము॥

ఉ॥ రెండుబలంబులందు నరరే యరరే యవురే యనంగ నొం
డొండఁజెలంగు సన్నుతుల నుబ్బుచు నీయదువీరుఁ జంపు పౌం
డ్రుండను వారు సాత్యకిఁగఠోర భుజాప్రతిముండు పౌండ్రభూ
మండలనాథుఁ జంపు ననుమానము లేదనువారు పోరిలోన్॥ సౌ. హ.

మూలము.

ఆ॥ ఆదిమాక్షరంబు హల్లుగాదని యథ। ర్వణముఖాద్యులనుట వలన నెఱుక
మొదలుగాఁగ శబ్దముల గురురేఫంబు। లున్నలేదు భంగ మురగశయన॥

ఈపద్యార్థము స్పష్టముగాన నర్థము వ్రాయఁబడదు.

మూలము.

గీ॥ ఘారునధురీల్నఘోరునాఁదగు ననాంధ్ర। వర్ణయుక్తాన్యదేశ్యశబ్దపరమందు
లఘువె వర్తించునెప్పుడు లక్ష్మణాని। లాత్మజాలంకృతసమీప యరిదురాప॥

సీ॥ ఘోరున వివిధతూర్యారవంబులు మహార్ణవనిధిధ్వానంబు ననుకరించె ॥భా॥

అధర్వణకారిక॥ క్రియాంతే చాన్యవర్ణేచ లఘురేఫాః ప్రకీర్తితాః॥

వ్యా॥ అన్యే వర్ణేచ = రేఫేతరములందున్నవి యనఁగా నద్రువ విద్రువ వట్రువవ్రాలె మొదలైనవి క్రారలనుట.

గీ॥ తఱచు త్రిలఘుక్రియాపదాంత్యంబు క్రార। రేఫమర్యంతజాతిధర్మిపదగతము
ఆగమంబునాగమి జిజర్ఘాదికంబు। లాంతజస్రేఫమును లఘువబ్జనాభ॥

వ్యాఖ్య॥ తఱచు త్రిలఘు క్రియాపదాంత్యంబు = మూఁడులఘ్వక్షరములు పరిమితముగల క్రియాపదములకు నంత్యమందుఁగల రేఫము తఱచుగా లఘువు, అనఁగా— తనరె, పొనరె, ఆడరె, అలరె, గదిరె, అదరె, బెదరె, మొదలుగునవి. "తఱచు" నని చెప్పుటచేత గురురేఫంబును గ్వాచిత్కమైయుండుననుట. "ఇడ్డఱు పదఱుట పెద్దఱిక్కంబును" అని యప్పకవి పదఱుటను గురురేఫముగాఁ జెప్పె. డగ్గఱ- క్రమ్మఱ- పగఱ- మెఱయుట మొదలగువానియందు గురువులుండుటవలనఁ "త్రిలఘువు— క్రియాపదము- అంత్యము" అను విశేషములు మూలమునఁ జేర్పఁబడియె. ఉదాహరణములు.

క॥ జడనిధిసుతను తెరమఱుఁగున । వెడలి నిలిచినట్టియాటవెలఁదియపోలెన్
గడునింపులు గుల్కుచుఁదన । రెసు పురవరలక్ష్మి నవధరించి వైయధిపా॥ భా॥

క॥ వినుసౌభాగ్యసమేతుఁడు । మను నిజదారైకపరుఁడు ముందటిజన్మం
బున భార్యకుఁ బ్రీతియొన । ర్పని మనుజుండు సుభగతావిరహితుఁడౌండున్॥

చ॥ పవనజు చాపముల్ హరులు ప్రగ్గములం దునుమాడి క్రాఁడితో
నవి పెనగాడఁగా వెసఁదయమ్మత్రునఁ గేతువుఁ గూల్చి సూతు మే
నవియఁగఁ జేసినం బఱచి యాతఁడు ఫల్గునుజక్రరక్షు తే
రివెనుక నుగ్రశక్తియడరించెఁ జలింపక భీముఁడత్తఱిన్॥ భా॥

ఉ॥ వింతలుసాలనీవలన వింటిమిగాని ధరిత్రి నెందునే
మింతకుమున్ను సారథుల నెవ్వరిఁ జూడము వైరివీరదు
ర్దాంతభుజావిలాసమలరం దెగిపోరులనస్త్రిశస్త్రివి
శ్రాంతికణంగువారినని కన్నులనిప్పులు రాలఁబల్కెనన్॥ భా॥

ఉ॥ శ్రాంతివహించి దప్పిగదురన్॥ జై॥ భా॥

☞ గ్రంథవిస్తరశంకచే దిఙ్మాత్రముగ నుదాహరింపఁబడియె.

శ్రారరేఫము॥ అదుర్రివ- విదుర్రివ- వట్రువ- శార్రిలె తార్రివె- కుర్రింకె- బుర్రింగె మొదలగునవి యెప్పుడును లఘువులె. ఇట్టినియతములగు శ్రారలకే గాని పొల్లులతో సంబంధించిన రేఫములకీ వివక్షకాదు. అట్టియెడల నే రేఫము సంధించినచో నా రేఫమే గాని లఘువని చెప్పవలనుగాదు. ఉదాహరణము.

ఉ॥ ఎప్పుడు నెయ్యెడం బొదివి యుండఱకుండగ నీవు కంటికిన్
దెప్పయుఁ బోలె మాటయి నెఱింబనులారసి యొజ్జచాడ్పునన్॥ భా॥

ఉ॥ ... ... ... పేదనన్
ప్రోలుచు రోఁజఁగాఁ బలుమఱుం బొఱలంబడిలాలఁగ్రక్కి॥ భా॥

ఉ॥ ... ... ... కన్
ఱెప్పలు విప్పనీదొకతఱిం జెమరారఁగనీదు॥ వసుచరిత్ర॥

అఱ్యంతజాతిధాత్రిగతపదము॥ వ్యాఖ్య॥ అఱిఅంతమందుఁగల జాతిపదములు. తద్గతమనఁగఁ జివరనుండు "ఱి" అనుట. ఉదాహరణము॥ కమ్మఱి- దొమ్మఱి- కంచఱి- మేదఱి- ఉప్పఱి- నూనఱి- (కటికవాఁడు) జాలఱి- పోటఱి- మోపఱి- తొల్పఱి- నేర్పఱి- తెరువఱి- వెరవఱి- గద్దఱి- చూపఱి- ఒంటఱి- ఒఱపఱి- కల్లఱి- లావఱి- తిలవఱి- కావఱి టక్కఱి- సుంకఱి- కాలఱి, మొదలగునవి. వీనిలో "గద్దఱి, అనుశబ్దము నప్పకవి గురు రేఫమని చెప్పినాఁడు. "గద్దఱి యద్దెఱ కట్టెదు ఱను" అనియప్పకవిమతము. జాతిధాత్రి వాచకములని చెప్పుటచేత క్ర్యాంతములగు నఱ్యంతములకు గ్రహణములేదు. టక్కఱి పెంపఱి- మొదలైనవి. పూర్వోక్తముల కుదాహరణములు.

క॥ తెఱువున నొక మిథునముఁ జూ । దఱులం గమఁగొంటె నీవధర్త్రమునీయం
దఱసికనిన వారై పలి । కిఱివారల నెఱుఁగుదేయకిల్బిషచరితా॥ భా॥

చ॥ ఉరుతర హేమదండరుచి నొప్పుచు సింహపతాకవింటితో
నొరయఁగ రోహణాచలసముజ్జ్వలమైనరథోత్తమంబుపై
నరుదుగఁజాప మింద్రధనురాకృతి నెత్తి చెలంగుచున్న పో
టఱి యతఁడింద్రజిత్తుఁడని డాయరు వీని సురాసురాదులున్॥ రామా॥

చ॥ తరుణులగాఁగిఁటన్ననుచుఁ దమ్ముత్రివృథావిఱులెత్తఁ జేసెమో
పఱులుగఁ జైతుఁ రేఁడంచుఁ దదభావమనోభవవహ్ని వ్రేల్చిని
ర్భరమధుపాళి ధూమముఁబరాగపు నీఱును దేనెకట్టిచాఁ
దఱుదుగఁదార్పఁగాఁగొఱవులై యెఱుఁగంబడెఁగొన్ని భూజముల్॥ ఆముక్త॥

క॥ హరివలికిన విధమంతయు । వెరవై యున్న యదికంటె యీమాట తెఱం
గఱయుదము తొలుతనీపెను । పఱిచందంబెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్॥ స్వా॥

చ॥ వెరవునలావునం గడిమిబీరమునంబొలుపొందు రాచదే
వరమెఱయంగ నేర్చిన కువాళపుమన్నియమూఁక నేలతా
ల్పరిబలుగాడ్పు ... ... ... ... ॥ యయాతి॥

ఉ॥ వరుసన్ శక్రుఁడు నాఁడు వేగఁ దన చెల్వాఱ్జుం జయాక స్నిరం
దొరయంబాయము రూపముంగలిగి చెన్నొందుల్కా నీ సేల తోఁ
డరు దైక ర్లై దలంచినట్లు యెడ సేయంబోల నేయింకనే
న్వి శాలాకొవతిలంబంధుమా తగుపనుల్ రాణింపఁ గావింపఁగ ॥ య॥

చ॥ అల్లవెకోయిలల్సిగురుటాకుల నంజాడునంజి నల్గడం
దుల్లెడునామతోఁ దెరుపరుల్ దముయుల్కాడు విన్నగుడియల్ ॥ య॥

క॥ సరకుఁగొనరు సురవరులను । గురుశక్తిని భీవతిబాహ్లికల గైకొనరు
ద్ధారతజరాసంధునివెర । వరిగా మెచ్చరు మహేశ్వరగర్వమునన్ ॥ సో-హ॥

రాగమంబు॥ అనఁగా "దారార్థితేఉదపిర" ఇతినూత్రిము చేతవిధింపఁబడిన జవరాలు- ముద్దరాలు- ధరాత్రిశత్రురాలు మొదలయిన శబ్దములయందలి రేఫములఘువు. దీనివలన బాపత్రిలు పాదరిలు మొదలయినవానికిం గ్రహణము.

తే॥గీ॥ ఆలనుపదంబు మొదలను రాగమంబు । వచ్చు సంధికినుభయంబువళికిఁ జెల్లు
నతివజవరాలు బాలెంతరాలుముద్ద । రాలుధరాత్రిశత్రురాలన రాష్ట్రసారి॥

"ఆగమిణిజర్థాదికంబు" అనఁగా నజుప్పూర్వకమగుగమిధాతువు॥ వచ్చుట యీ ధాతువునకు ణిజర్థము రప్పించుట- రావించుట- ఆదిశబ్దము చేత- రమ్మత్రి- రండు- రాను- రావు- రాము- ాదు- రాదు రాక- రారా- రాఁగా- రావచ్చు- రానిమ్మత్రి ఇత్యాదులు." రణమునవారలఁ గెలువ రాదనుపల్కు లటుండనిమ్మత్రి॥ భా॥ రమ్మత్రినకుఁ దేరుశబ్దమునకు వ్రాసిన యుదాహరణముం జూడవలయును.

రాకశబ్దమునకు॥ ఉ॥ రాకసుధాంశుమండలము రాకకుమాఱు మొగంబుఁ జేయుచో॥నై॥ ద్విపదము॥ నావుడమత్రినినాథు నగరికేకేతి । రావింతుననివిచారము చేసి తెలిసి॥ రం-రా॥ రప్పించి జాతకర్త్రములుచేయించి॥ రం- రా॥

లాంతజనేఫము॥ అనఁగాలకారమంతమందుఁగల శబ్దమునకు" లాం తాత్తురరా" విత్యాది నూత్రము చే విధింపఁబడిన బహువచనప్రత్యయరేఫము లఘువు. అవి యేవనిన, బాలురు- నృపాలురు- శుభశీలురు మొదలుఁగునవి. మఱియుదీనివలన నెయ్యురు- మార్తురు- అల్లురు- మొదలయిన దేశ్యశబ్దముల- బహువచనప్రత్యయమునకు ను "పరేషాంతుధరోత్తమ మధ్యమపతి,, నూత్రము చే విధింపఁబడిన-కవులరు- భక్తులరు- మొదలగువానికిని, "సమాప్తావర్ణకాః కేచిద్దేశ్యపునరపిశ్రుతా" ఇత్యాధర్వణోక్తివలన నిష్పన్నములగు కోడండ్రు- పేరఁటాండ్రు-మొదలగుశబ్దములందలిపునః ప్రా

ప్రత్యయరేఫమునకును గూడ గ్రహణము. ఉదాహరణము. ఉ॥ భరతకులైకభూష
ణుఁడు భాసురతేజుఁడు ధర్మనందనుం । డురుభుజవిక్రమంబున జయోన్నతి బొల్పఁగ
వీరులోకపా । లురయని భీముఁ బార్థనకులుల్ సహదేవునిఁ బంచెఁ దూర్పును । త్తరము
నుబశ్చిమంబు మఱిదక్షిణమున్వరుసన్ జయింపఁగన్॥ ॥భా॥

మ॥ మరుదంభోరుహనేత్రలం బరధునీమధ్యంబునన్నిల్వని । ష్ఠురతత్తీవ్రపయోధరా
హతిజలస్తోమంబునల్వంకలం । దెరలన్నాభిచయంబులోఁ గొనియెవానిం జాలగాంభీర్య
శీ । లురసంక్షోభము నొందువారిఁ గని చటల్ లోఁగొంచుపర్తెంపరే॥ పారిజా॥

క॥ నరుఁడనుఁగుఁ జుట్టగావునఁ । బోరిఁ గొనఁ జోరవీవు నూతపుత్త్రుఁడొకఁడమా ।
త్తరమార్గ్యనియెడునతనికి । వెరవుచు మరువులును లేవుపీనుఁడగుటన్॥ ॥క॥ పుర
పురఁబొక్కుచుబకపతి । కరంకమునఁ దేరఁ బనిచి గారవమున నె । య్యురుదానునగ్నియి
చ్చియ । సురపతియున్న త వచ్చె సురపతి నిమిత్తన్ ॥భా॥ పఱుపద్యమందలి "కరంక
ము" అనఁగా నెముకలగూడు. ఇదిసంస్కృతశబ్దము.

మూలము.

తే॥గీ॥ అంగనాధమసంబుద్ధి యారదాగ
మముత దేతత్కృమాత్రయుపత్రదభిధేయ
ములుఁ గ్రియాంతగవర్ణకములు జనగణ
నాపదోర్వంతములుఁ నవియొపరాత్మ॥

టీక॥ అంగనాసంబుద్ధియనఁగా "నీలిరో వెలఁదిరో" మొదలగునవి. దీనివలన
నిస్సిరో- అమ్మ చెల్లరో మొదలగువానికిం గూడ గ్రహణము. ॥చ॥ నరుఁడు విహీన
సాధనుఁడు నాకొమరైలలిఁ దుప్పిల్లి యాడఁ । జెల్లరో యిటఁ జూడఁగా నగు నెలాఘవ
మేర్పడబట్టుఁ డుక్కునం । బోరిగొనుఁడంచు యోధగణముం బురిగొల్పుచుఁ దాఁ
కియేసెనిబ్బరముగఁ బెక్కుబాణములబాణుఁడు పాసతిపాణివల్లభున్॥ ఏటాప్రగ
డహరివంశము. చెల్లరో యనునది సంతాపార్థకమగునవ్యయము.

అధమసంబుద్ధి. ఓరీయనునది. దీని సాహచర్యమువలన నేమిరా, రారా, ఇత్యా
దులకు గ్రహణము. ఉదాహరణము ॥శా॥ ఓరీదానవధూర్త నీదు వచనోద్యోగంబు తెల్లే
దిరా । రారాయింకిట నేమి సేసెదవురా కార్యంబు శౌర్యంబు స । ద్వీగత్వంబును గల్గెనే
నిదనుజా తెల్లంబుగాఁ జూపుమం । చా రాజీవవిలోచనుండు వచనవ్యాపారపారీణతన్॥

ఆరదాగమము. అనఁగా రాములార కృష్ణులార ఇత్యాదులు.

గీ॥ అంతనేయంగవలయునే యన్నయమఁగులార యుత్తరకురుభూములారఁ బండి
యున్నయవి యాఁగకాలోచితాన్నమునకు । వలయుధాన్యముల్ దలఁపునవచ్చుచుండు
॥భా॥ రసికచిత్తాబ్జవాసులారాయనంగ॥ అప్పకవీయము॥

తదేతత్కృమాత్రయుపత్రదభిధేయములు. తచ్ఛబ్దార్థము- వారు- వారలు-దీని
వలనఁ జేసినారు చూచినారు మొదలయినవియు గ్రహింపఁబడును. క॥ వారలుపాత్రి
తస్నేమయా । చారంబులు దీర్చి భక్తిసంపదబొదలన్॥ భా॥ వారుఅనుటకుఁ బోరను
శబ్దోదాహరణమునం జూడవలయు.

ఏతచ్ఛబ్దము. వీరు- వీరలు ॥ క॥ వారిపిలుంవనయంతం। జేరిజనార్దనుఁడువోయెఁ జెడిరకటకటా । వీరనుచువిధివినోదము । వారింపఁగమనుజకోటి వశమేయనుచున్ ॥ సో-హ ॥ మఱియు నేఱ్ఱాప్రెగడ హరివంశమునందు- ఉ॥ వీరలయందుఁ గానఁబడు వేయువిధంబుల నద్భుతంబులిం। పారఁగదేశభేదములయంతరముల్ జనులందనర్చితా। మేరలుధాత్రియై నిలిచెమెచ్చఁగు పెంపుననుల్లసిల్లుచు। న్నారటుగాన కీర్తనయొనర్చుట కర్హులువీరు నావుడున్ ॥

కిము శబ్దార్థము- ఎవ్వరు-ఎవరు-ఎవ్వారు-ఏవారు-ఏరి ఇత్యాదులు. ఎవ్వరనుటకు నరియను శబ్దోదాహరణముం జూడవలయును॥క॥వినుమతని తెలిఁగెఱిఁగిపరి।జనములతో నాంబికేయు చరితముదుర్యో। ధనుకొఱగామియునెవ్వా। రునువాక్రువ్వంగ వెఱతురు కురుప్రవరా॥ క॥ ఆరాజకుమారులుమది। నీరసముజనించునట్టు లెక్కడి జనకుం। డేరికినేనియుఁ బుట్టిన। వారిం దోఁబుట్టువులుగ వ్రాల్పంజనునే॥ భా॥

ఆత్మన్ శబ్దార్థము-తారు-తమరు-ఉదాహరణము॥ క॥ మారీచసుబాహులునా। నా రాత్రించరవీరుతోడ నభమునమాయా। నీరదముపన్ని నెత్తురు। తారోలింగురసిరవ్వుడు తర్జనలెసఁగన్॥ రామాయణము॥

యుష్మచ్ఛబ్దార్థము. మీరు- మీరలు- ఈరు- ఇత్యాదులు- క॥ మీరెల్ల నెఱుఁగుమరయ। వీరులదివ్యాస్త్రశస్త్రవిభవసమృద్ధిన్॥భా॥క॥ ఈరేయొకశుభలగ్నం। బీరేవివరించి. వరునకింతికి॥ వసుచరిత్రము॥

క్రియాంతవర్ణములు- అనఁగా సర్వేషాం బహువచనేషు ఇతిస్యాత్తనుసూత్రము చేతను విధింపఁబడిన-చేతురు- చేయుచున్నారు- చేయఁగలరు- చేసెదరు- చేయరు- చేసిరి- చేయఁబడుచున్నారు- చేయఁబడిరి- చేయఁబడఁగలరు- మొదలగు బహువచన ప్రత్యయశేషములఘువు- క్రియాంతేచయను వాక్యమునకర్థమిదియేయని యెఱుఁగ వలయును-

జనగణనాపదోర్వాంతములు- అనఁగా జనసంఖ్యా వాచకములగు నుర్వాంత శబ్దములు- ఇరువురు- ముగ్గురు- నలుగురు- ఏవురు- ఆఱుగురు- పదుగురు- వేవురు- పెక్కురు- పలువురు- మొదలగుశబ్దముల యంత్యరేఫము లఘువు, దీనివలనఁ గాల్వురు మొదలగువానికిం బ్రమాణములు:—

క॥ పరమాన్నభైక్షభిక్షా। పరిపూర్ణతరంబులైన పాత్రము లయ్యే
వురు నిత్యంబు నివేదిం। తురుతల్లికిఁగరముశక్తితో వినయమునన్॥ భా॥

చ॥ ఇతనికితండెసాటియగు నీతనికీతఁడెసాటియవ్వను
ద్ధతిఁజను వెంటవీటనడిదంబునఁ గంతటివారు లేరుమా
పతికొకరుండుశిష్యుఁ డురుబాహుఁడు ద్రోణునకొక్కరుండు ధీ
రతముఁడుశిష్యుఁడిట్టిరువుర౯ రణధీరగుణంబు చెప్ప నేటికి౯॥ సో॥హ॥

క॥ ఇరుచెవియెఱుంగకుండఁగఁ। దరుణిసుఖమనుభవింపఁ దలఁచినఁబడి వే
పురకన్నులెదురఁబడితిని। సరివారెల్లిదను సేయఁజాణతనైరి౯॥ సో॥హ॥

క॥ అరదంబులు పొరిపొరియై। హరులగములునుగ్గునూచమై మొత్తపుఁగా
ల్బురు సిదురుపలై- భా॥

క॥ నరకశిశుపాలురాదిగ। ధరణీకంటకులనధికతరదర్పులఁబ
ల్బురవధియింపఁగమహినవ। తరించినమహాత్ముఁడవు నుత స్థిరశక్తి౯॥ భా॥

మూలము.

తే- గీ॥ సంస్కృతప్రాకృత సమానశబ్దములను
దనరవెప్పుడు గురువులు తద్భవముల
బహుళముగ లఘురేఫముల్పరఁగువీనిఁ
జెప్పెద సురక్షితజ్ఞ లక్ష్మీమనోజ్ఞ॥

టీక॥ తద్భవశబ్దములయందు బహుళముగ లఘురేఫములేయుండుననుట- బహుళగ్రహణముచేఁ గ్వాచిత్కముగ గురురేఫంబులును గలవనుట- అవి తృతీయాశ్వాసమున వివరింపఁబడును- ప్రాకృత తత్సమములు- రాణిమొదలైనవి- రాణిశబ్దము రాజ్ఞీశబ్దమువలన "జ్ఞోణః" అను సూత్రముచే నిష్పన్నమైనది- ఆంధ్రమందును రాణియనియె ప్రయోగింపఁబడుటచేఁ బ్రాకృత తత్సమమని చెప్పఁబడియె- రాణివాసంబు తుహినాద్రిరాజతనయ॥ ఛేమఖం ॥మిగిలినశబ్దముల నిట్లనే యెఱుంగునది.

మూలము.

సీ॥ మరుఁదు దేవరయుఁ దామర కప్పురంబు చిత్తరువు నిబ్బరము చందురుఁడు నిదుర
తరగలు తిరము నచ్చెరువును కొమరుండు గరిడియు గరువంబు బరువు బిరుసు
మరియాద పరికించె నర రిత్త రిక్కయు రక్కసి రవణంబు రవుతు రచ్చ
కరవటంబరణంబు గంబురా మొకరిసాకిరి చెందిరంబునివ్వరిపెతరులు
పెరిమబికిరంబుమకురును కరగసంబు। తురకపరువడిచక్కెరక్కరమరదము
కరిసెనముబొమ్మరంబుకత్తెరమరాటి। తండరయుదద్దురునుజగద్భరితగర్భ॥

ఇందలి పదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

మరుఁడు—స్మరశబ్దభవము.

క॥ ఇరువురునాండ్రౌరువులఁ గడు। సురుచిరముగఁజూచువాఁడిచూపుల్కలఁదనకుꣳ
శరములుగాఁగొనియేసెను। మరుఁడయ్యిరువురమనోభిమానచ్యుతిగాꣳ॥ భా॥

దేవర—దేవశబ్దభవము.

మ॥ గురుఁడన్నꣳధనమన్నఁ బుణ్యమనినꣳ గోత్రోదయంబన్నదే
వరయన్నꣳమనమన్నఁ దుష్టియనినꣳ వాత్సల్యమన్నꣳనిజే
శ్వరుఁడన్నꣳస్వపరోపకారమనినꣳ సర్వంబునన్నందలో
దరి నీకున్నిషధాధినాథుఁడుసుమీ తథ్యంబుగాఁజెప్పితిꣳ॥ నైషధము॥

తామర—తామరసశబ్దభవము.

క॥ నరుఁడలుకవాఁడమియును సు। స్థిరుఁడైతనయొత్తుసెలలచెలువునఁ గెందా
మరలుందెగడెడికన్నుల। నరుణచ్ఛవిసెలయ నిట్టులనియె నరేంద్రా॥ భా॥

కప్పురము—కర్పూరశబ్దభవము.

సీ॥ కస్తూరినీటనుగలయంపులును గప్పురపుమ్రుగ్గులును బహురత్నతోర॥ భా॥

చిత్తరువు—చిత్రశబ్దభవము.

క॥ కరువునఁదరువున శిలఁజి। త్తరువున నినచంద్రరుచులఁదారకరుచులꣳ
హరిహరధాత్రాదులకీ। హరిణముసరిరూపువడయనలవియెయింకꣳ॥ రామాయణ॥

నిబ్బరము—నిర్భరశబ్దభవము.

మ॥ ఊరుసంధ్యాతపశోణమృత్కలితమైయొప్పారుబ్రహ్మాండమꣳ
గరిడింగాలపుమెంతకాఁడు చరమాగస్కంధముంజేర్చుని
బ్బరపుꣳసంగడమోయనꣳ శశిడిగెꣳబ్రాగ్భూమి॥ మను॥

చందురుఁడు—చంద్రశబ్దభవము.

చ॥ కెరలిమహాసిపేమసహకృత్వరితద్భటకోటిచాతురీ
ఛురిసమరాంగణంబులచతుస్సరిదావరణంబులꣳయశో
బరములువేయుచుండుబహుభంగులఁ బున్నమనాటినిండుఁ జం
దురుననుసోఁగవెన్నెలలతోఁ బులఁ దూఁగెడుతద్గుణంబులꣳ॥ నై॥

నిదుర—నిద్రాశబ్దభవము-

క॥ పురరక్షణంబుదృఢముగ। వరవరచేయంగవలయునమ్మాఁగలుగు స
త్పురుషులనీడగుకడుపుని। దుర మొదలగులోనిపనులతోడుగ నరయన్॥ ఖా॥

తరగలు—తరంగశబ్దభవము-

సీ॥ కుంభజుమీఁదమాఱొ్్ఱనవచ్చునంబోధితరగలగమిఁబోలుఁ దురగములును॥ శా॥

తిరము—స్థిరశబ్దభవము-

క॥ ఆతఁడింతటిదిమహాభా।రతమేయనునిశ్చయము దిరంబుగమదిసం
గతమగుడునమ్మహాత్ములు। కతివిశదముగాఁగ నిమ్మహాకథసెప్పెన్॥ భా॥

అచ్చెరువు—ఆశ్చర్యశబ్దభవము-

చ॥ కురువిభురాజసూయమునకున్ ధనమిచ్చిరిరాజులెల్ల నా
దరమునఁబ్రీతిసేయునది తానునుదప్పకయంచు లంక క
చ్చెరువుగఁబుచ్చెదూతలఁ బ్రసిద్ధిగనంతవిభీషణుండుఁ జె
చ్చెర సహదేవుశాసనముఁ జేకొనిచేసెఁ గరంబునెమ్మితోన్॥ భా॥

కొమరుండు—కుమారశబ్దభవము-

పా।రునకరుదెంచెవేల్పుకొమరుండొకఁ డుద్ధురఖడ్గహస్తుఁడై॥ పారి॥

గరిడి—ఖురళీశబ్దభవము-

☞ "నిబ్బరము" అనుశబ్దమునకు వ్రాసియున్నయుదాహరణముంగనుఁడు-

బరువు—భరశబ్దభవము-

సీ॥ బరువంచుముత్యాల సరములఁ దిగిచిచెంగటనున్నయింతిదోయిటనువైచి॥ క॥ మ॥

బిరుదు—బిరుదశబ్దభవము- (శూరుఁడు- బిరుదము-)

సంస్కృతశబ్దమగు బిరుదశబ్దమునకు శూరార్థకము లేదుగదా, తెలుఁగున నెట్లు వచ్చునని శంకింపవలదు. "క్వచిదర్థస్తుశబ్దస్యవికారేప్యన్యథోచ్యతే" అను నథర్వణోక్తివలనను, విన్నాణము మొదలగు కొన్నిశబ్దములట్లుగానంబడుటవలనను బాధకము లేదు-) ఉదాహరణములు-

క॥ బిరుదుగలమగలు గలరని। తరమిడిచంపింపఁజూచెదవు జనములనీ
పొరువునుబోవెఱతుము మా। పురమునురాష్ట్రమునువిడిచి పొమ్మొటకైనన్॥ రా॥

చ॥ మురరిపుసన్నిభుండు పదమువ్వురగండయనంగఁబెట్టెఁదా

బిరుదు తెలుంగు బిజ్జఁ డరిభీకరభూరి భుజాబలంబుతో॥ భా॥

ద్విపదము॥ తురగాష్టకముతోడ ద్రుతగతితోడ
బిరుదు టెక్కెములోడఁ బృథు కాంతితోడ॥ రంగనాథ॥

పరికించు=పరీక్షా శబ్దభవము

క॥ పరికింపఁగ బాహ్యాభ్యం। తరజనములవలన సంతతము నిజరక్షా
పరుఁడవయి పరమహీశుల। చరితము వీక్షింతె నిపుణచర నేత్రములన్॥ భా॥

అర=అర్ధ శబ్దభవము.

క॥ అరచందురు డెందములోఁ। జొరఁబాఱు చువడఁకుతోఁకచుక్కయపోలెన్
నరకుం డేసిన బాణము। హరి నిటలతటంబునాటి యల్లలనాడెన్॥ సో॥హ॥

ఈ ప్రకారముగఁ జక్కనవన్నియుఁ దెలిసికొనవలయును. గ్రంథ విస్తరభీతిచే నుదాహరణములు వ్రాయఁబడవు. ఇందలి "అర" శబ్దమును గురుత్వముగాఁ జూచి మంచి తిమ్మకవి వ్రాసియున్నాఁడు.

ద్విపదము॥ అఱగౌనులసియాడ నలసయానముల
మెఱుపులోయలతలై మెఱయఁ దీఁగలాలయ॥

| | | | |
|---|---|---|---|
| రిత్త=రిక్త | శబ్దభవము | పెరిమ=ప్రేమ | శబ్దభవము |
| రిక్క=ఋక్ష | " | బికిరము=భిక్షా | " |
| రక్కసి=రక్షస్ | " | మకురు=మకర | " |
| రవణము=రమ్య | " | కరగసము=క్రకచ | " (రంపము) |
| రవుతు=రాహుత్ | " | తురక=తురుష్క | " |
| రచ్చ=రథ్యా | " | బొమ్మరము, బొంగరము=భ్రమర | " |
| కరవటము, కరాటము=కరండ | " | తందర=తంద్రా | " |
| అరణము=హరణ | " | పరువడి=పరిపాటి | " |
| గంబురా=కర్పూర | " | చక్కెర=శర్కరా | " |
| మొకరి=ముఖర | " | అక్కరము=అక్షర | " |
| సాకిరి=సాక్షి | " | అరదము=రథ | " |
| చెందిరము=సింధూర | " | కరిసనము=కర్షణ | " (కృషి) |
| నివ్వరి=నీవార | " | కత్తెర=కర్తరి | " |
| పెతరులు=పితృ | " | మరాటీ=మహారాష్ట్ర | " |
| | | దద్దురు=దద్రూ | " |

ఇంక నిట్టివి బహుశబ్దములు గలవు. వానిం బ్రయోగములవలన దెలుంగునది అయినను బొమ్మరశబ్దమునకుఁ గరిసెనశబ్దమునకు మాత్ర మిఁకఁ బ్రయోగములు వ్రాసి విరమించెదను.

కరిసెనము = కర్షణ శబ్దభవము.

క॥ కరిసెనమును బేహారము। నరనిపసులఁ గూర్చుటయును ననఁగా వృత్తుల్
నరునకు॥ ఎ. హ॥

బొంగరము, బొమ్మరము = ఇవి భ్రమరశబ్దభవములు.

సీ॥ బొంగరమనఁగను బొమ్మరమనఁగను భ్రమరాభిధానంబు పరఁగుచుండు॥ ఆంధ్ర
మూలము. [భాషార్ణవము

క॥ ఆరతియు నీరసము జడ। దారియు రాతిరియుఁ జూరిదారము కారుక్
గోరంటయాదిగా దీ। ర్ఘారూఢంబైన తద్భవావళి వెలయున్॥

ఇందలి పదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

ఆరతి = ఆరాత్రికా శబ్దభవము.

సీ॥ ధూప। తతియిచ్చికపిలాఘృతప్లుతవర్తికా రమ్యదీపములనారతులమర్చి॥ ఏ॥ హ

ఈరసము = ఈర్ష్యాశబ్దభవము.

క॥ తారుతముఁగాఁచికొనలే। రీరసమునఁగావఁబోదురింతుల వంశా
చారస్థితిదాంభికులగు। వారుదమకకానిమఱుఁగువారికిసైదై॥ సై॥

జడదారి = జటాధారిశబ్దభవము.

తే॥ గీ॥ ఎనసినరపాల నిరపాయహితవిహార। హరిగడి దేరియొక జడదారియయ్యె॥ వసు॥
దీనివలననే పడగదారి విసదారి మొదలగు శబ్దములు వ్యాఖ్యాతములయ్యె॥

రాతిరి = రాత్రిశబ్దభవము.

క॥ చేతఁగొనియుప్పునమలుట। రాతిరిపై యుప్పుఁగొనుట రాత్రి దధి మధూ
పేతంబుగఁ గుడుచుటయు। శ్వేతరములు సేయుసత్తు లెగ్గునరేంద్రా॥ భా॥

చూరి = క్షురా శబ్దభవము.

దారము = ద్వారశబ్దభవము.

కారు = క్షారశబ్దభవము.

గోరంట = కురంటశబ్దభవము.

విస్తరభీతిచే నుదాహరణములు వ్రాయఁబడవయ్యెడు. మఱియు దాచకొలము శబ్దము లనేకములుగలవు.

శ్లో॥ అనిత్యయోర్భవేద్యత్ర గ్రామమానుషనామసు
రేఫయోర్నిశ్చయస్తత్ర రేఫమాత్రైక గోచరః॥ (అథర్వణ కారిక)

మూలము

తే-గీ॥ పురనరాఖ్యల నిశ్చయంబుఁగనరాని
యెడల లఘురేఫమని నిశ్చయింపవలయు
నిశ్చయస్థలములయందు నియతరీతి
గురులఘు విభాగకృతియె చేకొనునది హరి॥

టీక॥ ఇందు గ్రామమానుష నామములయందు నెచ్చోట గురులఘు నిశ్చయా భావమగునో యచ్చట లఘురేఫము మాత్రమే ముఖ్యవిషయము గాఁగలదు. అనఁగాఁ బామర్రు, ఎఱ్ఱన్న, మొదలగుచోట్ల రేఫమునకు ద్విత్వాలింగము లుండుటవలన గురుత్వంబు. రామచంద్రపురము మొదలగుశబ్దములు సంస్కృతంబులగుటవలన లఘుత్వంబు సిద్ధంబు. కొరుటూరు, మారుటేరు, తిరుమలరాయఁడు మొదలగు శబ్దములకు నిశ్చయాభావము ఘటించుచున్నది- ఇట్టి యనిశ్చితశబ్దముల లఘురేఫములని నిశ్చయించుకొనవలయు-

చ॥ అరిజయకీర్తిసాంద్రుఁడగు నయ్యళిరామనరేంద్ర సోదరుం
దిరుమలదేవరాయని నుతింపఁదరంబె॥ వసు॥

క॥ గరితబడేబీబీన। క్కరబీబికి శమ్మబీబిఁగనుపట్టెడు నా
మరుఁడగునమీనుఖానుఁడు। సిరులొదవఁగఁ బెండ్లియాడెఁ జెలువలరంగన్॥

మఱియు దీనివలన భాషాంతర శబ్దములన్నిటియందు లఘురేఫమే యని యెఱుఁగవలయును-

క॥ అరబీ పారసీ కన్నడి। మరుమీ కన్నోజి తెలుఁగు మొదలగు బాసల్
పరికించి కుతుపవారల। నరయుచుఁ బాలుపొందునబ్బులల్లీపుడమిన్॥ య॥

ఆశ్వాసాంతము.

మ॥ అసహాయ ప్రదర ప్రఖండిత దశాస్యచ్ఛత్రదండాయతా
వసుధాకర్ణజనుః ప్రగల్భకవితా వామాదృథాలింగితా
యసకృన్నామజపైకలోల జనదేహాత్మభ్రమక్షేపకా
స్వసమాత్పాదిత చిత్రరూపక జగత్సంసార నిర్వాహకా॥

క॥ దోషప్రదోషపూషవి। భీషణపోషకవిధూత భీమేష్వాసా
భీషణ దూషణ పేషణ। భూషితనీలపుర నీలపురజితనీలా॥

పైకందమునందలి "భూషిత నీలపుర" శబ్దమునకు విగ్రహ మిందువ్రాసెదము. భూషితం నీలపురం యేనస ఇతి నీలపురనామ గ్రామాలంకార భూత ఇత్యర్థః। నీలేన పురేణ దేహేన జితో నీలః ఇంద్రనీలో యేనస ఇతివిగ్రహః॥

మాలినీవృత్తము॥ విదళితమకరాక్షా ❊ విశ్వభక్తాఘరక్షా
వదనజితశశాంకా ❊ వాసుధేయీ వశాంకా
మదనసదృశరూపా ❊ మంజుభాషాకలాపా
ముదితతపనజాతా ❊ మోక్షసౌఖ్యప్రదాతా॥

గద్యము-

ప్రథమాశ్వాసాంతమున నున్నట్లే చదువుకొనునది.



శ్రీ శ్రీధరాయనమః.

# ద్విరేఫవర్ణదర్పణము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీమద్వామాంకవస । ద్భామామణిముఖ తుషార ధామ దరస్మే
రామృత చకోరకతనే । త్రామహితసువర్ణ నేత్ర దశరథపుత్రా॥

తే- గీ॥ అవధరింపుమిఁక శకటాంగనామక రేఫ । మూలవచింతు లక్ష్యపూర్వకముగ
నన్నపార్య తిక్కన ప్రభృత్యాదిక । వీంద్ర కావ్య సమితి నెల్ల వెదకి॥

మూలము.

సీ॥ అఱిముఱియఱగొఱ్ఱె మఱఁగొఱ ఱఱచుట యఱువది యఱమూటయఱవలఱుగు
లఱక్రమ్మఱుటఱువుల్లినఱుగుట యఱడఱయఱఁటిరూపఱి యఱపోఱ డిఱకట
మిఱికిఁకొని యొఱఁగుకిఱియుటఱుఱుసుక్రిక్కిఱియుట యఱుముక్కోలిఱిసిపోఱ యొ
నుఱికెనుఱుతయు అవుఱిదియు ఱఱుఱుఱుఱు అనిరోసమానుఱుసుఱియయు ఱక
యుఱియటయు బలమఱియొఱ వఱికమెఱుక
మెఱుఁగుమెఱుఁగువ మెఱఁగుట మెఱుక లెఱుకు
వెఱచి యెఱమంట యొఱపోఱ యొఱకటంబు
నోఱవెసెఱవలీలా ఖండితోరుచాప॥

ఇందలి పదముల కర్థోదాహరణములు దెలుపఁబడు.

అఱిముఱి—ఎడతెగక; అత్యంతము; అనర్గళము; త్వరఁగా; మాటిమాటికి.

చ॥ అఱిముఱి వైచు పాదపశిలావళిఁ బ్రాసము ద్రిప్పి దప్పిపోఁ
జఱచుచు విస్ఫులింగములు చల్లు మొగంబుఱి ద్రిప్పి వుచ్చుచుఁ॥ రామా॥ 1

క॥ పఱచు నాకకణిది పతిముకు । జెఱమలకై యెయ్యఁజిప్ప జిరుగఁగ నడిచి
క్రఱగాఁడి దుస్సి పాఱెన । నఱిముఱిఁ జాపఱవు వాఱియల్లటు వడియెఁ॥ మను॥ 2

క॥ నెఱిమీఱ బందెవట్టిన । నఱిముఱిఁ జంపినను గజము నన్యము ప్రమచ్చై॥ యా-స్వ॥

చ॥ క్రిక్కిఱియుఁగఁ జేసి నాలుగిట చేసె తురంగములన్యధిష్ఠరుం
దఱిముఱిఁ జఱపె సారథిఁ దదశ్వములం బటుబాణపాణియై॥ భా॥ 4

చ॥ కొఱకొఱమానవుల్మిగులఁ గ్రొవ్వి సురారులనేఁచ సాగిరం
చఱిముఱిఁ జెల్లుమజ్జనుచు॥ రామా॥ 5

ఇందైదుపద్యములలో నఱిముఱులకు వరుసఁగా నర్థముంగనుఁడు. మొదటి పద్యమున నున్న యఱిముఱికి నెడతెగకుండ యని యర్థము. రెండవ యఱిముఱికి నత్యంతముఁ జావు పఱుగెత్తియని యర్థము. మూఁడవ యఱిముఱికి నవర్గళముగఁ జంపి యని యర్థము. నాల్గవదానికి శీఘ్రముగా నని యర్థము. ఏనవదానికి మాటిమాటికి యను నర్థము సందర్భముగ నున్నది. అయినను, "తే॥ గీ॥ ముందువెన్కల నా నఱిముఱి యనంగ । నలరుచుండును రెండు నేకార్థములుగ" నని యాంధ్రభాషార్ణవములోఁ జెప్పఁబడియున్నది. పైనవ్రాసిన యుదాహరణములలో "నఱిముఱిఁ జావఱువు వారి" అనుచో ముందువెనుకలు చావు పఱుగెత్తియని చెప్పవచ్చును. అపు డత్యంతార్థకత్వమునకు సంశయిలతురేమో. చ॥......నామహత్త్వము సమస్త జగజ్జననియ మాయయై । మెఱయ వసిష్ఠ ముఖ్యులగు మిక్కిలి శాంతులర్తిఁ జూచితో। నఱిముఱి వ్రజశుంఠవుగదా యరుదాయె భవచ్చరిత్రముల్॥" అను దశావతార చరిత్రమునందలి పద్యములో నత్యంతార్థకత్వము గనంబడుచున్నది. ఇయ్యుదాహరణ మర్థముకొఱకు వ్రాసితిమిగాని శబ్దముకొఱకుఁ గాదు. ద్విపదము॥ అఱిముఱి నగరుల నలిగి చూచుటయు। నఱువదివేవురు నట భస్మమైరి॥ రం-రా॥

అఱగొలైము = సాహసకృత్యము. (అఱగొండెమనియు నున్నది).

క॥ ఎఱిఁగి యెఱిఁగి నీముందఱ । నఱగొలైము సేసిపోయిరదె కొసరై యు
త్తెఱఁగైన హంసడిభకులు । గొఱపిందల వఱటికొనిన కోర్కులుగావే॥ సో-హ॥

అఱగొఱ = మర్మన్యూనత.

క॥ మఱియు నాకమాట యెవ్వరు । నెఱుఁగనియది దశరథునకు నేకాంతమునం
దఱగొఱలేని దృఢంబగు । తెఱుగు తపసి సెప్పవింటివే నాకరుండ౯॥ ఉ-రా॥

అఱచుట = బొబ్బలు పెట్టుట.

క॥ అఱచినఁ బఱచిన వ్రేళ్లులు । గఱచిన నతఁడించుకయును గరుణింపక యం
దఱను గ్గుసేసి గుంపుల । కుఱికియు ఘనఖడ్గ దారుణోల్లాసమున౯॥ భా॥

అఱువది = సంఖ్యా శబ్దము.

ఈశబ్దము మొదల నాఱుపదులని యుండఁగా "ఆదేశస్స్యాత్తథైకతా" అను నథర్వణోక్తివలనఁ బ్రాథమిక రూపమునందలి దీర్ఘాకార పకారములకు హ్రస్వాకార వకారాదేశములు నేకత్వమును రాఁగా "అఱువది" అని యయ్యెను. కూచిమంచి తిమ్మకవి యిందలిది యర్థాంశ వాచకమగు నరశబ్దమని చెప్పి యా

పద్యము నా ప్రకరణములో సుదాహరించెనది చింత్యము.

గీ॥ కలుగ నద్వికారములు నేకవద్భావ । మయ్యథర్వణోక్తి నఱువదద్యో
నర్థభాగనాచి యరయనిపల్కెఁ ది । మ్మన్నయదివిచార్య మచిదతీత॥

క॥ అఱువది గోటులు గపివరు । లుఱక జగత్త్రియము నొక్కటుకుమ్మెత్తగానం
దఱిగొన్నయట్లు నడువఁగ । నెఱసి కుముదుఁ డనుగుడెంచి నృపవరుఁగనియెన్॥ భా॥

అఱముటు—అభిక్రమము.

అభియానముఁ జనప్పు నఱముటయన॥ ఆంధ్రభాషార్ణవము

క॥ ఎఱుఁగుదు నేను సుయోధను । కొఱగామియు నతనితోడఁ గూడిన నృపులం
దఱుఁబగ మనసున నిడికొని । యఱముటయును సంధిపొసఁగ దనియమహాత్మా॥ భా॥

అఱవలు—కఠినులు, నిర్దయులు, ద్రావిడులు.

గీ॥ ఉలుముగొన్నవాఁడు తొలుమేన సాధుంత । బంధవముల నొరుల ప్రల్లదనము.
నెఱచినాడు పంగు లఱవలై కాల్సేయు । విఱిచి సాధుజనులఁ బఱపినారు॥ భా॥

టీక॥ ఉలుము—కుష్ఠరోగము; పంగులు—ఈజన్మమున కుంటివారు; తొలుమేన—పూర్వజన్మమందు; అఱవలై—కఠినులై; "అఱవలు ద్రావిడులఱవు టఱిసె" ననియప్ప కవీయము. గీ॥ పిఱికితనము నేమఱుటయు నఱవతనము । మెత్తఁ దాటును గార్యంబు నెత్తెఱుంగ । నేరమియు విషయంబులఁ గూరుటయును । గలుగు పతికినుండదు సిరి దొలఁగిపోవు॥ భా॥ సీ॥ అఱవలైనను నలవైన వెఱపున ముట్టియుంటఁగఁ బట్టి గట్టి విడువ॥ భా॥

అఱగు—వేదిక.

అఱవేక చనుటంజు గఱపినొనుట॥ అప్పకవి.

అఱువుల్లు—రంధ్రములు.

క॥ ఉఱకొనయుండెను మైమఱు । వఱువుల్లుగ నేసిలీల నంగములెల్లం
బఱియలుగఁ జేయనాతం । డఱిమఱిఁ దలఁకకయునేసె నధికశరములన్॥ భా॥

అఱుగుట—జీర్ణమగుట.

చ॥ అఱుగునె యక్కఁగుండు హృదయంబున నెమ్మెయి నొంచిచూచినన్
విఱుగునె మేరుభూధరము వెంగలివై రఘురాముభామినిం
జెఱగొని పోవఁ జూచెద విశీ చెడఁ జూచెద వోరినీచ నా

కఱపిన బుద్ధిఁ గైకొనినఁ గాచెద జానకి చింపుసమ్మహీ॥ రామా॥

దీనివలననే "ఱకువ, ఆఱక, ఱపికొనుట" అను శబ్దముల రేఫములు గురువులని తెలియవలయు.

ఆఱడు = స్త్రీమెడను గట్టుకొను పూస.

ఆఱక్రమ్మటయఱంటు లఱడఱ కంబిటియుట॥ అప్పకవి.

అఱ = కౌటిల్యము, కీడు, అపోహము, శయనగృహము.

సీ॥ ఆఱలేని నైతదీప్తి మెఱుఁగెక్క సరిమింటఁ జరియించు సంపూర్ణచంద్రుకళం॥

గీ॥ దుర్ణయమున శకునికర్ణ దుశ్శాసనుల్। గఱపఁ బాండవులకు నఱయఁజేయఁ గడఁగెఁ బాండవులును గడుధార్మికులు గానఁ। బారయవయ్యె వారి పూరితవిధులు॥ ఛా

క॥ అఱునదివేలేం డ్లిద్ధర। మెఱయంగా నేలినట్టి మీతండ్రికినే నఱలేని సఖుఁడ నైమ్మెయి। మఱతునె యీరాజసుతుల మాన్యులమమ్ము॥ రా॥

అఱ, యిది శయనగృహార్థక మగునప్పుడు "అఱ్ఱ" అను శబ్దమునకు ద్విత్వలోపమైనదిగాన గురుత్వము నియతమె.

అఱఁటిచెట్టు = మోచావృక్షము.

క॥ అఱఁటులఁ బఱటుల బటిసెల। గటిసెల మొటిసెల ※ ※ ※ ※కారము లెల్లన్ నెఱనున్నలునగు ధరన। య్యఱఁటులఁ బఱటులను బ్రుతములగు వలసినచోన్॥

రూపఱ = రూపుచెడి.

ఆదిశబ్దముచేత నేపఱ, ఉక్కఱ, పెంపఱ, సిగ్గఱ, మొదలైనవి గ్రహింపఁబడును.

క॥ ఎఱకలుగల కులశైలము। తెఱఁగు మెఱయ వాయుసుతుఁడు దివికి నెగసి బిట్టులము జలధరము క్రియను। క్కఱఁ దద్వచన మెల్ల నద్భుత నార్చుచుఁగడిమిన్॥ భా

అఱపొఱడు = వామనుఁడు.

అఱువది కోట్లఱపొఱడు గుజ్జుకఱి॥ అప్పకవి.

ఇఱకటము = సంకటస్థలము.

క॥ తఱుచుగఁ బెనుసందడిలో। నిఱకటమునఁ బడ్డనృపతి యీనిగ్రహముం బొఱఁగుటయె యీప్సితార్థం। బఱచేతికి వచ్చినట్లు యని వెతగుడుచున్॥ నై॥

ఇఱికికొనుట = అవకాశము లేనితావునఁ బ్రవేశించుట.

క॥ చఱచి యొకచేతఁ గూర్మముఁ। బెఱచేత గజంబుఁబట్టి పెనచి ఖగేంద్రుం డిఱికికొని గగనవీథిం। బఱచె వియచ్చర విమాన పఙ్క్తులుదూలన్॥ భా॥

ఇఱుకు=వైశాల్యము లేకయుంట.

క॥ చెఱకు విలుకాఁడు కోమలి|యిఱుకుం జనుదోయి నడుమ నెదగుఱియిడి దాఁ
గఱకు విరిములుకు లేసెను|జఱుకునఁ దనచేతిమేటి సూటిన్ ధాటిన్॥ క-ర॥

ఇఱుసు=రథావయవము.

బండి యిఱుసు క్రిక్కిఱియుట॥ అప్పకవి.

ఇఱియుట=కదియుట.

క॥ మఱికొంత సేపునకుఁ దె|ప్పిఱి లేచి ముకుందు మేను పెద్దయునుం బ్రొ
ద్దిఱియఁగఁ గౌఁగిటఁ జేర్చెం|బఱిపోయిన తాల్మినుష్ణ బాష్పములురులన్॥ భా॥

ఇఱుముకొనుట=దట్టమగుట.

చ॥ ఇఱుముకొనం బొణంగె దెస లేచిన చీఁకటినంచుఁ జేతులం
గొఱవులువట్టి క్రుమ్మరుచుఁ గొండొక ప్రాణములున్న బాణముల్
పెఱుకుచుఁ బెంటలై పడిన పీనుఁగులం గలయంగఁ జూచుచున్
నెఱకుల చండకాండములు నిండిన యాఘనుఁ గాంచిరొక్కెడన్॥ రామా॥

ఉఱుకుట=వేగనడచుట, పడుట, వెడలుట.

క॥ ఉఱికెడు వారలఁ జూచినఁ|దఱిమెడు వారికిఁ గడుమదంబగుఁగాదే
నెఱిచెడిన మనలఁగని మఱి|మఱలంపయదలఁపనలుఁడు మనబాంధవుఁడై॥ న-చ॥

గీ॥ ఏఁచి మున్నీరు చేనీఁతనీఁదనగ్ని|నుఱుకవాసుకి కోఱలు పెఱుకఁగణఁగి
నట్లుగాదె రాధేయ నీవర్జునునకుఁ| బోరనెక్కటి మార్కొనఁ బూనుటయును॥ భా॥

మిగిలిన యుదాహరణంబులను "కొఱ" అనుచో వ్రాయఁబడును.

ఉఱుత=చిక్రోడము.

ఉఱనిరోసంబున నుఱుతఁ బట్టి॥ అప్పకవి.

ఉఱవు=గొప్ప; విస్తారము.

క॥ ఉఱవగు వాఱికపంటలు| గొఱియలపాఁడియునుదఱుచగుం బసులకుం
దెఱవలు చట్టములయ్యెడ| ఱెఱచియ భుజియింతురర్థి నెల్లజనంబుల్॥ భా॥

ఉఱిది=బిగి.

ఉఱవన్నలావనుటుఱిది బెట్టిదమయ్యె॥ అప్పకవి.

ఉఱడు—లక్ష్యము సేయఁడు.

చ॥ ఉఱడు సురేంద్రునైన బలియుండు హిడింబుఁడు వానివాఁడికిన్
వెఱవని వారలుంగలరె వీరలు ముందఱెఱుంగరక్కటా
యెఱిఁగిరయేని వీరుతమయింటుల నిద్రితులైన యట్టులే
మఱి శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై॥ భా॥

ఉఱుములు—గర్జితములు.

క॥ ఉఱుముచు మెఱయుచుఁ బిడుగులు వఱలఁగఁగనలుగడలఁ బడ నవారితవృష్టిన్
గుఱకొని కురియఁగఁ బంచెను మఱియును నయ్యనలుమీఁద మఖభుండలుకన్॥ భా॥

ఉఱనిరోసము—ఉడుగనికోపము.

"ఆఱవెయ్యి" అనుదాని యుదాహరణముం జూచునది.

ఉఱ—ఇష్టము; గొప్ప.

చ॥ వెఱచితిరాఁగదేయనిన వెండిఁ కదాపఁగఁదీర్తువీవునా
వెఱపెటులున్న నీరధికవీరులు దీర్చెదరొల్లనిన్నునీ
యుఱునైడకేగితోడువదు మొండులకెవ్వరికేనియన్న నే
త్తెఱనతఁడేగ్గికారవపతింగనియిట్టులబిట్టువల్కినన్॥ భా॥

(నీయుఱునైడయనఁగా నీకునిష్టమగు చోటునకనుట)

ఉఱునట్టివరంబుదీనినొసఁగుము పుత్రా॥ అనునీపద్యములో నుఱుశబ్దమునకు గొప్పయైనయని యర్థము.

ఉఱియ—దిట్ట.

ఉఱియ నిల్లుఱియుట॥ అప్పకవి

ఉఱక—యుగపదర్థకము; శీఘ్రము

దీనికి 'నఱువది' యనుశబ్దోదాహరణముంజూడవలయును.

ఉఱియుట—కుఱియుట.

దీనికి 'నుఱియ' అనుదాని యుదాహరణముం జూడవలయును

బలముఱి—బలముఁగలవాఁడు.

ఉఱకరి బలముఱి॥ అప్పకవి.

ఎఱపటికము = ఆసమ్మ[illegible]

ఎఱపటికంబననెఱుగుట మ్రొక్కుట॥  అప్పకవి.

ఎఱుక = జ్ఞానము

క॥ ఎఱుకఁ గలవారికైనను । గఱకతక్కరుచిత ప్ర[illegible]రము శుభముం
  గొఱలుహితులట్లగుటనం । దఱకుం జెప్పంగవలయుఁ దగియెడుబుద్ధుల్ ॥  భా॥

ఎఱుఁగుట = తెలియుట

ఆఱగొండెము మొదలైన శబ్దములం జూడవలయును- ఈ శబ్దము నప్పకవి యెఱుఁగుట తెలియుట యని గురురేఫములలోఁ జెప్పియు స్వప్రణీతోదాహరణమునందు లఘురేఫములకుఁ బ్రాసముగఁ బ్రయోగించెను॥

ఉ॥ పుఱిటింటం బసిబిడ్డచందమున వాపోవంగ నాఁడాత్మలో
  మఱువొప్పక విషదుగ్ధయుక్తకుచయై ముద్దాడు [illegible]
  రైఱేఁగిష్టంబుగఁ బాలుఁ ద్రావుమిషచే ని[illegible]
  ధరణింగూల్చిన నందపుత్త్రువలనం దార్కాణ[illegible]స్థితుల్ ।

(ఈ శబ్దమునకు రూపాంతరమును బద్యమునకుఁ బాఠాంతరమును గానరాదు.)

ఎఱుకువ = జ్ఞానము.

క॥ ఎఱిఁగినఁ జేరఁడు చేరుట । యెఱుకువయై మనకు దైనమిచ్చిన సిరియి
  ట్లుఱమిన నీలోఁ గ్రక్కున । నఱుకుమితఁడు దెగిన మన మనఃపీడ దెగున్ ॥  భా॥

ఎఱగుట = వ్రాలుట; మ్రొక్కుట

క॥ ఎఱగిన నప్పుడు వ్రేఁగున । విఱుగుటయును శాఖఁ జూచి విహగేంద్రుఁడు గొం
  దఱ మునుల నందుఁ గనుఁగొని । వెఱపున నాత్మీయచిత్తవృత్తిఁ గలంగన్ ॥  భా॥

సీ॥ సంధ్యల నిద్రింపఁ జనకు తండ్రికి తేప మ్రొక్కి యాచార్య విప్రులకు వరుస
  మఱి మ్రొక్కనది వీరికెఱగుట దక్క దేవార్చనంబునను [illegible]కడకుఁ
  జనఁ గాదు  భా॥

ఎఱకలు = పక్షములు-

క॥ ఎకఱలు విచ్చుచుఁ దుండముఁ । దెఱచుచుఁ గ్రేగదరిసొగసి [illegible]
  యఱచిన నోడకుమనిహరి । సెటిసక్కఁగఁ ద్రోఁచియెత్తెనగయఁగ గృహతోన్॥

ఎఱుకు = కిరాతుఁడు.

క॥ ఎఱుకనియెఱుఁగకనీకు। న్మఱకువనెదిరించినాఁడమఱువుముదీనిన్
గఱకంఠాపుమిడియుంపుము। పెఱెనెవ్వరికెఱుఁగనగునె నీచరితంబుల్॥ భా॥

ఎఱచి = మాంసము.

సీ॥ గొఱియనంజుడు ఖడ్గంబునెఱచి గండ। మృగమునందలి పలలంబు మేఁకమాంస
మొక్కటొకటిఫలమున నెక్కుడంద్రు। పితృసమర్చనవిదులైన పెద్దలధిప॥ భా॥

ఎఱమంటలు = దీప్తజ్వాలలు.

క॥ ఎఱమంటలుమిడియఁ జూడ్కులఁ। జుఱఁజూచుటయునప్పుడు చోద్యంబుగనం
జఱుదగ్ధదేహులైరా। పతితలుమగభస్మరాసులైరినరేంద్రా॥ ఎ-హా॥

ఎఱయనఁగా నెఱ్ఱశబ్దమునకు ద్విత్వలోపమగునట్లుగాఁ దోఁచుచున్నది గా
పున నెఱసంజ మొదలగు శబ్దములన్నియు నిట్టివిగనెఱుంగవలయు.

ఒఱపు = సొగసు; విలాసము.

చ॥ ఒఱపరిఁగన్నఁ గూడఁజను నూరకసన్నలు చూరనాడుఁద
త్తఱపడు బోటి జీరెడు విధంబున నొత్రిపబ్బనవ్వుఁ బ
ల్కఱుఁ బొరుగిండ్లకేగు నొకమట్టున నిల్వదు చంటిమీఁద ను
న్గఱఁ గెడలించు వైశికపు నీగ్గునటించును జారధారుణి॥ వై-భా॥

ఒఱపుశబ్దము కషణార్థకమగునప్పుడు ద్విరూపము.

ఒఱ = ఖడ్గకోశము.

క॥ ఉఱవగుశక్తియుఁబోయిన। నొఱవెట్టిననాలుకవెఱికి యుడుపథమునకున్
మెఱుఁగులెగయఝుళిపించుచు। నుఱికిమరుత్తనయునవతుమురువడివైసెన్॥ రామా॥

ఒఱ శబ్దము లేపకషణార్థకమగునప్పుడు ద్విరూపము.

ఒఱకటము = నిమ్నోన్నతము.

సీ॥ ఒఱకటంబునఁబోవుటొఱపులు నాకెక్కు॥ అప్పకవి.

ఒఱలుట = ధ్వనితోఁ బొరలుట.

క॥ నెఱఁదప్పిపడినపెల్లన। నొఱలెడినరవాజికరుల యులివభిమన్యుం
డతిమఱఁ బడుటకునపగమది। బతిఁగొనినిలపెలుచనఱచుభంగిఁ జెలంగన్ భా॥

చ॥ తఱిఁగొనవంతలోన మధుదైత్యహరుం డమరేంద్రుసింజినిం
గొఱనెలతూపునందునిమి క్రూరతరంబగు భల్లమొక్కటిన్
నఱికినఁ గూలె ధన్వము ఘనాఘన కల్పితమైన చెక్కియుం
బొఱలుచునూడెఁ గాలిమొదలూడఁగఁ గూలెడు మ్రానుకైవడిన్॥ పా-హ॥

ఒఱవ=వక్రము.

క॥ ఆఱగొఱలు గుఱుచ చేతులు। నొఱవశరీరంబుగలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథు। నొఱపులఁబడియెడు నితండు యువతిప్రీతిన్॥ భా॥

మూలము-

సీ॥ కఱకంఠుఁడక్కఱ కఱకఱికఱచుట కఱతలు కఱదులు కఱటికఱవు
కఱకఱనమ లెమ్రోకఱలెనుక్కఱియయ్యొకిలు మెట్లుకిలు పుటకుఱుకుఱుకుఱు
కుఱకుఱుమావుకక్కఱితి కుఱంగట కుఱుచలు కుఱుపునిం కెఱకెఱయుట
ఉక్కెఱకొఱలుటయును కొఱకొఱకొఱకొఱకె కొఱకొఱఁత కొఱడుకొఱవి
కొఱయుచాఁగఱగొనుటయుగఱికెగఱప। గఱగఱగొఱయునిఱిసెయుగఱిచెగిఱక
గిఱుఁగిఱికలుగిఱిగొనెగుణదుపాత్రి। తాంతరధ్వాంతరవికాంతికాంతచరణ॥

ఈ పద్యమునందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును.

కఱకంఠుఁడు=శివుఁడు.

దీనికి "ఎఱుకు" అను శబ్దోదాహరణమునఁ జూడఁదగును.

అక్కఱ=పని; ప్రయోజనము.

చ॥ ఎఱిఁగితినన్ను నేను విబుధేంద్రుఁడనీవు జగత్త్రయంబుఁ గ్ర
చ్చఱభవదీయరక్షణమునంద వెలుంగుచునుండునట్టి ని
న్నఱవుగ నేను వేడుకొనయుక్తముగాక మొఱంగి నన్నన
క్కఱపడినీవు వేడుటదికర్జమె నిర్జితదైత్య చెప్పుమా॥ భా

కఱకఱి=బలాత్కారము.

చ॥ ఎఱుఁగరుగా యొకద్భుతము నీచెలిదీర్ఘికఁ దీర్థమాడ నా
యెఱుతగదల్చిపోవునాక హారముపోయిన నేనుపోవుదున్
మఱువక వెంటఁ బోవజలమగ్నత చేనదిసున్నమైనన్
గఱకఱిఁ జట్టుసొమ్మడుగుఁగాని నిజార్తియెఱుంగఁడేమియున్॥ ఆ-మా॥

ద్విపదము॥ కఱకఱినిను బట్టికదసినీమేను
దఱిగినీరక్తముల్ ద్రావెదనిపుడు॥ రంగనాథరామాయణము॥

కఱచుట=నేర్చుట, దంతపీడనము.

చ॥ తఱియగునంతకు న్నిపు నుదగ్రతసైచుట నీతి నీవు నా
కఱపినయట్లుసేయుమతగంజని యాతనిఁగాంచినన్ను నై
తెఱఁగునసైనఁ బొందఁగ మదింగలదేనియు నింతయేల గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడపై చనుదెమ్మనుమంత దీరెడున్॥ భా॥

కఱచుటకు ణిజర్థముగఁ బ్రయోగము.

గీ॥ తగినయెడఁ బాపాత్ములఁ దద్భటాలి। దహనకర్తనబంధనతాడనములఁ
బఱచువారలఁ గుక్కలుగఱచుఁ గ్రిములుఁ। దొలుచుగ్రద్దలునొప్పించుఁదుండనిహతి॥

కఱతలు=పోకిళ్ళు.

చ॥ కఱతలపూఁపవై మునులుగాననియట్టి కథల్వచింపఁగా
వెఱఁగిననీకు నాఁకలియు నేర్పులునాయనువారుమాయలం
బఱచిననేమువోమిఁక స్వభావపుదివ్యవిభూతితోడనే
వఱలుచుమమ్ముఁ బ్రోవుమనువారునునైరపు డాసభాసదుల్॥ క-పూ॥

కఱదులు=వంచనలు; మోసములు.

క॥ కఱదులమాటలమమ్మం। గుఱిచవదుగనేలయింతగా శంకింపన్
నెఱయఁగ నీ యిష్టముమా। కెఱిఁగింపుము వేడ్కనిత్తునెయ్యదియైనన్॥ వి-హ॥

కఱటి=మూర్ఖుఁడు.

క॥ మఱచినఁ దలపింపఁగనగు। నెఱుఁగని నాఁడెల్లనాదు నెఱిఁగింపనగున్
మఱియెఱిఁగియెఱుఁగనొల్లని। కఱటిందెలుపంగఁగమలగర్భుని వశమే॥ భా॥

కఱవు=దుర్భిక్షము.

క॥ కఱవుపయిఁగఱవుపొరయుచు। వెఱవుపయిన్వెఱవుఁదోఁపవిడువనియిడుముల్
దొఱఁగమిపైఁబురుషుఁడిడుమఁ। దొఱఁగమిచేడ్పడుచునడచు దుష్కర్మములన్॥

కఱకఱ=అనుకరణవిశేషము.

చ॥ కఱకఱఁబండ్లుగీఁటుచును గాకదిగంతములుచ్చిపాఱఁగాఁ
జుఱచుఱనిప్పుకల్చెదరఁ జూచుచుఁగోఁఱలమంటలూరఁగాఁ

గోఱకోఱమానవుల్ మిగులఁ గ్రొవ్వి సురారులనేఁప సాగరం
చఱిమాఱిఁ జిట్టుముట్టువడు నట్టులు మిట్టుగ నెత్తి పల్కినన్॥ భా॥

మ్రోకఱిల్లుట — పతనభేదము.

సీ॥ అర్చి యెడవంక సాత్యకి యడ్డగింప। వాసుదేవుండు వలవంక వచ్చి యురము
వ్రేయ నవ్వీరుఁడచ్చోట వ్రేసెఁ దత్త్రు। ఱించి పౌండ్రుఁడు విభు మ్రోకఱిల్లఁబడఁగ॥ సౌ-పా॥

ఉక్కిఱి — అనుచ్ఛ్వసనము.

క॥ వెఱచఱిచి నీటిలోను। క్కిఱిగా నొకమొసలి చూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు। చిఱుఁదొడవడిఁ బట్టుకొనియె శిష్యులు బెదరన్॥ భా॥

కిఱుమెట్లు — ఉపానహములు.

మ॥ తఱినాక్రాంతసమస్తలోక బలిదైత్యధ్వంసి యో దేవ నీ
యఱకా లుద్ధతి గాపుఱుమండలము బ్రహ్మాండంబుతో నెత్తివం
గుఱుగొట్టించెడు సంధిబిట్టూఱలు నా ఘోరాహి నీయంఘ్రికిం
గిఱుమెట్లైన విధంబు నామనములోఁ గీలించినట్లయ్యెడిన్॥ వై॥

కిఱ్ఱుమెట్టుచు శబ్దము ద్విత్వలోపమై కిఱుమెట్టని పై పద్యమునఁ బ్రయోగింపఁబడినదని యెఱుంగునది.

కిఱువుట — కదల్చుట.

చ॥ ఉఱక నరుండు ద్రోణసుతు యుగ్యముల న్వెసనాంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబుల నారిఁ ద్రుంచి క
న్గిఱిపిన మాత్రలోన యతనింబటు బాణచతుష్కయుగ్మమే
త్రెఱఁదొడి మౌర్వి క్రమ్మఱ ఘటించు నెడన్వడి నేసి యార్చినన్॥ భా॥

ఇది గకారాదిపదమని దీనిం గొందఱందందని యున్నారు.

క॥ గిఱువు నెడ వేయు నెడ వడిఁ। బఱచు నెడఁ బెనంగు నెడన పౌరబలంబుల్
మెఱయు నెడ భీమువకునం। దొఱుఁగిడ్పఁడఁ ద్రోణఁగిరుద్ధతులు రాజసుతుల్॥ భా॥

కుఱుకులు — రాసులు.

మ॥ విఱిగెం బెక్కు రథంబులొక్క మొగి నుర్వింగూలె శుండాలముల్
దఱుచై రాలెఁదురంగ ❊ ❊ సంతానంబులింతింతలై
కుఱుకల్గట్టై భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబులై

పఱచె న్నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్సురల్॥ భా

కుఱుకాఱు—స్వల్పము.

క॥ తెలియఁగ నీశుభలక్షణ। ములు కుఱుకుఱు కవుల కావ్యముల లేవు సుమీ
తొలుత మహాకవివర్యులు। పలికిన సత్కృతులఁ దక్కఁ బన్నగశయనా॥ అప్పకవి.

కుఱుమాపు—కొంచెపుమాపు.

సీ॥ కఱకుశైవలి సేసిన కుఱుబెండ్రుకలతోడ బట్టియాదలఁ గాలిపాగయమర॥ నై॥
కుఱు అనఁగాఁ గొంచెము. కుఱుబెండ్రుకలనఁగాఁ జిట్టిబెండ్రుకలు.

కక్కుఱితి—ప్రాల్మాలుట.

చ॥ గిఱికలఁ జుట్టిపీరిన ణఁగించి తొలంగితిమేని వట్టిక
క్కుఱితి యొకాని దైవమనుకూలము గాదు లవుండు మొక్కలీఁ
డుఱికినఁ బ్రాణహానియును నావ్వమిఁ జేయునటంచు జీవముల్
దొఱఁగిన భావముల్లములఁ దూకొనఁ జేష్టలు దక్కి యుండఁగన్॥ జై-భా॥

కుఱఁగట—సమీపము.

కుఱుమాపు కుఱఁగట కుఱుచ కుఱులు॥ అప్పకవి.

కుఱుచలు—నృత్యములు, హ్రస్వములు.

చ॥ తఱులఱనిక్కఁ బూఁత నెఱతావియ చిక్క నపాంగమాలికల్
మెఱుఁగులు గ్రక్క నూఱుపులమేలిమి తేఁటులు చొక్క హారముల్
గుఱుచలు ద్రొక్క ... ... ... వసు॥

రెండవయుదాహరణమునకుఁ "గఱుసులు" అనుశబ్దమునకు వ్రాసిన యుదాహరణమును 74వ-పుటం జూడవలయును.

కుఱుపు—వ్రణము.

కుఱుపువ్రణము॥ అప్పకవి.

నింకెఱ—వేగము.

చ॥ వఱలఁగ రాముఁడంత నసవద్యుఁడు వచ్చి బహుప్రలాపయై
యఱచుచున్న తల్లినిఁ గృతాంతవశస్థితుఁడైన తండ్రి, నిం
కెఱగని తీవ్రకోప పరిఖేదహృదుండయి తత్ప్రతీకారమం
దెఱఁగి ముహూర్తమేనియు సహింపఁగ నోపక రోషదీప్తుఁడై॥ భా॥

సంకెఱయనుమాటకు బదులు 'దిక్కఱగని' అని యొకపాఠాంతరము గలదుగాని దిక్కఱశబ్దమెచ్చటను గానరాదు. దిక్కఱయనఁగా నవస్థయనితోఁచుచున్నది. అన్వయరీతిని విచారించినను నస్మల్లిఖితపాఠాంతరమే యుక్తముగనున్నదని సూక్ష్మదర్శనులచే నవధరింపఁదగినది. సంకెఱగనియనుపాఠమునకు దుఃఖపడుతల్లినిఁ జచ్చినట్టి తండ్రిని శీఘ్రముగఁ జూచునని యర్థము.

ఉక్కెఱ=వండినపిండి.

కిఱుప్రుటకెఱయు టుక్కెఱయుఁ బక్కెఱయును॥ అప్పకవి॥

కెఱయుట కర్థముతెలియనందున నప్పకవియె ప్రమాణము.

కొఱుట=వింపుట, ప్రకాశించుట.

ఎఱుక యను శబ్దోదాహరణముం జూడవలయు.

కొఱకొఱలాడుట=కోపవికారము.

కఱకఱ అను శబ్దోదాహరణముం జూడవలయు.

కొఱుకుట=దంతపీడనము.

సీ॥ ఘనతటిల్లతల యట్లైనిమిది దంష్ట్రలు మెఱయఁగఁ బండులుఁగొఱికికొనుచు॥ భా॥

కొఱను=బీడు.

గీ॥ కొఱఁకనంగను బీడునాఁ గొఱననంగఁ। గంచెయన నప్రహతభూమి॥ ఆం-భా॥

క॥ కొఱఁకులు నెఱనులు ప్రూఁకులు। సిఱుకొలఁకులునయ్యెఁ జేనుచేను స్త్రీనుతా కొఱఁజేఁజఁబేలుమీలన। నుఱవగునిలవచ్చ తెలుఁగు లూహింపంగా॥

(కొఱనను శబ్దమునకు 'స్వంతాన్నామ్న' ఇత్యాదిసూత్రముచే బహువచనమందు వజాదేశమువచ్చి కొఱఁకు వైది- కావ్యాలంకారచూడామణి.)

కొఱఁత=తక్కువ, కొఱ్ఱు.

సీ॥ కొఱఁత నాఁ దక్కువ కొఱ్ఱు వెలయు॥ ఆంధ్రభాషార్ణవము.

క॥ తఱిమి పఱునడచుటయు బలు। విఱుగఁగానేసె నతఁడు విక్రమలీలన్ కొఱఁతపడనీకకర్ణుఁడు। మెఱుఁగులడరుశక్తి సురలు మెచ్చఁగ నేసెన్॥ భా॥

శూలార్థకమగునపుడు కొఱ్ఱుశబ్దమునకు వికారముగావున గురువు.

కొఱవి=ఆలాతము, కురువక వృక్షము.

క॥ కొఱవియుఁ గొఱవియుఁ దాఁకెఁ। తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడుచూ పఱువాగఁడఁగఁదాఁకుట ని। ద్దఱిదిక్కులసైన్యములును దలఁపడినొవఁడిన్॥ భార॥

ఈ శబ్దము రెండవయర్థమగునపుడు తద్భవము 'కొఱవులై యొఱుఁగంబడెఁ గొన్ని భూజముల్' అనియాముక్తమాల్యదలో శ్లేషరచనవలనను నిదిలఘువనుటకుఁ బ్రయోగముఁగానరాకుండుటవలనను గురుశేషయని నిశ్చయింపఁబడియెను. 'కొ అవినాఁ గ్రోవినాఁ గ్రొమ్మినాఁగఁ గురువకనామమా' అని యర్ణవము. ఇదికురువక శబ్దమువలననె పుట్టినది.

కొఱ = మనోజ్ఞము, పని, తక్కువ, సస్యవిశేషము, మత్స్యవిశేషము.

క॥ కొఱమాలిన దుర్లక్షణ। కొఱఁగాదిదినీకు నారి గుప్తంబుగ ని
జైఱభిని వధించిసీతో। నఱలేనిమనోజ్ఞకేళినలరెద నెలమిన్॥ రామాయణము॥

(పనికిమాలిన దుర్లక్షణములు కలదిగావున మనోజ్ఞురాలు కాదనియర్థము.)

చ॥ తఱిగొనియంతలోన మధుదైత్యహరుండమరేంద్రు నింజినిం
గొఱనైలతూపులందునిమి॥ ... ... పారిజాతాపహరణము॥

సస్యమత్స్యపక్షములయందు. కొఱ్ఱయను శబ్దము ద్విత్వలోపమైనదిగావున గురుత్వము నిర్వివాదము. "కొఱకొఱ్ఱయనఁగను బరఁగుసాఁగినంబు" అని భాషార్ణవము- ఈనిఘంటువులో లఘువునకుఁ బ్రాసమున్నదని శంకింపవలదు- ఇందా నియమము బొత్తుగా లేదు. విస్తరభీతిచే వివరింపము.

క॥ జుఱజుఱయని నెత్తురువెలి। కుఱుకుచురొదసేయనలుతి యొఱఁగినయార్పుల్
పఱవమిడి గ్రుడ్లవడఁకుచుఁ। గొఱఁ బ్రాణముతోడఁదన్నికొను నమ్మొదవున్॥

కొఱఁబ్రాణమనఁగాఁ గుట్టుసురు.

చాఁగఱగొనుట = చంపుట, సులుముట-

చ॥ మఱుకువ కత్తిరించి మదమానములం జుఱువుచ్చి మెచ్చుఁజాఁ
గఱకొని క్రోధకామముల గండడఁగించి పరాపకారమున్
జఱిపడఁ ద్రోఁచి వాచవుల చట్టలువాపి తొలంగి చిత్తముల్
జఱబడియున్న నీకు నొకచక్కటి నెక్కటి వేఁడఁగ ల్కెడిన్॥ సో-హ

గఱిక = తృణము

గఱికనట్టులు గఱగఱికలు॥ అప్పకవి॥

గఱి = పక్షము.

చ॥ అఱమి విభావరీచరులు నమ్ముల మర్మముగాడనేటులం
గఱులుమునుంగ దూఱ నెలకట్టియపోట్లను గుంతలాదులం

దఱుచుగఁ దాఁకు పోట్లనుగదాపలిఘాదులనెల్ల మున్నొనల్
పఱిపఱిగా బలీముఖులు పాట్లు నెలంగఁ జెనంగరయ్యెడన్॥ రా-మా

గఱగొఱ=లోపము; న్యూనత.

ఈ శబ్దమును గొందఱు కాదివర్ణముగా 'కఱకొఱ' అనివ్రాసి కశ్మలమని యర్థముం జెప్పుదురు. మఱికొందఱు 'కఱ=కొఱ' రెండుపదములకు ద్వంద్వసమాసమనియుఁ గఱయనఁగా నపఖ్యాతియనియుఁ గొఱయనఁగా న్యూనత్వమనియుఁ జెప్పిరి. అట్లయినఁ గొందఱు నైఘంటికులు గకారాది శబ్దములలో వ్రాయుటవలననా చేతనట్లనే చెప్పఁబడియెను.

చ॥ తఱిమిసుశర్మతమ్ములును దానును బోరికినన్నుఁ బిల్వ వే
నెఱుఁగని యట్టులుండుటిది యేపురుషార్థము వారినెల్లనే
ద్రెఱసులు మాడఁ బంపుము కడిందిగఁ జూడకు వారినేమియుం
గఱగొఱ వాదు పో మిడుకఁ గష్టము నాకు నుదాత్తమానసా॥ భా॥

గఱిసె=కొల్తభేదము.

గఱిసె డగ్గఱియింప గఱెపగఱయు॥ అప్పకవి॥

గఱిటె=దర్వి.

అఱఁటియను శబ్దోదాహరణమునందుఁ జూడఁదగును.

కొఱడు=తిన్ననియింద్రధనుస్సు

కొఱడనరోహితమ్ము దోఁచుఁబురారీ॥ ఆంధ్రభాషార్ణవము.

పండ్లుకొఱుకుట కోపంబుకొఱడువడుట॥ అప్పకవి.

గిఱులు=గుండ్రనిగీఁటులు.

గిఱులువ్రాయుట మోటుగిఱుకయు॥ అప్పకవి.

గిఱికలు=చిక్కులు

కక్కుఱితియను శబ్దోదాహరణమునందుఁ జూడఁదగు.

గిఱిగొనుట=వాటుకొనుట; కప్పుకొనుట

క॥ ఉఱకమదీయాంగంబులు। గిఱిగొనన శ్లేయుటయును గినుకగదిరినన్
మెఱుఁగారు నారసంబులు। దఱచుగనించితిఁగడంగి తద్గాత్రములన్॥ భా॥

సీ. గీ॥ గుఱుకొనుట గుఱుఁ గుఱ్తించె గుఱుతు గుఱిచి
గుఱుకు గుఱుకొండి గుఱుములు గుఱగుఱ నిఱుఁ
గుఱులు చిగిరిచె గెఱ గొఱగొఱ గొఱుగుట
యద్వితీయాస్త్ర యాగపద్య హృత తాళ॥

ఈ పద్యమందలి శబ్దోదాహరణములను వ్రాసెదము-

గుఱుకొనుట — ఉద్యోగించుట, యత్నము సేయుట-

క॥ మఱియును నాకనాఁడెన్నఁడు। నెఱుఁగక యుండఁగ గారవేంద్రుఁడు ధర్మం
బెఱుఁగక విషమన్నముతో। గుఱుకొని పెట్టించె గాద్పుకొండుకునకలుకన్॥ భా॥

గుఱుగుఱ్తించుట — గుఱుపెట్టుట-

"క్రియుమెట్టు" అను శబ్దోదాహరణంబునం జూడవలయును-

గుఱుతు — అభిజ్ఞానము, ఆనవాలు-

చ॥ ఒఱఁగినఁజూచి యానృపకులోత్తము చిత్తము కూర్మికాత్మ ని
వ్వెఱపడి తాపవారకము విస్మయనీయము నిండి నెయ్యపుం
గుఱుతును నైన మత్కర వినూత్నహారముఁ జేరఁబోయి యా
నెఱదొర కంఠపీఠమున నిల్పితి నిల్పఁ బ్రఫుల్ల నేత్రుఁడై॥ వసు॥

గుఱిచి — ద్వితీయా విభక్తి ప్రత్యయము-

చ॥ ఆఱువదియేడుకోటు లరయన్ సురసంభవులైన యూథపుల్
నఱుమయి రన్యజాతులు రణంబునకుంగల వీరులెందఱం
చఱువడి రమ్మహీభుజుఁడు దత్తవరుండని బ్రహ్మవాక్యముం
గుఱిచి విసంజ్ఞులైరి రఘుక్షితినాథులు నేమి సెప్పుదున్॥ రామా॥

గుఱించి — గుఱిచి (పైయట్లనే)

గుఱుకు — ఈఁటె-

"ఇఱుకు" అను శబ్దోదాహరణమునం జూడవలయును-

గుఱుకొండి — మర్మము, రహస్యము-

గుఱుకొని గుఱిగుఱు గుఱుకొండి గుఱుతు॥ అప్పకవి॥

గుఱుములు — బీజములు-

గుఱుములు గింజలు గొఱుగుట వపనంబు॥ అప్పకవి॥

గుఱగుఱ = అనుకరణధ్వని-

గుఱుకవెట్టుట గుఱగుఱ గుఱువెట్టుట॥ అప్పకవి॥

మిణుఁగుఱులు = అగ్నికణములు-

చ॥ మెఱయుచునున్న వజ్రహతి మేరుతటంబునఁ జెల్లునన్మిణుం
గుఱులన విస్ఫులింగములు గుంభుని ముష్టి విఘట్టనంబునన్। వఱలఁగ॥ రామా॥

గెఱ = గుఁడ్రసిగేటు-

సీ॥ గెఱకట్టుకొనిపుట్టు వెఱపూఁప చన్నులతో॥

గొఱగొఱ = అనుకరణధ్వని విశేషము. (తఱిమి

గీ॥ తెఱలిరియుండొక్కటిని రూక్షదృష్టిఁజూచు। గొఱగొఱను మూల్గుగద్దించి తఱిమి
కలసి కలహించు ఘోంకృతి కలకలముగ। జాగిలంబులురోష భీషణములగుచు॥ క-మ॥

గొఱుగుట = క్షౌరముసేయుట.

గుఱుమ్మల్లను శబ్దోదాహరణముం జూడవలయు.

మూలము-

క॥ చఱచుట వెఱచఱచుట వా। చఱచుట చిచ్చఱయు కొండచఱులు చిఱుత యొ
చ్చెఱుట చిఱికొట్టె చిఱుము। చ్చెఱుటయు చిఱుముట భుజంగశేఖరతల్పా॥

ఈపద్యమందలి శబ్దములకు సర్థోదాహరణములు వ్రాయఁబడు.

చఱచుట = కొట్టుట; సాఁగఁగొట్టుట

క॥ వెఱచఱువఁ బట్టుకొనివడిఁ। జఱచి జరాసంధు సంధిసంధులయెమ్ముల్
విఱిచివధియించి యార్చెను। వఱలఁగభీముండు భూమివలయం బద్రువన్॥ భా॥

కొండవలికాఁచి చఱచుట, కరమునఁజఱచుట-

వెఱచఱచుట = భయపడుట

క॥ ఎఱకలగాఁడ్పుననొగివెఱ। చఱవఁగ వడి వీఁచి యతని శాత నఖములన్
జుఱజుఱఁ జీరియు ముక్కునఁ। గఱచియునొప్పించెవాఁడు కరువలితనయున్॥

వాచఱచుట = పరిదేవనము

వాచఱచుట కొండవలికాఁచి చఱచుట॥ అప్పకవి-

చిచ్చఱ = అగ్నిమయము

చ॥ చిఱునగవొప్ప గాండివముఁ జెచ్చెరసజ్యముసేసి సీనలు
క్కఱ రభసంబుమైనడరఁగ న్వడిద్రౌణియు నీడుహోకయ
త్రఱేఁదఱుమంగనస్త్రములు దందడిదార్కొని మండుచుండెఁజి
చ్చఱపిడుగుల్వడిందొరఁగుచాడ్పున నంబరవీథినుగ్రమై॥ భా॥

చఱులు = సానువులు

క॥ మఱునాఁడయగుట లెస్సఁగ। నెఱిఁగెనినుండపుడు వేఁడిగొడలినదీప్తుల్
మఱఁగలిగొనపశ్చిమగిరి। చఱికినవతి దూరమునవిశేషుఁడైతోఁచెన్॥ భా॥

ద్వారకాపట్టణము మునిఁగిపోవుటకు శ్రీకృష్ణస్వామి యవధిచేసిన సప్తమ దినము మఱునాఁడేయగుట యర్జునుఁడు లెస్సగాఁ దెలిసికొన్నాఁడనుట. ఈ పద్యములో నప్పకవీయములోఁ బాఠభేదమున్నది. అదితప్పగానున్నది.

చిఱుత = బాలుఁడు, చిన్నదారుఖండము, మృగవిశేషము.

క॥ సొలవకతూరిఁగలకా। ట్లులఁజెట్టితివీవు నీచిఱుతకాలము ద
త్ఫలమిప్పుడనుభవించితి। తొలఁగునె హింసాపరులకు దుఃఖంబనఘా॥ భా॥

ఈ శబ్దమునకు వ్రాసినయర్థము లన్నియును జిన్నయను శబ్దమునుపట్టివచ్చినవే కావున నన్నింటికిదియే యుదాహరణము.

ఎచ్చఱుట = ప్రబలుట.

చ॥ మఱుసటినాటి వేఁకువ నమాత్యుఁడు మేల్కని వంశమంతయున్
జెఱిచిరి కూఁతురుం గొడుకు చెల్లరెమీఁదటఁ జంద్రహాసుఁడె
చ్చఱినఁ బ్రమోదమౌననుచుఁ జిత్తమునందలపోసి వీనినే
తెఱఁగుననైనఁ బంపెద యతిప్రవరోక్తులు బొంకునేసెదన్॥ జై-భా॥

చిఱుకొట్టుట: ముచ్చిఱుట = వ్యసనపడుట.

చిఱికొట్టె చిఱిమి ముచ్చిఱితనమున॥ అప్పకవీయము॥

ఉ॥ మూచ్చిఱనేల నేఁగలుగ మూద్దియనాకువృకోదరుండు వి
వ్వచ్చుఁడు దోడుగా * * * భా॥

చిఱు = చిన్న.

("చిచ్చఱ" అను శబ్దోదాహరణముం జూడవలయును. ఇట్లు చిఱునవ్వు, చిఱుఁదొడ, చిఱుకప్పు, మొదలైనవి గురురేఫములే)

చిఱుముట = చిమ్ముట, చిదుముట యనియుఁ గొందఱు.

చ॥ పెఱుకుదుమే ఫణీంద్ర విషభీకర దంష్ట్రిలు సేలఁ గ్రుంగఁజేఁ
జఱతుమే నింగి మ్రింగుదుమే చండదిశా గజదంత కాండముల్
బఱతుమె వారిధుల్పుడిసిలింతుమె మందర మంగుటంబునన్
జిఱుముదుమే జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాక్షసేశ్వరా॥ రామా॥

మఱిజగన్మోహన మాయవాల్చినజాల
చిఱుమతఱి ద్రౌపదికిఁ జీరలిచ్చిన కాల॥ అప్పకవి॥

మూలము.

క॥ చుఱుకు చుఱుపుచ్చు చుఱచుఱ। చెఱమలు చెఱిసగము చెఱుకు చెఱలాడుటయున్
చెఱువు చెఱమాటయు చెఱచుట। చెఱచోఱ యోగీంద్ర హృదయసేవితచరణా॥

ఈ పద్యమునందలి శబ్దముల కర్థోదాహములు వ్రాయఁబడును.

చుఱుకు = వాఁడి, కాఁక

“ గుఱుకు ” అను శబ్దోదాహరణమునం జూడవలయును.

చుఱుపుచ్చుట = కాల్చుట.

క॥ ఎఱమంటు లుమిసియు నాతని। నెఱిచూపటు నిలువనందు నీఱు గఁదరువుం
జుఱుపుచ్చి పిడుగు క్రియఁ గను। గిఱపినయంతటనె గెడపెఁ గిల్బిషుఁబగతున్॥

చుఱచుఱ = అనుకరణవిశేషము.

“ పెఱచఱచుట ” అను శబ్దోదాహరణముం జూడవలయును.

చెఱమలు = నాసాపార్శ్వములు.

“ ఆఱిమఱి ” అను శబ్దోదాహరణమునం జూడవలయును.

చెఱిసగము = సమభాగము.

చెఱసాల చెఱకులు చెఱిసగంబు॥ అప్పకవి॥

ద్విపదము॥ తఱమి యొక్కుమ్మడి దారుని గ్రధునిఁ
చెఱిమూఁట సాయకాసీతినంగదుని॥ రం-రామా॥

చెఱకు = ఇక్షువు.

క॥ విఱుతునా మ్రింగుదునో తలఁ। దఱుగుదునో యేను జ్వరుఁడఁ దాన్నుంజ్వరుఁడా
కఱకంఠు నేయవిల్లగుఁ। జెఱకుం జెఱకైన వంటచెఱుకుం జెఱకే॥ సో-హ॥

# తృతీయాశ్వాసము.

చెఱలాడుట = భ్రమించుట.

సీ॥ చెఱలాట చెఱుపట చెఱుపుట రాచుట॥ అప్పకవి॥

చెఱువు = తటాకము, సత్రము.

క॥ చెఱువు నడుమ బసిననుబెను। వెఱ మృగములు చెదరిననువివేకనిధీ యు
క్కఱిబహుళసైన్యమఱిమఱిఁ। బఱచిన నాఁగంగరాదు బలియురకైనన్॥ భా॥
చెఱువున భుజియించి చెఱకుఁబట్టి॥ అప్పకవీయము॥

చెఱచుట = రాచుట.

"చెఱలాడు" అనుశబ్దోదాహరణమునం జూడఁదగు.

చెఱుచుట = పాడుసేయుట.

గీ॥ చేయుచున్న దితిజనాయకుఁడత్రిభీతి। నెఱిఁగి వానితపముఁ జెఱుపఁబంపె
జలజనయనఁ దరుణిజలపదయసి యెదు। దాని వదియువచ్చె వానికడకు॥ భా॥

చెఱ = కారాగృహము, స్త్రీలబలాత్కారముగాఁ బట్టుట.

క॥ నఱుకుట యర్థముఁ గొనుటయుఁ। జెఱ నునుచుట కట్టియడచి చేట్పాటొందం
బఱచుట మొదలుగఁగల పలు। చెఱఁగులఁ దగవు మెఋనడపు ధీరప్రచారా॥ భా॥

చ॥ ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరించిన వానికైకదా
చెఱగొని వచ్చితిం బిదపసేఁత వృథాకథ లింక నేల కిం
పఱ బ్రతుకింత తీయనె ఖరాదుల చావున కేమి చింత నీ
మఱఁదలి బన్నమేకరణి మానిని యీఁగుము సంధిచేసినన్॥ రామా॥

చోఱ = మత్స్యవిశేషము.

చ॥ మఱియు విచిత్ర వల్గన సమక్రియ ఘోటకమబ్ధిఁ జెం
జోఱవఱియంగఁ జొచ్చు గతిఁ జొప్పడ వానరసేనఁ జొచ్చి॥ రామా॥

(ఇది చొఱ్ఱమను పదమునకు ద్విత్వలోపమై పుట్టినది గావున గురుత్వము నిర్వివాదమే. అయినను స్పష్టార్థమునకుఁగాఁ బైయుదాహరణమును వ్రాసినారము.)

మూలము.

సీ॥ తఱగరి తఱుగుట తఱిగొనె తఱియుట తఱియఁజొచ్చుట తఱి తఱిపి తఱిమె
తిఱితిప్పెటతఱిగలి తుఱుసంటితనమును తఱఁగలించుటయును తుఱుముటయును,
తెఱువ తెఱపియె డెఱ తెఱఁగు తెఱవ తెఱమట తెఱగొప్పెతెఱలెత్తఁ గె
చిందఱనందఱమద్దఱా నఱుకుట నఱుము సేయుటయును నఱుకుటయును

నఱుజొనిఱు పేదనుఱు పుటనుఱు మనెఱులు। నెఱికనెఱకులు నెఱసరి నెఱవు నెఱయు
నెఱతనము జానకీరమణీపదాబ్జ। నిత్యవిన్యాసధన్యాంక నిహతపంక॥

ఈ పద్యమునందలి శబ్దములకర్థోదాహరణములు వ్రాయఁబడు.

తఱగరి=బేహారి.

సీ॥ జట్టికాఁడనఁగనుజను క్రేతతఱగరియనఁగనుదత్సహాయాఖ్యవెలయు॥ ఆం-భా॥
సీ॥ తఱగరిబేహారితఱుగని సంపద॥ అప్పకవీయము॥

తఱుగుట=కోయుట: తక్కువయగుట.

క॥ వెఱఁగుపడికుంభభవుఁడుం। బెఱరథికులుసూచుచుండవీరములావుఱ్ఱ
మెఱయఁజలము నెఱయఁగఁదలఁ। దఱిగెదసైంధవుని వేలతలఁకెదుకృష్ణా॥ భా॥

క॥ మఱిరామేశక్షేత్రము। కఱకంఠునకాటపట్టు కామితఫలముల్
తఱుగనిధాన్యము లెల్లను। నెఱయఁగఫలియించునచటనిత్తయుఁగలుగ౯॥ భీ-ఖం॥

తఱిగొనుట=ఉద్యోగించుట.

“ కొఱ ” అను శబ్దోదాహరణముంజూడఁదగును.

దీనివలనఁ దఱిగొల్పుటయును గ్రహింపఁబడును. అనఁగా నుద్యోగింపఁజేయుట

తఱియుట=ప్రవేశించుట, చొచ్చుట.

గీ॥ అందుఁబ్రథమముఖ్యులందఱుఁ గ్రందుగాఁ। దఱిసితమయనుంగుఁదెఱవపిండుఁ
గూర్చికొనిమనోజకోలాహలస్ఫూర్తి। యలరనందునోలలాడుచుండ॥ ఎ-హ॥

తఱియఁజొచ్చుట=లోపలికిలెస్సఁజొచ్చుట.

గీ॥ అరసికొనియెన్నిభంగులనైనసితని। తేరుమనచారికగపడు తెరువుగాంచి
యడరిబాసటయైయెవ్వరడ్డపడిన। మెఱుఁగుమెఱసినచాడ్పునఁదఱియఁజొరుము॥

తఱి=సమయము.

“ చిచ్చఱ ” అనుశబ్దోదాహరణమునంజూడవలయు.

తఱిపి=మదురు

సీ॥ సీఱికైయేటిలోనికిడిగ్గఁగాఁబెద్దతఱిపిపెయ్యలఁబట్టనుఱికెనేఁడు॥ ఎ-హ॥

తఱుముట=పాఱఁగొట్టుట.

క॥ పెఱవారినెల్లఁదఱిమితి। నఱుకుడుపాండుక్షితీశనందసులను జూ
పఱనేయఁ జేతులాడవు। తఱుమరునామీఁదనత్యుగ్రతనారుఱ్ఱ॥ భా॥

తిటిపెట్టుట—మఱదగలుగుటచేఁ జెవిలోవత్తియిట్టిత్రిప్పుట.

సీ॥ తిఱుగరెండవసారి తిటిఁజెనచుట॥ అప్పకవి॥

తుఱగలి—విఱుగుడుపాటు.

చ॥ వెఱువకుమీ కుమార పదివేలవిధంబులనైననిన్ను నే
మఱువ మపేడకుంజనుటమాని సుఖంబున దక్షవాటికిం
దుఱగలిలేకసమ్మదముతో గమనించుము భీమనాయకుం
డఱగొఱలేనివేల్పునిఖిలాభ్యుదయంబులు నీకునయ్యెడిన్॥ భీ-ఖం॥

తుఱుసంటితనము—ఔద్ధత్యము.

గీ॥ ఎల్లవారునెఱుఁగనొల్లనిధర్మంబు। లెల్లనీకునేల నెఱుఁగవలసెఁ
జిఱుతవానికింత తుఱుసంటితనములు। సన్నవృద్ధజనములున్నచోట॥ భా॥

ఈ శబ్దము ధర్మియగునపుడు "తుఱసలి" అనిరూపము. ఇది యాపవిభక్తికములలోనిది కావున "ంటి" వచ్చినది.

తుఱఁగలించుట—భ్రమించుట, ప్రకాశించుట.

గీ॥ అవనిగంపింపలలితపీతాంబరంబు। చెఱఁగుజాలఁజక్రాంశులుదుఱఁగలింప
సింహనాదంబుక్రోధరంజితభయంక। రాననంబునఁజెలఁగంగనడరెఁబెలుచ॥ భా॥

తుఱుముట—అలంకరించుట.

గీ॥ నెఱులుఁదడియార్చిక్రొవ్విరుల్దుఱిమిమేనఁ। గలపమునలందితొడవులంగములబూని
కల్పవృక్షదుకూలాంశుకములుగట్టి। రంగవలుమారునారతోడియలుఁగులనఁగ॥

తెఱకువ—తెలివి.

సీ॥ తెఱవలు తెఱకువ తెఱఁగువిధము॥ అప్పకవి॥

తెఱపి—బయలు.

క॥ తెఱపిగొనినీవుచొచ్చినఁ। బిఱుదనఁజొచ్చెదము రిపులుపెల్లగిలఁగనం
దఱమును మాకిదియెంతయు। నుఱునట్టివరంబుదీనినానఁగుమాపుత్రా॥ భా

ఏడ్తెఱ—వేగము, ఉత్సాహము.

క॥ పఱతెంచి మదంబున నే। డ్తెఱవృత్తుంజెత్తి త్రేయ డెప్పటికమునన్
గొఱషంధివోయివేలకు। నొఱగినసింగంపుఁ గొదమయొప్పమరంగన్॥ తి.ఉ.రా.

తెఱఁగు — విధము, సందర్భము, క్రమము.

"కొఱవి" అను శబ్దోదాహరణముం జూడవలయును.

ద్విపదము॥ మఱి రాముఁడున్నట్టి మార్గంబుఁ దెలిపి
తెఱఁగొప్పనమ్ముని దీవింప వెడలి　　రంగనాథరా॥

తెఱవ — స్త్రీ; బయలు-

సీ॥ తెఱవనా బయలును స్త్రీదనర్చు॥　　ఆంధ్రభాషార్ణవము-

క॥ తెఱవ యొడఁబాటు మాటం। బఱివోయిన కొంకుతో టిబ్రాహ్మణి గొనిక
న్యలు నగు పడకు నరిగిన। త్రుటి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా॥　　భా॥

చ॥ మఱియును బైపఱుంబఱపు మార్గణవర్గము లంబరంబునన్
గిఱికొను చుం బ్రచండగతిఁ గీలలు వాఱఁగ వచ్చి వృక్షముల్
దెఱవలు సేయుచున్ మెడలు ద్రెంచుచుఁ బొట్టు ఱుసించుచుం దొడల్
విఱుచుచు మస్తకంబులు దళించుచు నిట్లు వధింపఁ జొచ్చినన్॥　　రామాయణము॥

తెఱపట — వివృతము గావించుట-

గీ॥ నీవు ముయ్యంగఁ దిమిరంబు నిఖిలలోక। చయము గప్పిన భూతముల్ భయమునొందె
నీకరంబులు ద్రోవక చీఁకటియును। జెఱుచుటకు ఫాలనేత్రంబు దెఱువవలసె॥　　భా॥

తెఱకొల్పుట — బయలుపఱచుట-

తెఱలుట — బయలుదేఱుట-

సీ॥ తెఱలిన వాసన తెఱకొలుపుట॥　　అప్పకవి-

తొఱఁగుట — విడుచుట-

"కఱవు" అను శబ్దోదాహరణమునందుఁ జూడవలయు- ఇది క్షరణార్థకమగు నపుడు ద్విరూపము.

గీ॥ వానిఁ దెగఁ జూడవైతేని వాయుపుత్త్ర। నీవు కనుఁగొన నురినైన నీళ్ళనైన
నగ్నినైన విషంబుననైన నేను। మేనుఁ దొఱఁగుదు నెట్లు నీయాన సుమ్ము॥

చిందఱవందఱ — చెదఱిపోవుట-

క॥ వెఱవకుఁడు వెఱవకుఁడు సేం। దఱవందఱ గాకుఁ డేల ధైర్యముఁ దూలన్
మఱచితిరె కులముఁ గీర్తియుఁ। బిఱుకులగతి నింతవలదు బీరము సెదరన్॥　　సో-హా॥

ముందఱ = పురోభాగము, పూర్వము.

చ॥ చిఱుతదనంబునం దగవుఁజిత్తమునందలపోయలేకముం
దఱనటువోవనిచ్చితిఁబితామహుఁడుంజనకుండు నింకఁ గ్ర
చ్చఱనిలపంచి చక్కసగమక్కడ నెవ్వరికేనిమద్బలం
బెఱుఁగక యాఁ దలంచినను నేనది యేటికి సమ్మతించెదన్॥ భా॥

ఆద్దిఱ = ఆశ్చర్యవాచకము.

సీ॥ ముందఱ యద్దిఱ కట్టెదుఱను॥ అప్పకవి॥

నఱుకుట = క్షతముగావించుట, ఖండించుట.

"తఱుముట" అను శబ్దోదాహరణమునం జూడఁదగును.

నఱుము సేయుట = చూర్ణము సేయుట.

చ॥ అఱిముఱిఁ ద్రెళ్ళెఁ దేరులు గజావళి గూలెఁ దురంగమాంగముల్
గిఱికొనియెన్మహీస్భటులు లెక్కకుమిక్కిలి సేనపాడుగా
నఱుమయిరప్డుకృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం
దఱచుగ నార్తి నిర్మథిత దానవసైన్యము పాంచజన్యమున్॥ భా॥

నఱుజు = సూక్ష్మము.

సీ॥ రఱుజుకొంచెము బ్రామాను నఱుకుట. అప్పకవీయము.

నిఱుపేద = అతిదరిద్రుఁడు.

క॥ నిఱుపేదయింటికేటికిఁ। బఱతెంచునిధానమట్లు బఱతెంచిన యా॥ శృంగారనైష.

(ఇది యజాదిశబ్దమని (ఇఱుపేద) కొందఱనుచున్నారు. ఇఱు = అనఁగా నన్న వస్త్రములు రెంటికి దరిద్రుఁడని యర్థమఁట. అట్లైన నప్పుడీపదము లఘువగును గాని గురువుగాదు, విశేషించి యప్పకవియీపదము హలాది పదములలోనిట్లు 'సీ॥ నఱుజుకొంచెము బ్రామానునఱుకుట నిఱుపేద నుఱుముగా నుఱుపుట నెఱవుబోదవు' అని వ్రాసియున్నాఁడు. కావున 'సీ॥ ఘనమైన రారాపు చనుదోయి రాయిడి నిఱుపేద నడిమికి వెఱవుఁ జూప' ననునిత్యాది స్థలములయందయ్యర్థము సమన్వయముగాదు గదా. మొదటివ్యుత్పత్తి విచార్యమైయున్నది.)

నుఱుపుట = మర్దించుట.

సీ॥ నుఱిపెనొత్తురు తేరులువఱపిభీమ। సేనమాయున్నబలునినే లేనిచోట భా॥

నుఱుము — చూర్ణము.

క॥ మఱి దైత్యులుగ్రచ్ఛుఱఁజన। మఱలిచనుచు దాశకంఠి మదమునఁగవ్రులన్
నుఱుమాడఁజొచ్చెఁగూపుల। నెఱయ నదృశ్యత్వమొంది నిష్ఠురలీలన్॥ రా-మా॥

నెఱులు — కేశములు.

సీ॥ నెఱులనున్న నికప్పుతుఱఁగలిగొనగూడిపాదలువెండ్రుకలుకొప్పునకునంద॥ ఎ-హ॥

నెఱిక — కచ్ఛభేదము.

సీ॥ అనమీఱుఁగచ్ఛభేదాభిధానమెసంగుఁ గాసెఁగుచ్చెలకుచ్చెకచ్చెపింజ
చుంగు ఱింగు నెఱిక ఱింగు నెఱియనంగ॥ ఆంధ్రభాషార్ణవము॥

నెఱికయనఁగా "గాఁగరా" అని కొందఱందురు.

సీ॥ * * నెఱయుటనిండుట నెఱికకాసె॥ అప్పకవీయము.

నెఱకులు — శల్యములు.

సీ॥ * * నెఱ కెమ్ముకయన నెగడు నస్థ్యభిధానము॥ ఆం-భా-

సీ॥ * * నెఱకు లాయంబులు॥ అప్పకవి-

క॥ ఆఱువది యఱువది యమ్ముల। నెఱకులు నోనాటనేసి నిలిపి తనరయుం
బెఱిఁగించెమువ్వురకు న। త్తెఱఁగద్భుతరసము వెల్లిఁదేల్చెజనములన్॥ భా॥

నెఱసరి — సింహభేదము.

క॥ చఱి నుండి తొలఁగ నుఱికెడు। నెఱసరి సింగంపుఁగొదమ నిబ్బరమునఁగ్రే
ళ్లుఱికెందొలఁగఁగఁబగతుని। యఱకటనుండిభువిమీఁదనబ్బలియుండున్॥ ఎ-హ॥

గీ॥ సింహపూర్ణోపమానముమువ్లెలఁగుసు నెఱ। సరియటంచునుబల్కు-డఁజంద్రచూడ॥

అని యాంధ్రభాషార్ణవములో 'నెఱసరి' శబ్దమునకు సింహసామాన్యమని
చెప్పినాఁడుగాని పై యుదాహరణమువలనఁ దద్విశేషమని తోఁచుచున్నది.

నెఱవు — విశాలము, దీర్ఘము.

క॥ మఱిమఱి చీఁకటిలో నం। దఱు రాజులు సమరమఁడిగి తగనెల్లిటికిన్
గొఱకలకలనగునదువుడు; నెఱవగుగోవర్ధనాద్రి నేలకునను చున్॥ సో-హ॥

మ॥ నెఱవైయొప్పువిసీలకేశములు నిర్నిద్రాననాబ్జంబు నే
త్తెఱ నూత్నాంబుదతుల్యకాంతియును నై దివ్యప్రభావంబునన్॥ ఎ-హ॥

నెఱి—నిగ్గు, కుటిలము-

చ॥ నెఱిఁగుఱులున్విలోలసిత నేత్రయుగంబును దేనెలొల్కు వా
తెఱయును దీనియాననము తెల్విగరంబుమనోహరంబు నే
నెఱిఁగినయంతనుండి నతినిట్టి లతా లలితాంగిఁజూచి యే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాససంపదన్॥ భా॥

పై యుదాహరణములలో నీశబ్దమచ్చటచ్చట గలదుగావున నర్థభేదము విచారింపవలయును.

నెఱతనము—శ్రేష్ఠత్వము, పూర్ణత్వము, చతురత్వము-

సీ॥ నెఱచందురుని నిగ్గువఱపంగఁ జాలు నీనెమ్మోముతాలిమివమ్ముసేసె॥ భా॥

చ॥ మఱియు నతండు సంయమిసమాజ వినిర్మితజాతకర్ముఁడై
నెఱిఁబరివర్ధితుండు నుపనీతుఁడునై వివిధాయుధంబులన్
దఱగరియై రణస్థితులగద్దఱియై నిగమాంతవేదియై
నెఱతనకాఁడునై మెఱసె నిర్మలకాంతివిలాసశేఖరన్॥ మను॥

ఇందుఁ గఱకరియనఁగాఁగఱుఁగలవాఁడని యర్థము.

మూలము.

సీ॥ పఱియలుపఱువు చూపఱు పఱతెంచె తొప్పఱవెట్టెపఱివోయె పఱగొనుటయు
పఱపఱియలు పఱపఱియంపఱ పఱంటిపఱికెలు పఱిగలు పఱటిపఱచు
పిఱుఁదతెప్పిఱుటయు పిఱుఁదులుపిఱువోను పెఱికలు పెఱికెదబ్బఱలఱుకుట
బఱబఱబిఱబిఱబిఱుసులు బుఱుజులు మఱగాలుమఱుకువమఱువు మఱఁది
మఱవక్రమ్మఱమఱఁదలేమఱుటమఱేఁగె।మఱుసటిదినంబుమఱుపడెమఱిపెడమఱ
మఱుఁగుమఱునాఁడు పడమఱ మత్తదనుజ।మథితవిబుధకృపాదృతమనుజరూప॥

ఈ పద్యమందలి పదములకర్థోదాహరణంబులు దెలుపఁబడును.

పఱియలు—శకలములు.

గీ॥ పఱియవాపంగఁదునియగా విఱువవలయు। నెడలగాళ్ళను జేతులఁదొడలఁ బెట్టి
కడఁగియనువుగఁజేసి ప్రోవిడుదుగాని। కత్తిగొడ్డలియడుగ నేకట్టియలకు॥ భా॥
(ఇవి పఱ్ఱియనుశబ్దమునకు ద్విత్వలోపమై యిట్టిరూపముంబొందినది.)

పఱపు = శయ్య.

క॥ వెఱువకుఁ గలభోఁజేసిన। కొఱగామికి వగచుచోట గుణరత్నము చే
కుఱె నీకునలిగితన్నిన। పఱపుపయింబడినయట్లు పద్మదళాక్షా॥ సో.హా॥

చూపఱులు = చూచువారలు.

"కొఱవి" అనుశబ్దోదాహరణముంజూడవలయును. (పుట-౭౭)

పఱెంచుట = మీఁదికివచ్చుట.

"ఉక్కఱి" శబ్దముంజూడవలయును. (పుట-౬౫)

తొప్పఱవెట్టుట = తట్టువిఱుగఁజేయుట.

సీ॥ తొప్పఱిలఁబండెనాఁగనుదోఁచుతట్టు। విఱుగఁబండెననుటకు ఆం-భా-గ్ర॥

మ॥ వెఱనిట్లంబుధినాథనందనులు దోర్వీర్యంబు సారించి యుం
దఱువాఱంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్వెన్నడిం
దఱుమంగాఁ బ్రజనేయువీఁచుచు సముద్యద్భంగిమైఁదోలి తొ
ప్పఱవెట్టెన్ శరజాలముల్వఱపి దుష్పంగూఱ నాటించుచున్॥ శి.ఉ.రా॥

పఱినోవుట = చెడిపోవుట.

"తెఱవ" అనుశబ్దోదాహరణముంజూడవలయును. (పుట-౭౭)

పఱిగొనుట = ఆక్రమించుట, చెడఁజేయుట

క॥ వెఱిమీఱబండె పట్టిన। నఱిముఱిఁజంపినను గజమునశ్వము మచ్చెం
పఱిగొనినయట్టివారల। గొఱులంగీకరించుటొప్పఁగువలయపతికిన్॥ స్మృతి॥

పఱ పఱియలు }
పఱపఱె } చిందఱ వందఱ.

క॥ పఱపిరథికులను సూతుల్। నఱికిన మోదుపడియుండె నానారథముల్
వెఱచఱచిరి కురువీరులు। పఱపఱియైనబలంబు భయముంబొందెన్॥ భా॥

లయ॥ తఱిమికొనిరక్కసులవెఱచఱవఁబట్టుకొనిపఱపఱియలుగఁదలలు నఱిపి
యవలలీలన్॥ రా-మా॥

క॥ పఱిఁగిపిఱుసనిన దెసఁదై। కుఱుకుదు సాటవము గాకినోడిసినభంగిన్
వెఱచఱవఁబొడవృదుంబఱ। పఱిసేయుదు నీదుకోర్కె పారంబొందన్॥ భా॥

అంపఱ — బాణసమూహము.

క॥ ✻ ✻ అం। పఱతెఱచుకోపకెంతయు। వెఱబొందివిపక్షులెరివిమయాధీశుల్

పఱుఁగు — శీఘ్రగమనము.

గీ॥ కంపతోడుగిడ్చినట్లొంటిగానిజన్న। తెఱవుగనివెంటనొకడేగపఱుఁగుతోన॥ మను

పఱకెలు — పక్షివిశేషములు.

సీ॥ పఱకెలు పఱియలు పఱివోవు టంపఱ॥ అప్పకవి॥

పఱిగలు — ధాన్యాదుల సూర్చుతావు.

చ॥ ఎఱుఁగరుగాక లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా
నొఱపగు నాశ్రమంబున సమున్నతమైన గృహస్థధర్మముం
బఱకటమైచి గోఁచుఁగొని పాటినపొల్లకముత్తిగల్గునే
పఱిగలనేఱినం గొలుచుపాఁతటికింగలదే తలంపఁగన్॥ సో-హ॥

పఱటి — కుంభము.

ఏఱగడుమత్తిల్లి పఱటిపుట్టువు గ్రుక్కఁగొనినయప్పుడుగలకుతిలపాటు॥ య-చ॥

పఱచుట — చేయుట, ధావనముసేయుట.

భంగపఱచె; ఏర్పఱచె, వీల్పఱచె, కీడ్పఱచె, ఇత్యాదులు.

గీ॥ అనదనైతినకట యాలికయ్యాలింపు। దకటమీరుగలుగనాక్రమించి
నన్నుఁబట్టిసూతనందసులిమ్మెయి। వెఱపులేక భంగపఱచువారె॥ భా॥

ఇదియొకానొకచోటఁ బొందించుటయనిగూఢ నర్థమగుచున్నది.

మ॥ పఱచుందవ్వగఁజేయలంతినిలుచుంబట్టికయాసాసగాఁ
బిఱువోవుంబాదలందు ... ... ... ... భా॥

ఇచ్చటఁబఱచుననఁగా దూరముగా ధావనముసేయుననుట. ధావనార్థకమగు పఱచుటకు సకర్మకరూపము పఱపుట.

చ॥ మఱియొకఁడేను జెప్పెద నమానుషవిక్రమలీలనల్గడం
బఱపియుఁ జాపియుగ్రిపునృపాలకసైన్యము రూపడంచి మేన్
దాఁటఁగుటయొప్పదే తనువుతూఁటులుగా నెఱవాదిగెల్పుకో
లుఱువొనానాదుసెంపుదుప నోపుదురే మిముబోటులెమ్మెయిన్॥ భా॥

ఇందు నల్గడఁబఱపి యనఁగా నాల్గుదిక్కులకుఁ బాఱునట్లుచేసియనుట.

చ॥ ※ ※ విష్ణుఁ। బఱపెద విష్ణులోకములు భస్మము సేసెద

ఈ శబ్దము ప్రవహానార్థకమగునపుడు ద్విరూపమని యెఱుఁగవలయును-

చ॥ పఱచిన దేవకీసుతుఁడు పక్కననవ్వినఁ గ్రమ్మఱెల్లిపైఁ
దఱుచుగ గోమహర్షణ మొదంచితభక్తిభరాకులత్వ మే
ర్పఱచుచుఁ గేల్మొగిడ్చి బహుపల్కుల తళ్కుల సన్నవెన్నెలం
బఱపుచుఁ బ్రస్తుతించె మునిబంధ విభుంబును భక్తరంజనున్॥ పాండు॥

పిఱుఁద — వెనుకను-

తెఱపి యను శబ్దోదాహరణమునంగనందగును- (పుట.౨౬.)

తెప్పిఱుట — తేఱుట-

క॥ పెఱికితి నలుగులు మేనులు। నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నిమిరితి హరులి
త్తఱి నీళులు ద్రావక తె। ప్పిఱవెల్లెఁ గా శత్రుసైన్యభీషణమూర్తీ। భా॥

పిఱుఁదు — నితంబము-

సీ॥ కనకమేఖలఁ గ్రుచ్చి కట్టి నెవ్వఁడు లీలఁ బిఱుఁదుపైఁ బూపార్కు మెఱుఁ గుఁబండ్లు॥

ఈ పద్యము కాశీఖండములోనిది- దీనిని తిమ్మకవి 'చెఱఁగునఁ బూపార్కు మె
ఱుఁగుఁబండ్లు' అని వ్రాసిన పాఠము వివేకులకు నంగీకారము కాదు-

పిఱువోవుట — వెనుకకుఁ బోవుట-

మ॥ పఱచుం దవ్వగఁ జేయలంతి నిలుచుం బట్టీక నాసాసగాఁ
బిఱువోవుం బోదలంబడిందుఁ బోడముం బిట్టులిక్కు వేదాఁటుఁ గ్ర
మ్మఱిచూచుం జెలిదార్చి నిల్చు మలయున్మట్టాడుఁ గోరాడు నే
మఱినట్లుండుఁ దృణంబుఁ బూను సెలయున్మాయామృగంబిమ్మలన్॥ భా॥

పెఱికలు — గోనెలు-

చ॥ మఱియును సన్నిధిం గలసమంచిత కాంచనరాశిబండ్లనుం
బెఱికలమోపులుం గొలఁది పెట్టఁగఁ జెక్కగు బారువుల్ జనుల్
వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికిన్
వెఱపొనరించు వార్త పృథివింబరఁ గన్నడపించె భూవరా॥ భా॥

పెఱుకుట — పెల్లగించుట-

"తెప్పిఱుట" అను శబ్దోదాహరణమునం జూడవలయును-

దబ్బఱ — అనృతము-

క॥ నెఱయంగా నీఛందము। తెఱఁగెఱుఁగక కవితఁజెప్పఁదివురునతఁడు ద
బ్బఱఁజేఁకుఁజేఁకుగుఱ్ఱముఁ। బఱపినగతి నిఖిలహాస్యపదనిరతుఁడగుఁజా॥ ఛే-ఛం॥

బెఱుకుట — నెత్తురువచ్చినట్లుగోఁకుట-

సీ॥ ఊఱకదశకంఠుఁతలలప్పైనుఱికియాడు। బెఱుకుమీసలుకఱకుఁగాబఱకుగోళ్లు॥ రా॥

బఱబఱ — అనుకరణధ్వని-

సీ॥ బఱబఱనీడ్చె దబ్బఱఁబలుకుకూట॥ అప్పకవి॥

బిఱబిఱ — శీఘ్రము, బిఱుసులు — బాణసంచు-

బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు గాల్చుట॥ అప్పకవి॥

(బిఱుసులనఁగా నగ్నిబాణములు- ఇందులకుఁ బ్రయోగము-)

సీ॥ తగిలింపఁజిఱ్ఱున నెగయు నాకాశబాణంబులంబరవిమానములు దాఁట
మెఱుసుగా వెడలెడి బిఱుసులపువ్వులుఘనభోంతరములఁబొదివికాసఁగ॥ దశా॥

బుఱుజులు — కోటగోడమీఁద నాల్గువైపులను గట్టునిండ్లు-

బిఱబిఱఁ ద్రిప్పుట బిఱుసులు- అప్పకవి॥

సీ॥ బుఱుజులు మఱవమృద్భాండంబు మఱుఁగుచాటు॥ అప్పకవి॥

మఱగాలు — పొడుగుగాఁగనఁబడుటకుఁ గాలికిఁగట్టుకొను కొయ్యకాలు-

సీ॥ ❋ ❋ పడమఱమఱగాలు పెడమఱలుట॥ అప్పకవి॥

దీనివలన 'మఱకాఁడు' అనుపదము గ్రహింపఁబడును.

మఱకువ, మఱపు — విస్మృతి-

'ఎఱుకు' అను పదోదాహరణముంజూడవలయును-

క॥ మఱచితిఁగాకలతాంగీ। కఱకంఠుని తోడనాఁడు కాత్యాయని ని
న్నెఱిఁగెఱిఁగినాఁడుసెప్పిన। తెఱఁగిదిసమకూడె నింకదిగులేమిటికే॥ సో-హ॥

మఱఁది — పెనిమిటితమ్ముఁడు, అప్పపెనిమిటి-

చ॥ మఱఁదులలోనవెన్నఁగలమాన్యుఁడవావనదుండకోర్విబ
ద్దెఱఁగులఁబర్ణశాలలను దివ్యనిబంధులు గూర్చిపెట్టుటల్

మఱచినదానవే యకట లక్ష్మణ యీయపకీర్తిపాలికిం
బిఱుకలుగాని భానుజ విభీషణులుండఁగ నీకు స్వర్గమే॥ జై-భా॥

మఱవ — కుండ.

సీ॥ మఱవ మృద్భాండంబుమఱుఁగుచాటు॥ అప్పకవి॥

క్రమ్మఱ — పునరర్థకము.

క॥ మఱొకఁడు సేసినపాపము। మఱొకఁడుదాఁ బుచ్చుకొను సమర్థుఁడగునె క్ర।
మ్మఱఁదన కెఱుఁగవలయును।మఱలదు వెను వెంటవచ్చుమానుపనగునే॥ రా॥మా॥

మఱఁదలు — భార్యచెల్లెలు; తమ్మునిభార్య.

‘చెఱ’ అను శబ్దోదాహరణముంజూడవలయును. (పుట- ౭౮)

ఏమఱుట — పరాకుగనుండుట.

‘పిఱువోవుట’ అను శబ్దోదాహరణముంజూడవలయును.

మఱుఁగుట — తపించుట.

క॥ అఱువదివేలబ్దంబులు। నెఱయఁగమనుసుతులుగనని నెవ్వగ చేతన్
మఱుఁగుచుఁజరమేనం గ్రి। క్కిఱియఁగఁగఁటదప్పిసుతులనెట్లోకంటిన్॥ రా-మా॥

మఱునటిదినము — పరదినము.

‘ఎచ్చిఱుట’ అను శబ్దోదాహరణమునంజూడందగును.

మఱుపడుట — మాఱుపడుట.

దీనివలెనే మఱుమాట మఱునాఁడు మొదలైనవి చూడవలయును. మఱునాఁడను శబ్దమునకు వ్రాయఁబడు నుదాహరణము వలననే దీనికింజరితార్థత్వమని తెలియవలయు. స్పష్టార్థము చెప్పఁబడియెను. అయిన “మఱుపడె- క్రమ్మఱ” అని యప్పకవి.

మఱి — పునరర్థకము.

“క్రమ్మఱ” అను శబ్దోదాహరణముంజూడవలయును.

పెడమఱ — ఒకపార్శ్వము,

“ఏడ్తెఱ” అను శబ్దోదాహరణముంజూడవలయును.

మఱుఁగు — చాటు.

సీ॥ అనుజంజూచికష్టమనుజులఁగూడినా। పనుపు సేయకుండఁ జను సైన్యకు
నను చునదరి పలుకా నాహిడింబయుఁగడు। వెఱచిభీమసేను మఱుఁగుసొచ్చె॥ భా॥

కవచహాచకమగు కవచమగు మైమఱువు దీనివలననె వ్యాఖ్యాతము. 'క్వచిద్గకారోవః' ఇత్యాదిసూత్రముచేత నిదియే మైమఱువవుచున్నది.

మఱునాఁడు=పరదినము

'చఱి' అను శబ్దోదాహరణమునంజూడవలయును. [పుట-౨౨]

పడమఱ=పశ్చిమము.

'పఱగాలు' అను శబ్దోదాహరణముంజూడవలయును.

మూలము.

క॥ మిఱిచూపులు మిఱుమిట్లుఱి। మాఱియును మఱిమఱియును మఱు మొండెము మెఱుపుల్
మెఱసె మెఱుఁగు మెఱము మొఱక। మొఱవో వుటు మొఱఁగె మొఱిగెఁ మొఱ మొఱ కృష్ణా

ఇందలిపదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

మిఱిచూపు=ఊర్ధ్వదృష్టి.

సీ॥ మిఱిచూపు మిఱిమిట్లు॥ అప్పకవి॥

మిఱిమిట్లు=కన్నులచీఁకట్లుగ్రమ్మటు,

సీ॥ మిఱిమిట్లుగొని చూడ్కి-వెలిగి పరిభ్రాంతిజేసెఁ గిరీటుకాంతి॥ భా॥

అఱిముఱి=సంభ్రమము.

ప॥ ఐహనుమంతుఁడెడఁదఱిమి బలుమొత్తముల కుఱికియఱదం
బులఱిముఱిధరణిద్రెళ్ళక॥ రా॥

ముఱిముఱి=కొంచెము.

"నెఱవు" అనుశబ్దోదాహరణముంజూడవలయును.

మఱుమొండెము=అవయవహీనకబంధము.

క॥ మఱియూరఘువీరులు నీ। మఱుమొండెము వేగదగ్ధముగఁ బెఱుఁగఁజే
కుఱునీకుఁబూర్వకాయం। బుఱువగుశాపమునకవధియునప్పుడగుఁక॥ రా-మా॥

మెఱుపులు=మించులు, కాంతులు.

క॥ మెఱుపుధనుర్దండముగుణ। మఱుము విశిఖవృష్టిదొరఁగనొక్కటతఱుచై
పఱచెరుధిరంపుఁగాలువ। లఱిముఱిఘనభుజుఁడుద్రోణుఁడదర నరేంద్రా॥ భా॥

మెఱయుట = ప్రకాశించుట.

ఇది పూర్వోక్తోదాహరణములలో ననేక స్థలములలోఁ గలదు.

మెఱుఁగు = తటిత్తు, తళుకు, దీప్తి.

గీ॥ మెఱుఁగు మొగులు సొచ్చు తెఱఁగున నాట్యమం। దిరము చొచ్చి తనదు గురువు కడకు
నరిగి నెమ్మి నిట్టులను నింతి ప్రార్థనా। వినయ సంభ్రమములు పెనఁగొనంగ॥

క॥ మఱియును నాక్క విశేషం। బెఱిఁగించెద నతని యున్న యెడ గోధనముల్
మెఱుఁగెక్కి పాడి సేమియుఁ। గొఱఁత పడక యుండఁ జేఁపి కురియుచునుండున్॥

క॥ మెఱుఁగారు నారసంబులు। తఱుచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్॥ భా॥

మెఱము = లంఘనవిశేషము.

చ॥ పెఱుకుదుమింక లంక యని పేర్చి కపీంద్రులు దిక్కులార్పులం
బఱియలు సేయుచుం భ్రమరిపాఱుచు నుబ్బునఁ గ్రేళ్ళు దాఁటుచున్
మెఱములు వైచుచున్నగని మేఘములంటుచు నబ్ధిలోనఁ బె
ల్లుఱుకుచు నీఁదుచున్ మునిఁగి యొండెడఁ దేలుచుఁ గట్టుఁ జేరుచున్॥ రా. మా.॥

మొఱక = పెలితి. మొఱవోవుట = కుంఠితమగుట.

సీ॥ * * మొఱఁగుట డాఁగుట మొఱక పెలితి॥ అప్పకవి॥

పైశబ్దద్వయమేకార్థమే. ద్వితీయశబ్దమున క కారము లుప్తమగుటవలన శబ్దాంతర భ్రాంతి కలుగునని వ్రాయఁబడియె.

మొఱఁగుట = వంచించుట.

గీ॥ ఎన్ని విధములనైన నఱ్ఱుగుసుఁ బోఁడి। నాకుఁ జేరును పాయుంబు నీకు నెట్లు
పోలునట్లుగ నానరింపు భూపవరుల। మొఱఁగి మాతల నెంతయుఁ దెఱఁగువఱపు॥

మొఱుఁగుట = శునకధ్వని చేయుట.

సీ॥ * * మొఱుగుదు కుక్కలు మొఱకుఁదనము॥ అప్పకవి॥

మొఱ మొఱ = చూర్ణాదుల పరుసఁదనము.

సీ॥ * * మొఱలు వెట్టుట మొఱమొఱలుగా మొఱయుట॥ అప్పకవి

ఱ మూలము.

గీ॥ ఱంతు ఱంపము ఱంపిల్లె ఱంకు ఱంకె। ఱిట్టు ఱికయు ఱవ ఱవ ఱవ్వ ఱవలు

ఱివ్వనను ఱింగుననుఱిక్కలుప్పెఱెప్ప। ఱెమ్మఱెక్కలు ఱెల్లును ఱొమ్ము శ్రీశ॥

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును-

ఱంతు=దర్పవికారము-

ఉ॥ ఱంతులు మీఱ మిక్కిలి గఱాగతనంబున దొమ్మి చేసి॥ భీమఖం॥

ఱంపము=క్రకచము-

సీ॥ * * ఱవ ఱవల్ ఱంపము ఱంతు ఱవలి॥ అప్పకవి॥

ఱంపిల్లుట=ధ్వనిచేయుట-

(ఇది రంభ ధాతువువలనఁ బుట్టినది- తద్భవమని యహోబలపతి-)

గీ॥ మరునితండ్రి లోకమహితుండు యాదవ। రాజసింహమూర్తి రక్షకుండు
ఱాఁగవేలుపనఁగ ఱంపిల్లు నెక్కటి। మఘులనంగనిట్లు వనజనాభ॥ అ- ఛం॥

ఇది తద్భవమని యహోబలాచార్యుఁడు సెప్పినాఁడు, శ్లో॥ రంభస్త్ర్యగేమహాదే వేవ్యభిచారేధురంధరే' అని విశ్వమేదినీ నిఘంటువులలో నుండుటవలన నట్లని కానఁబడుచున్నది-

ఱంకు=వ్యభిచారము॰

సీ॥ * * ఱట్టు ఱంపిల్లుట ఱవ ఱంకు ఱవికలు అప్పకవి॥

ఱంకె=వృషభధ్వని-

ఉ॥ ఱంకెలు గర్జశైయదర ఱాఁగతనంబున నెందుఁ బేర్చుని
శ్శంక విలోలవైద్యుతకృశానుశిఖిన్ దిశ లెల్లఁ గప్పఁగా॥ ఎ-హ॥

ఱట్టు=పరివాదము-

సీ॥ గతిమాలి బిగియూరు కౌఁగిలి లేసియా ఱడికూర్మికే నేల ఱట్టువడితి॥ సో-హ॥

ఱవిక=కంచుకము॰

చ॥ ఱవికయుఁ బట్టుఁబుట్టము చెఱంగు మఱుంగున॥ నైషధ॥

ఇందలి చెఱంగుశబ్దము ద్విరూపమైనను శ్రీనాథుఁడు గురురేఫముగనే ప్రయోగించుటవలన నుదాహరింపఁబడియెను. సంశయమగునేని యప్పకవి ప్రయోగము చూడఁదగును.

ఱవఱవ — కోపవికారము.

"ఱంపము" అను శబ్దోదాహరణముఁ జూడఁదగును.

ఱవ్వ — అపవాదము.

గీ॥ కాఱబాలకృష్ణ రచ్చలఁగుమిగూడి । ఱాఁగయనుచు నిన్ను ఱవ్వఁబెట్టె॥　　అప్పకవి॥

ఱవలు — వజ్రశకలములు

"ఱంకు" అనుశబ్దోదాహరణమునం జూడఁదగును.

ఱివ్వన — ధ్వనివిశేషము.

సీ॥ * * ఱెక్కలువైచుటఱివ్వనఱువ్వుట॥　　అప్పకవి॥

ఱింగున — అనుకరణము.

ఉ॥ ఱింగున మ్రోఁత మ్రోయుచును ఱెక్కలపాములువోలె శౌరిచే
సింగిణివింటువెల్లిగొను చిత్రశరంబుల॥　　పారిజా॥

ఱెక్కలు — లొట్టలు, ఱువ్వుట — విసరివేయుట.

"ఱివ్వన" అను శబ్దోదాహరణముం జూడవలయును.

ఱెప్ప — పక్ష్మము.

ఉ॥ ఎప్పుడు నెయ్యెడం బొదివియుండఱికిందగ నీవు గంటికిన్
ఱెప్పయుఁ బోలె మాటయు నెఱింబను లారసి యొజ్జచాడ్పునన్॥　　భా॥

ఱెమ్మ — రేకు

సీ॥ * * ఱెక్క ఱెప్పలు ఱెల్లు ఱెమ్మ ఱొమ్ము॥　　అప్పకవి॥

ఱెక్కలు — పక్షములు.

గీ॥ ఱెక్కలుగలట్టి పెనుబాఁపఱేఁడువంటి । కఱకుటమ్ముల శంభునుక్కఱఁగఁజేసె॥

ఱెల్లు — తృణవిశేషము, ఱొమ్ము — వక్షము.

'ఱెమ్మ' అను శబ్దోదాహరణమునం జూడవలయును.

మూలము.

గీ॥ వఱుత వఱదయు వఱువట్టు వఱడు వఱలె । విఱిచె విఱివోటు విఱిగాలి విఱిగె వెఱపు
నివ్వెఱయు వెఱ బ్రాహ్మనిలయదర్క । మండలాగ్రభుజోద్దండమండలాగ్ర॥

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును.

మఱుత, మఱద = ప్రవాహము.

మ॥ నెఱయంబున్నమచందురుం జెనయునీ నెమ్మోము దాఁ దియ్యనై
చిఱునవ్వొప్పఁగఁ జూడనీకపులకల్ జెల్వొందనిన్ముట్టిచ్చియ
క్కఱదీఱన్ బోరినక్కు సంగరము నీకుం జేర్పనీ కెమ్మెయిన్
మఱుతం ద్రోవఁగఁ జేసెనే యకట దైవంబెందుఁ జొత్తున్నతా॥

లయ॥ నెఱిపితురగంబులకుఁ జుఱుకాడవ నెత్తుఱులు మఱదలయి పాఱఁగ పులుఱక
సమయింపన్॥ రామాయణము॥

మఱువట్లు = చాఱికలు.

ద్విపదము॥ దాహంబు పెంపున ధరియింపరాక
మఱువట్లుగట్టెడు వదనగహ్వరము
తెఱచి నిల్చుటయును త్తెరువునవచ్చి॥ రం. రా॥

మఱదు = ముసలినక్క.

క॥ మఱదులు మన చేరువఁ బొ। ల్లఱచుట బిట్టెసుగుగాలి యడరుట గ్రద్దల్
మఱుచుగ నాడుట వికృతవు। టఱవులతోఁ శేఁగి కాకు లడరుట కంటే॥ భా॥

మఱలుట = ప్రకాశించుట.

'నింకెఱ' అను శబ్దోదాహరణముం జూడవలయును.

విఱివోటు = ద్వేషము, విఱిగాలి = ఈఁదరగాలి

సీ॥ విఱివోటు విఱిగాలి విఱివిడికంబము ... ... ... అప్పకవి॥

విఱుగుట = చెదఱుట.

క॥ వెఱవార లధికభీతిన్। విఱిగిచనిరి భీష్ముఁ డేఁచి వీరరథికులం। దఱఁజూచి॥ భా॥

వెఱపు = భీతి.

'తొప్పఱవెట్టుట' చూడవలయు.

నివ్వెఱ = నిశ్చేష్ట.

'గుఱుతు' అను శబ్దోదాహరణముం జూడవలయును.

వెఱబొమ్మ = దృష్టిప్రతిమ.

ద్విపదము॥ మఱిమన్మథుని సూత్రమహిమ చేఁదిరుగు
వెఱబొమ్మ యోయన వెసనడియాస॥ రంగనాథ॥

మూలము.

సీ॥ ఆఱడియాఱాపులాఱూఱటయునూఱేయాఱడేనేఱువయేఱుపేఱు
ఓఱుకాఱడవియుకాఱులువేడుకకాఱులు కాఱియ కాఱుపోతు
కోఱకోఱడములుగిఱగోఱజమును చాఱపప్పను చేఱచేఱుకోల
చేఱుచోఱలుతాఱతీఱుతూఱతేఱిచూచుటనీఱునూఱుపాఱె
పాఱుతెంచుటపేఱుటపోఱడనఁగ। బీఱువోవుటమాఱునుమాఱుకొనుట
మాఱటయుమాఱుచుటయునుమీఱుటయును। మధురసౌందర్యమోమహ్యామానవశాని॥

ఈపద్యమందలి పదములకర్థోదాహరణములువ్రాయఁబడును.

ఆఱడి=వ్యర్థము.

ఉ॥ ఆఱడిపోకయస్థలమునందుటయుంగనిపల్కనేరమిన్
మాఱటనోరిదానవయిమాటలుచిత్తమునందు నిల్పకేఁ
గాఱులుప్రేలెదన్వినుఁడు కర్జము నెగ్గును గాననల్కమై
వీఱిడిగ్గైనమానిసికి వెండి వివేకముగల్గనేర్చునే॥ భా॥

ఆఱాపులు=బొబ్బలు.

ఆఱు=రోమావళి, షట్సంఖ్య.

సీ॥ వెడవెడనూగాఱువింతయైయేర్పడి దాఱనివళులలో నాఱునిగుడ॥ భా॥
క॥ ఆఱమ్ములతనిమేనం। దూఱంగా నేసి నాల్గుదురగాంగములన్॥ భా॥

ఊఱట=విశ్రాంతి.

సీ॥ కోలుమసంగెడుకోర్కులవెనువెంటఁబాఱుచునున్కికినూఱటయును॥ భా॥

ఊఱుట=స్రవించుట.

సీ॥ * * యూఱడిచాలించుటాఱుఁగాయలుదకంబులూఱుట॥ అప్పకవి॥

ఊఱడుట=చాలించుట

"ఆఱు" అనుశబ్దోదాహరణము సంజూడవలయును.

ఏఱువ=సీమ.

సీ॥ * * ఏఱువసీమలో నేఱుదాఁటి॥ అప్పకవి॥

ఏఱు=నది.

గీ॥ విధుముసత్త్వాదిగుణముల ననఘుయాత్మ। తత్త్వమునవీనములఁజేయుఁదన్మయత్వ

దర్శనము దానయవిమహాదధినడంగు। నేఱులట్టులరూపఱు పేఱు లేక॥ భా॥

ఓఱు—ధ్వని-

క॥ వేఱొకవిఱుఁగొనియమ్ముల। గీఱిమెఱుఁగునారసములఁగిఱికొల్పిననో
టాఱిమెఱుంగ్రొన్నెత్తురు। పాఱనతఁడు దేరిమీఁదఁబడిమూర్ఛిల్లెన్॥ భా॥

కాఱడవి—సాంద్రాటవి-

క॥ కాఱడవిఁబఱచుమృగముల। నూఱటకుందిగిచిడస్సియున్నతఱిశ్రమం
బాఱంగానెదఁదాపము। దీఱఁగఁజైపించె నన్నదీ పవనంబుల్॥ భా॥

కాఱులు—నిష్ఠురోక్తులు-

'ఆఱడి' అనుశబ్దోదాహరణమునఁ జూడవలయును-

వేడుకకాఱులు—చేపలఁబట్టువాండ్రు-

క॥ పాఱెడునీరెడఁద్రవ్వఁగఁ। దాఱఁబెడిదమైనయెండదనుకఁగ నివురం
బాఱెనుడుమంతవేడుక। కాఱులుజాలరులువచ్చిక్రందుకొనంగన్॥ భా॥

(పైపదమువలన హెంతకాఱులు మొదలైనవియు గురువులే-)

కాఱియ—కష్టము-

ఉ॥ ఆఱురసంబులంజవులయందలిక్రొత్తలువుట్టనిచ్చలున్
వేఱొకభంగిఁబాకముల విన్నను వొప్పఁగఁజేసి చేసినన్
మీఱఁగఁబానసీనినొకనింబురిగానని యట్లుగాఁగ మేన్
గాఱియపెట్టియైననాడికంబుగ వండుదు నెల్లకూరలున్॥

కాఱుపోతు—కఠినమహిషము.

సీ॥ మీఱుచువేట్లాడు కాఱుపోతులకొమ్ము చప్పుళ్ళపులుఁగులు కుప్పగూల॥ య॥

కోఱ—దంష్ట్రి-

ఉ॥ కోఱలుగీఁటుచున్నయనకోణములం దహనస్ఫులింగముల్
గాఱఁగ నూర్పులంజదలగాలికి॥ ఏ।హ॥

కోఱడము—క్రూరత్వము-

గీ॥ ఆతని వెనుక కర్ణుండును ననుజగణము। శకునియును వారిపొందైన జనపతులును
బోఱురిమ్మిఱిచనియొకక్రొవ్వుగట్టి। వేఱెయంతంతనుండిరికోఱడమున॥ భా॥

గీఱుట—నాటుట, దంతపీడనము, ఆకర్షించుట.

క॥ మీఱినమానుల కెనుకను। మాఱులుగకయున్నమీసమగ్రతను వే

మాఱుఁగొని యూడఁగాఁదగు। గీఱు నెసాత్త్వికులబుద్ధిగిల్బిషచయముల్॥ నృ॥

సీ॥ * * పండ్లుగీఱుటనాటుటయుఁదివ్రుచుటయునయ్యె॥ అప్పకవి॥

గోఱజము—మదము, కస్తూరి, జంతుభేదమనికొందఱు.

సీ॥ ఒక్కయెలుకుఁ బేదునక్కకొమ్మునునిట్టి। గోఱజంబుజున్నుఁజాఱపప్పు॥ మ-చ॥

చాఱపప్పు—ఒకజాతిబీజములు.

సీ॥ * * చాఱలదెబ్బలిచాఱపప్పు॥ అప్పకవి॥

చేఱ—అంజలిలోసగము.

సీ॥ చేటెడుమాడలుచీఱుటరెండుగాఁజేయుట॥ అప్పకవి॥

చేఱు—పేట.

సీ॥ * * చేయుట యయ్యేలచేఱులన్నఁగ॥ అప్పకవి॥

చోఱ—మత్స్యవిశేషము.

చోఱయనుశబ్దమున కేయాదివర్ణదీర్ఘమువచ్చి చోఱయైనదిగావున గురుత్వము సిద్ధమే॥

సీ॥ చూఱయెల్లరనువోఁచుట చాఱమీనులు॥ అప్పకవి॥

తాఱుట—పరుగెత్తుట

ఉ॥ త్రేలోకచాపమెత్తి యదువీరుఁడు డెబ్బదిరెండుబాణముల్
మీఱినపౌండ్రభూవిభునిమేనిగలంతటనాటునల్గడం
జాఱఁగఁజేసి తేసిశిలభద్రప్రకరంబుమహీరుహంబుపైఁ
దాఱుతెఱంగుజేసెనతిధైర్యముసూపె నతండుసైరణన్॥ సో-హ॥

తీఱు—విధము.

సీ॥ * * తాఱుమెకంబులీతీఱున॥ అప్పకవి॥

తూఱుపు—ప్రాగ్దిశ.

ఉ॥ తూఱుపుతెల్లవాఱుటయుఁజోడనె మంగళపాఠకధ్వనుల్
మీఱఁదదీయరావములమేల్కని కార్యసమంచితక్రియల్
దీఱిచిపాండుపుత్త్రివసుదేవసుతుల్ ప్రమదంబుమోములం
దేఱఁగవేడ్కతోనరుగుదెంచిసభాస్థలినిల్చిరంతటన్॥ జై-భా॥

తూలుట—చొచ్చుట.

ఉ॥ ఆఅడియాడ నీరస ధనాధిపలోకము నిండ్లవాకిటుల్
తూలుటమాని శ్రీనగము తూలుపువాకిట దూటిపాపముల్
నీఱుగఁ జేసి గంధవతినీటను గ్రుంకి మనంబులోని చి
చ్చాఱఁగఁ జేయుటొప్పు త్రిపురాంతకదేవుని కైనమస్కృతుల్॥ త్రి-డో॥

నీఱు—భస్మము.

నీఱుపాఱుట—శరీరదృఢతపోవుట.

ప్రథమార్థమునకుఁ బైపద్యమే చూడవలయు.

సీ॥ రాధాసుతుఁడర్ధరథుఁడు గుండలములు కవచంబు పోవుట కారణముగ
నీఱు పాఱినవాఁడు పిఱిఁడి కృప పెద్ద పరశురాముండు శాపమున దీని॥ భా॥

నూఱు—శతసంఖ్య.

చ॥ అనవుడు భీతి వేఁడికొని యావులు వేయును యెద్దులాఱునూ
ఱును రథముల్ శతంబును మెఱుంగుల మొత్తము వోని యంగనా
జనశతకంబు దంతిశతసప్తకముం గొని శాంతిఁ బొందవే
యనిననుమానదర్యో వసుధామరకోపమతీవ్రరూపమై॥ భా॥

ద్విపదము॥ నూఱు వేలేండ్లు సన్నుతగతి లేక
యాఱడిపడి భస్మమైయున్నవాఁడు॥ రంగనాథ॥

పాఱుట—ప్రవహించుట, వ్యాపించుట.

"తాఱు-ఓఱు" అనుపదములకు వ్రాసిన యుదాహరణములం గనందగు.

ఇది భావనార్థకమగునపుడు ద్విరూపము. దీనివలన నేయింకఁ బాఱుట, గరుపాఱు
ట మొదలైనవి గురురేఫములు.

పోఱఁడు—చిన్నవాఁడు.

సీ॥ పడఁతి దేహము గరుపాఱుట పేఱుట చీఱుట పోఱఁడు చిన్నవాఁడు॥ అప్పకవి॥

బీఱువోవుట—వ్యర్థమగుట.

తే-గీ॥ బీఱువోయిరథ్యంబులు మాఱుమొగము॥ భా॥

మాఱు—ప్రతి.

ఉ॥ పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ ని
క్కాఱియ మద్బలంబునకుఁ గాఁదగునే వివిధాస్త్రసంపదన్

మీటిననీవుగల్గఁగ నమేయపరాక్రమలీలఁజూడవుల్
మాఱె తలంపనీదగుబలంబును జేవయుఁజూ వృమిత్రజిత్॥ భా॥

ద్విపదము॥ వేఱుదేవతలగావింప నింద్రునకు
మాఱింద్రుఁగావింపమదిఁదలంచుటయు॥

(మాఱుపడుట, మాఱుమొగము, మాఱుమాట, తాఱుమాఱు, మొదలగు పదములన్నియు గురురేఫములని యెఱుంగవలయును)-

మాఱుకొనుట=తాఁకుట-

ఉ॥ ఊఱటఁజెయ్యులంజెమటలూరఁగ దర్పములొండొకంటికిన్
మాఱుకొనంగమున్ననినమంజులసౌఖ్యరసంబు నిక్కలం
దాఱుచుఁగోరికల్ గెరలి దాఁటులువైవఁగసోయగంబుపైఁ
దేఱఁగఁబ్రౌఢదంపతులతీఱువఁ బొల్పెసలాఁటి రిద్దఱున్॥ ఎ-హ

మాఱట=రెండవది-

'ఆఱడి' అనుశబ్దోదాహరణముంజూడవలయును-

మాఱుచుట=చంపుట-

పైశబ్దమువలన 'పరిమాఱుచుట' పిల్కుమాఱుచుట, మొదలైనవిగురువులు.

ఉ॥ తూఱ్పరుణంబుగాఁదోఁచె దుష్టనిశాచరవేళయవ్వేడున్
మాఱ్పుమ కాలయాపనమమర్పకమిప్పిశితాశిఁబట్టిప
ల్లాఱ్పఁగనేల నావుడు బలాఢ్యుఁడుభీముఁడుమల్లవిద్యనే
ర్పేర్పడఁగా హిడింబుని విహీనపరాక్రముఁజేసిచెచ్చెరన్॥ భా॥

ఈ పైపద్యములోఁ బ్రాసములు సంయుక్తములగుటవలన గురువులు కావని శంకింపవలదు- ఇయ్యంశము ముందుముందు వివరింపఁబడును-

మీఱుట=అతిక్రమించుట-

మ॥ తనసౌందర్యము సెప్పఁగాఁగరఁగిపద్మాకాంతరప్పించి మో
హనకంజంబునపైచి తియ్యమిడు నెయ్యంబొప్పఁజైకొన్నమీ
ఱినృశంసత్వమునందొఱంగిచని వెట్టింజేసెఁ గాకుత్స్థుఁడై
న నిలింపారి విదారిచందములు డెందానన్విచారింపుఁడీ॥

మూలము.

ఆ. వె॥ తాచు తాఁగ తేసె తేఁచు తేఁచుట పెర। తేచి తేల చాట్పు తేఁపు లోలె
లోనె వీటి డిథరణీసుర స్త్రీ విప। ద్గ్రిహ ని రాసిథూప రాగ లేశ॥

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును.

తాచు=రుద్దు.

సీ॥ తాచనీలఫు తాయి తాఁగ వెన్నెల తేఁడు॥ అప్పకవి॥

ఈశబ్దమునకర్థమేమో తెలియలేదు. దీనికినప్పకవియే ప్రమాణము. ఇది రాచు శబ్దము కాదు. దానిని రేఫములలో నప్పకవి చెప్పినాఁడు. రేఫము గుటకు మాచే నుదాహరణము గూడ వ్రాయఁబడియె.

తాఁగ=థూర్తు.

'తంపిల్లుట' అనుశబ్దోదాహరణమునం జూడవలయును.

తేసుట=హెచ్చుట.

ఉ॥ తేసి యనుం గురక్కసుల తేనిపసిండి మెకంబు రూపుగాఁ। జేసె॥ యయా॥

తేఁచు=మృగవిశేషము.

సీ॥ ❊ ❊ తేఁచు కుక్కలు తేల తేఁగు॥ అప్పకవి॥

తేఁచుట=పురికొల్పుట.

రగడ॥ చాలు చాలు నెంత కైనఁ జాలుదన్న గన్నెరుల్
తేలపూల కేలగోల తేఁచనింతలోనె॥ యయా॥

పెరతేచుట=ప్రేరణసేయుట.

ఇది తద్భవము. దీనికే ప్రేతేచుటయనియు రూపము గలదు.

సీ॥ తేఁచు కుక్కలు తేల తేఁగు ప్రేతేచుట॥ అప్పకవి॥ ఇందలి ద్వితీయ రేఫము లఘువు.

మ॥ తరుణుల్ల ల్లియొఱం గుచంబులును పం దచ్చైత్యముల్ డీము లై
పెర తేపం జనుదెంచెఁ గాక రవిదీప్తిం గ్రుంకి పాతాళగహ్వరముల్॥ ఆ. మా॥

తేలచెట్టు=వృక్షవిశేషము.

'తేమట' యనుశబ్దోదాహరణముం జూడవలయును.

ఉ॥ అప్పుడు ముద్దరాలిఁ జెలులక్కునఁ జేర్చి ముఖాబ్జమెత్తి కన్
దెప్పల బాష్పములు డిగఁ దేపె నృపాలుఁడు గారవింప నీ॥ వసు॥

ఉ॥ కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం
బోలుచుఁ జేర్చి యాద్రుపదపుత్త్రికు నిన్నమయింప వేదనన్
బోలుచు బోఁజఁగాఁ బలుమ ※ ఱుం బోరలంబడ లాలఁ గ్రక్క న
వ్వాలు మగండు ప్రాక్పరిభవంబుఁ దలంచుచుఁ గ్రొర్యధుర్యుఁడై॥ భా॥

పలుమఱు శబ్దము ద్విరూపమైనను భారతమునందు సర్వత్ర గురువుగనే ప్రయోగింపఁబడుటవలన 'బోలుటయు' గురువుగ నిర్ణయింపఁబడియెను.

బోయుట = వెతకుట.

(ఇది యసూయార్థకమగునప్పుడు రేఫము)

సీ॥ బోయుట వెతకుట బోఁతవడుట॥ అప్పకవి॥

వీఱిడి = వెఱ్ఱి.

'ఆఱడి' అను శబ్దోదాహరణముం జూడవలయును. (చూ- పుట. 101)

మూలము- (తద్భవములు-)

తే- గీ॥ అఱిసె పెఱవారు కఱడు వంకఱ యు మొఱకు
తత్తఱంబును పిఱికియుఁ దద్భవముల
గురువులై కానఁబడు హ్రస్వపరమున నుగ్ర
పాణధారాహతకబంధబాహుబంధ॥

ఇందలి పదముల కర్థోదాహరణములు వివరింపఁబడును.

అఱిసె = అతిరసశబ్దభవము.

సీ॥ అఱవలు ద్రావిడుల ఱవు టఱిసె లఱిగిపోవుట॥ అప్పకవి॥

పెఱవారు = పరశబ్దభవము.

క॥ పెఱవారలుఁ దగ మెలఁగెడు। తెఱఁగులు దొరకొన్నయంత తెరువుల నేర్పుల్
మెఱయుచుఁ బతిచిత్తముఁ గొన। నాఱపుగలిగి మాన్యవృత్తినుండుదురు వగన్॥ భా॥

వంకఱ = వక్రశబ్దభవము.

క॥ మఱి తెరలు నిక్కములు వం। కఱ బోనులు ద్రాళ్లు లురులు కాలురులును జీ
గులుగం డెలుతలములు। గఱి విలుకులు పిండ్లు మానుగాఁ గొంచువెసన్॥ య- చ॥

మొఱకు = మూర్ఖశబ్దభవము.

చ॥ ఎఱిఁగియు ఱెంగి జీవులకు నొగ్గుననలంచు దవానలంబులో

నుఱుకుమరే రణంబు తెరువొల్లము దుర్జయుఁడైన వీనితో
నఱకఁ బెనంగ మాకుఁ జలమో ఫలమో తగ నీవు నిట్టి యీ
మొఱకుఁదనంబు దక్కుమిది మంద ఱసేఁగుద మంతభంగముల్॥ శా మా॥

తత్తఱము = తంద్రాశబ్దభవము.

చ॥ ఒఱపరిఁగన్నఁ గూడఁ జనునూఱక సన్నలు చాఱనాడుఁద
త్తఱపడు బోటి చీరెను విధంబున నొత్తిలి పల్కు నవ్వఁ బ
ల్కులఁ బొరుగిండ్ల కేగు * * * జై- భా॥

పిఱికి = భీరుకశబ్దభవము.

క॥ వెఱపెట్టిదియో యెన్నఁడు। నెఱుఁగని నీయట్టివానికెవ్వారోరొయీ
పిఱికితనమింతయలవడఁ। గఱపినవారనుచు శౌరి కలకల నవ్వెన్॥ భా॥

మూలము.

తే- గీ॥ కాఱె జాఱుట చాఱలు చూఱలాడె
తీఱు పాఱుఁడు ఱేఁడు సొన్నాఱె చీఱ
పరను లైబండి ఱాలు తద్భవములందుఁ
గానఁబడుఁ బ్రాతరుత్ఫుల్లకమలనేత్ర॥

సంస్కృతమునందు గురురేఫములు లేవుగదా, తద్భవములయందెట్లు గలిగినవని శంకింతురేని వినుఁడు- అహోబలపండితీయమునందు "పాఱుశబ్దస్యయది తద్భవత్వం తర్హి గురురేఫమితి చెన్నైషదోషః- కఱకు మొఱక్విత్యాదిషు తద్భవత్వేపి తచ్ఛ్రవణాదతఏవాథర్వణోక్తేలక్ష్యానురోధేనోచ్చారణస్యకల్ప్యత్వమాహ" అని చెప్పఁబడియెను- ఇదియునుంగాక తద్భవములయందు నాదేశములువచ్చుట సుప్రసిద్ధమే. కావునన ట్లనే కొన్నిశబ్దములయందు గురురేఫాదేశమువచ్చినదనినైనవిచారింపవచ్చును.

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును.

కాఱుట, జాఱుట = క్షరణశబ్దభవము.

క॥ వేఱుగఁ గనినం బ్రకృతిం। జాఱవిడిచినట్లు తనదు సుజ్ఞానమునుం
గాఱ విడిచి తనకంటెను। మీఱ నొకటి లేమి కాన్పు మేకొనుటొప్పన్॥ భా॥

చాఱ = సారశబ్దభవము.

సీ॥ చాఱల బెబ్బులి చాఱపప్పు॥ అప్పకవి॥

చూఱ = అల్లరిగాఁ బోఁచుట, చోరశబ్దభవము-

'కాఱుట' అను శబ్దోదాహరణమునంగనునది-

తీఱు = తీర కర్మసమాపనె యను ధాతువువలనఁ బుట్టెను

చ॥ తనుమనుబద్ధబన్నములు తమ్మునిపైఁ గలకూర్మిఁ జేర్చి ని
జ్జనపతి సైప లెస్సయని చక్కన రాజ్యము పాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టి రెచాలకైరి వీ
రనరాకా నాన లేమియని యాడరె లోకము వారు కేశవా॥ భా॥

పాఱుఁడు = బాడబశబ్దభవము-

గీ॥ అఱుగుదెంచితివనియు ధనార్థిననియు। నిట్లు వినుపించుటయు రాక్షసేశ్వరుండు
చేఱికొనఁ జూచియాత్మ నిప్పాఱుఁ డధముఁ। డగుటదోఁచుచునున్నది యడుగ[వలయు

ఱేఁడు = రాట్ఛబ్దభవము.

ఉ॥ ఱెప్పలు వ్రాల్పక ప్పుడమిఱేని మనోహరమూర్తి నిచ్చలుం॥ నై॥

సొన్నాఱి = స్వర్ణహారిశబ్దభవము.

సీ॥ సొన్నాఱి నాఱువైచుట॥ అప్పకవి॥

గీ॥ సర్వకతిచిద్ద్వికియదియచ్ఛబ్దవాచ్య। ములఱిక ప్రత్యయంబులు పూర్వకథిత
సరళవర్ణపరంబున గురువెకాని। లఘువు లేదర్ధచంద్రకలాపవినుత॥

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడును-

1- సర్వశబ్దార్థము- అందఱు- అందొఱనియుంగలదు- ప్రథమరూపమునే కోదాహరణములలో స్పష్టము- రెండవరూపమునకు 'గిఱువుటం' గనుఁడు.

2- కతిచిదర్థకము- కొందఱు- ఎఱుగుట. యనుశబ్దోదాహరణముంగనుఁడు-

3- ద్విశబ్దార్థము- ఇద్దఱు- క॥ మఱియొక్కటి సెప్పెదని। ద్దఱు కృష్ణులఁ జంపి వారిధనములనాకి। త్తఱిఁ దద్రథమిదియని। యొఱఁగించినయతనికిత్తు నెనుముదమునన్

4- కియదర్థము- ఎందఱు- చ॥ వెఱచిన సేమనంగలదు వేచనుమెన్నఁడుఁ జావు లేదని। న్నెఱిఁగి యొఱింగి నిద్రితుని నెవ్వరు జంపరు నీకు సేమ మెం। దఱు రిపులెత్తివచ్చి నమదంబఁణఁగించెద నేనవిష్ణునిం। బఱపెద॥ రామాయణము॥

5- ఇయదర్థకము- ఇందఱు- దీనికిముందు వ్రాయునుదాహరణమే ప్రమాణము.

6- ఱిక ప్రత్యయము యొక్క యాదివర్ణము గురువు- పెద్దఱికము, చుట్టఱికము, పెదఱికము, రాచఱికము, మేనఱికము, మొదలగు శబ్దములు- దీనివలనఁ బేదఱిమి, హెచ్చుఱిక మొదలగు నవియు గ్రహింపఁబడు- పేదఱిమియనఁగాఁ బేదఱికమ్మే- 'దండివై లెమ్మనసు పేదఱిమి విడిచి' అని భారతప్రయోగము.

క॥ ఎఱుఁగమిఁ జేఁకొటి సేపె। ద్దఱికంబు దలంచి యేమి తప్పగలిగినన్
మఱచిదయ జూడుమిట్లం। దఱు నీకుం బనులు సేయఁదగుదురు వీరల్॥ భా॥

7- పూర్వకథితసరళవర్ణంబులనఁగాఁ జకారపరంబునఁ బూర్వోక్తశబ్దంబులు దక్కఁ దక్కిన శబ్దములలో గురువేయనుట. ఇందులకుఁ బ్రయోగము.

క॥ కొఱమాలినదుర్లక్షణ। కొఱగాదిదినీకునారి గుప్తంబున ని
జ్జఱభినివర్ధించి॥ * * * * రామాయణము॥

జిఱగొనుట=వ్యాపించుట.

చ॥ మెఱుఁగుఁబసిండిఛాయ గల మేనువెలుంగ విశాలనేత్రముల్
గిఱిగొనలంకపై నలుక కెంపునఁగోకనదచ్ఛదద్యుతిం
జిఱిగొనుచుండ రాముపలచెయ్యనఁగా ధరణీశుఁడాపటన్॥ రామాయణము॥

హజాఱము- తుజాఱులు- జిఱాబా- మొదలగు పదములన్నియు నిట్లే.

ద్విపదము॥ జిఱజిఱఁ ద్రిప్పెద శేషునినైన। వెఱచవ్వఁ జేసెద విహగేంద్రునైన॥ రం॥

శ్లో॥ "అన్యేంతరిక్షఖద్యశోన్యేనయుక్తాః కదాపిచ" (అథర్వణకారిక)

అన్యే=ఉక్తవ్యతిరిక్తములును; యుక్తాః=ద్విత్వశిష్టములునగు గురురేఫములు; అంతరిక్షఖద్యశః=ఇన్నాలు; అవి, కదాపిచ=ఎప్పుడును అన్యే=లఘురేఫములు; న=కావు- అనగాఁ గిఱ్ఱిచుఱ్ఱి మొదలగుశబ్దములందున్న ద్విత్వవిశిష్టములగు రేఫములు గురువులేగాని లఘువులుగావనుట. 'కదాపిచ' అనుటవలనఁ దెఱగంటి కఱివేల్పు గొఱియ బొఱియ నెఱియ పఱ్ఱ పుఱియ నెఱ్ఱ నెఱియ వఱ్ఱు వఱుత కొఱ్ఱు కొఱుఁత మిఱ్ఱు మిఱుత అఱ్ఱు అఱుత అఱకట పఱకట ఎఱ్ఱ ఎఱుపు గుఱ్ఱ గుఱక తొఱ్ఱ తొఱట కొఱ్ఱు కొఱ్ఱఁబడియె మిఱ్ఱు మిఱ్ఱిచేను కఱు కఱ్ఱిమొన" అనియీవిధముగ ద్విత్వవిశిష్టశబ్దముల కెన్నిరూపములువచ్చినను రేఫమునకు గురుత్వమేయుండును గాని లఘుత్వము రాదని భావము. ఇందువలనఁ బొఱయి పొఱత్రికి మొదలగు గ్రామనామములుఁగూడ వ్యాఖ్యాతములయ్యె. ఇట్లుచెప్పుటచేఁ గూచిమంచి తిమ్మకవిచెప్పిన లక్షణ మపాస్తమయ్యె.

సీ॥ క్రిందజడ్డలుగలరేఫముల్ గురువులు కఱ్ఱియిఱ్ఱియుమఱ్ఱివెఱ్ఱియనఁగ
నదియొఱ్ఱిరూపంబునందనగురుభావమెడల దుదాహృతులేర్పరింతుఁ
దెఱఁగంటి మొఱవెట్టెఁ గఱివేల్పు కొఱచేలు జఱ్ఱునజఱజఱ బొఱ్ఱబొఱియ
వఱ్ఱునువఱుతయుఁ గొఱ్ఱుపుగొఱఁతయుఁ దొఱ్ఱలు తొఱటలు నెఱ్ఱ మెఱుపు
మిఱ్ఱిచేలయొద్దఁ గొఱ్ఱనేసిరనంగ। జెల్లునిట్టులగుటచేత రేఫ
మునకుయోగమైనమును పఱిరూపుగా। దనుచుఁ జెప్ప రాము మునిశరణ్య॥

కఱ్ఱెఱ=అత్యంతారుణము.

ఉ॥ గిఱికొను గోపురాగ్ర పరికీలిత పంకజరాగరశ్మిక
ఱ్ఱెఱయగు ఛాయబొల్పు దివసేంద్రుఁ డపశ్చిమ నిమింటఁబోవుచో॥ ఆ-మా॥

గొఱియ=గొఱ్ఱె-

క॥ ఉఱుగనాఱికపంటలు। గొఱియలపాండియునువలువగిం బురుషులకుం॥ భా॥

పుఱియ=పుఱ్ఱె-

చ॥ కఱచినపీనుఁగుస్వాడఁద కప్పెరయన్నాలఁబచ్చితోళ్ళనుం
బుఱియల పేరులున్నెదదుపూఁతకు ఝుమ్మనిమూఁగునీఁగలుం॥ సో-హ॥

అఱకట=స్కంధప్రదేశము-

క॥ తఱియగునంతకు రిపుఁదన। యఱకటఁ జెట్టుకొనియుండునది తఱియ గుడుం॥ భా॥

సీ॥ ఇక్కారణంబున నేఱ్పాటుతూఱ్పునుగుఱ్ఱుతీఱ్పుటయుఁ గక్కుఱ్ఱియాది
గాఁగ శబ్దములందుఁగల ఱాలకును లాఘవము రాదు తెలుఁగులక్ష్యములునెల్ల
కానితిక్కనమఖిప్రధానులుస్వప్రయుక్త గురురేఫముల యుక్తదశయందు
లఘువులఁ జేసిరట్లయొనర్చుటకు హేతువెఱుఁగరాదా శబ్దబృందములకు
నదియెమానంబుగాఁగ రూపాంతరంబు। గలుగుననఁగొంత మేలప్పకవిప్రయోగ
మునను సంయుక్తగురురేఫములుగలుగుట। గాననగుచుండె సకలజగన్నివాస॥

టీక॥ ఇక్కారణంబున ననఁగాఁ బూర్వోక్తాథర్వణవచనమువలన మిత్తిచేను మొదలగు శబ్దములయందలి సంయుక్తరేఫమునకుఁగూడ గురుత్వము సిద్ధమయ్యెను. ఆహేతువుచేతఁ దూఱ్పు మొదలగు శబ్దములయందలి సంయుక్తరేఫమునకును లఘుత్వము రాదనుట. ప్రయోగములంగనుఁడు. "తూఱ్పరుణంబుగాఁ దోఁచెఁగె దుష్టనిశాచర వేళయయ్యెడుఙ్" అని వాగనుశాసనుని ప్రయోగమునందు నాల్గుప్రాసాక్షరములు సంయుక్తశకటరేఫములే- ఇందులోఁ దూఱుపుశబ్దమునకు జైమినిజభారతోదాహరణము చూపఁబడియున్నది. కావుననే 'దీర్ఘములపైఁగల బండిరాలొక కొన్నియే ప్పఱతునింక' నని యప్పకవి నుడివినాడు- ఈ రెంటివలన వాగనుశాసనుని పద్యమునందలి ప్రాసములు నాల్గును గురురేఫములగుట స్పష్టమేగదా- ఈ హేతువుచేత 'చారేరుపథాత్మనశ్చేత్యాది' సూత్రమున 'కుత్రచిద్రేఫగస్యాదుతో లోపః ప్రయోగత' ఇత్యథర్వణోక్తివలనను రేఫములకు నన్యవర్ణములతో సంశ్లేషము వచ్చినను గురుత్వలఘుత్వ వైపరీత్యము గలుగదని యెఱుంగఁదగు- ఇఁకఁ దిక్కనాదులు

క॥ సర్పముఖశరముఁగలదని। దర్పంబునఁద్రిగిడిఁదొడరఁదలఁపకుహరిపెం
పేర్పడఁగ నదియకాదఁట। తీర్పవలయువానినెల్లఁదీర్చున మనకై॥

ఇందులోఁ 'దీఱ్పు' అనుశబ్దము గురువుగఁ బ్రయోగింపఁబడియె-

క॥ వేఱొకతెఱఁగుననారులకు। మాఱాడకయునికిలెస్స మను జేంద్రుకడం
దీఱమిగలచోటులఁదా। మీఱి కడఁగివచ్చిపంపుమేకొనవలయుఙ్॥ భా॥

ఈ శబ్దమే 'కాఱడవిఁబఱచుమృగములు' అను పద్యములోఁగూడఁబ్రయోగింపఁబడియెను. క॥ తూఱ్పుదలగాఁగఁగొరవు। తేర్పడఁగనుఁగొనుచునుండ నిలగుప్పింపం। దర్పోజ్జ్వలుండుభీష్ముఁడు। హర్పతిహస్త్యాద్రిసేరునట్లుగఁబడియెఙ్॥ భా॥

ఇప్పద్యమునందుఁ దూఱ్పు, ఏఱ్పడుట- యీ రెండుశబ్దముల సోమయాజులు గారు గురురేఫములుగఁ బ్రయోగించిరి-

క॥ నిర్బంధము దుర్మానము। దుర్బద్ధికిఁ గాకతగు నెదుర్యోధన నీ
మాఱ్పలమె పాండవులకుల। దౌర్బల్యము వాయ శుభము దలకొను సంధిన్॥ భా॥

ఈ పైపద్యములో 'మాఱ్పలమె' యనఁగాఁ బ్రతిపక్షబలమాయనుట- ఈశబ్దమె 'పాటినెఁజూచి కౌరవనృపాలుఁడు' అనుపద్యములోఁ 'బాండవుల్ మాఱె తలంప' నని గురురేఫముగఁ బ్రయోగించిరి- మఱియు శ్రీనాథకవియును ఉ॥ స్వర్పతి చిత్తవృత్తి కలుషత్వము నొందెనాయఱ్పయంబునా। కేఱ్పడ లేదు విన్ము॥ అని వ్రాసె- ఇందు 'ఏఱ్పడుట' రేఫముగఁ బ్రయోగించె- ఇంకనిట్టివి పెక్కులు గలవు- విస్తరభీతి వ్రాయనైతిని- ఈశబ్దములకు నీప్రయోగములే ప్రమాణముంజేసి రూపాంతరమని చెప్పినఁ 'గొంత' మేలు- సంశ్లేషాభావమందు లఘురేఫములు గావరాలేదు గావునఁ బై వాక్యమునందుఁ 'గొంత' యనువిశేషణము వ్రాసితిమి- ఇట్లు చెప్పిన- శా॥ పౌలోమీప్రభృతుల్ కుమారినిటు సంభావింపఁగా మున్నెది। ద్వాలుర్ రాజునలంకరించి శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగా॥ వనువసుచరిత్రమునందలి పద్యములో 'లాంతాత్తురరా। సలోలోశ్చేతి' యీ సూత్రములచేత ద్వాలుర్ అనియుండఁ బరస్థిత శబ్దాదిరేఫమునకు ద్విత్వమువచ్చెఁగదా యది గురువగునని శంకింపవలదు- శ్లో॥ ఉవర్ణరేఫాన్వితా ద్విత్వమయుక్త స్వహలోమత' మ్మని యథర్వణాచార్యులవారు రేఫద్విత్వమును నిషేధించుటచే నీ ప్రయోగము చింత్యము- 'ఇదమదసేతదిత్యాది' సూత్రానురోధమున నీ వచనమునకు (విశేషవిషయకత్వము చెప్పరాదు) తుల్యత్వయుక్తిచేత నవికృతివద్భాత్వరత (ఇత్యాదిసూత్రానురోధమున) (పరుషావాస్వరూపేణ) అను తద్వచనమునకుఁగూడ విశేషవిషయకత్వ ప్రసంగము వచ్చును- అట్లంగీకరింపలేదు గావున నిదియునట్లనె విచారింపవలయును.

ఆశ్వాసాంతము-

మ॥ నిరహంభావయమీంద్రగమ్యచరణా నిర్వేల సమ్యగ్గుణా
భరణాపజ్జ్వశిరోధిరాత్రిచరశుంభద్గర్వపాథోధిమం
దరశైలాయితదోర్బలస్ఫురణ గోత్రాపుత్రికాలోచనాం
బురుహశ్రీభరణైకతానకరణా మూర్ధవ్రజోత్సారణా॥

క॥ రామానవశరదశరీ। రా మానవరాజరూప రామాకలితా
ధామనిధివంశమణినత। ధామనిధీపూర్ణతుహిన ధామనిభాస్యా॥

నర్కుటము॥ హరసరసీజసంభవముఖామరసేవ్యపదా
వరకరుణార్ద్రితత్రిదశవల్లభరాజ్యపదా
ధరణిభరాపనోదనవిధాననిదానశరా
సరసయశోనిరాకృతతుషారసితాభ్రశరా॥

శ్రీ శ్రీధరాయనమః.

# ద్విరేఫవర్ణదర్పణము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీరుచిరగౌతమీయు। గ్భారద్వాజాపగా నికట నీలపురీ
దారాలవాల నవమం। దారాంకూరా మసారతనురుచిసారా॥

గీ॥ అవధరింపుము రూపద్వయంబుగల్గు। రేఫసంతానమును వివరింతు నింకఁ
బూర్వకవిశేఖరులలక్ష్యములను గూర్చి। యనఘభవదీయకరుణారసాప్తకలిమి॥

శ్లో॥ లఘుర్భవేద్గురుః కుత్రచిద్గురుశ్చలఘుస్తథా
ఉచ్చారణస్యకల్ప్యత్వాన్నిదానంతత్రసద్వచః॥

టీక॥ ఉచ్చారణస్య—గురులఘుప్రయత్నోచ్చారణము; కల్ప్యత్వాత్—కల్పించుకొనఁదగినదవుటవలన; కుత్రచిత్—ఒకానొకచోట; గురుః—గురురేఫము, లఘుః—లఘురేఫముగా, భవేత్—అగును, లఘుశ్చ—లఘురేఫమును, గురుః—గురురేఫముగా, భవేత్—అగును, తత్ర—అచ్చట, సద్వచః—ప్రామాణికప్రయోగము, నిదానమ్—ఆదికారణము. అనఁగా నొకశబ్దమునందలి రేఫమునకే లఘుగురూచ్చారణములుకల్పించుకొని ప్రామాణికకవులు లఘువుగను గురువుగనుగూడఁ బ్రయోగించుటచేత రూపద్వయముగలిగెఁగావున నట్టిపాని యథేచ్ఛముగఁ బ్రయోగించుకొనవచ్చుననుట.

గీ॥ కృష్ణగురురేఫమొక్కొక్కయెడను రేఫ। మగును రేఫంబు గురురేఫమగునటులనె।
తెలియనుచ్చారణముకల్పనీయనుగుట। శరణమిచ్చుటఁబ్రాక్కవీశ్వరులఫణితి॥

మూలము.

గీ॥ అరమరయునరవరలురవారగెనారనైఁ। గరగెఁజేకుఱెఁగొరకుడగ్గఱుటగుఱియుఁ
జెరఁగుతరలుటతరులునుతఱుచువాతె। గతౌరఱెఁదొరగెనెదురనెరయునెఱయుట॥

అఱమఱ—అపోహము.

చ॥ అఱువదివేలవత్సరములంతకునంతకుఁజెన్నిధానమై
మెఱసినయిక్కుమారుని సుమేరునగాగ్రణియిల్లుఁజేరిన
ట్లిఱమఱలేనిమక్కువఁబ్రియంబొనరింపఁగనాకుఁబీనినే

తెఱఁగునఁ జంపఁడీఱువగ దీరునె యీతనిఁ బంపి నిల్పినన్॥ రా॥

చ॥ సురవరులార నా ప్రతినఁ జూడుఁడు నేఁ డుడుగుండు సాధ్వసం
బరమర లేక వింటి భవదాపదవస్థలు నాశిలీముఖో। త్కరముల॥ (రామాభ్యు)

ఆఱవఱలు=ఖండములు.

క॥ నుఱుమైన కాల్బలంబులు। నఱవఱలైయున్నయట్టి యరదంబులుఁ జె
న్దఱుచగు సూతాంగకములు। నాఱగిన రథ్యముల గములు నుల్లమలంపన్॥ భా॥

క॥ తరులెల్లఁ బల్లవడఁగా। విరళములై నీడలున్న విధమొప్పె సహ
స్కరరుచులతోడఁ దలపడి। యరవరలై తుమురుతుమురులై పడిన క్రియన్॥ ఏ-హ॥

ఊరవు=సమీచీనము.

క॥ దురమునకు మధురయు సుఖ। ప్కరము ప్రయోగంబు దగిన కడలఁ టమీకే
దురవగు నడిగొను మనెహరి। యిరవగు గోవర్ధనాద్రి నేనయొసఁగెదన్॥ సో-హ॥

గురువగుటకుదాహరణము ద్వితీయాశ్వాసమునఁ 'బఱచుటం'గనుఁడు.

ఒరగుట=వ్రాలుట-

తే॥ అసియుఁ జాత్రయుఁ దేఁబంచి యాంత్రవల్లి। కోలగగ్గర ద్రోయుఁ దత్కుజముతోడ
నొరగిరక్కసుతో దైన్యవిరహితముగ। ధర్మమెఱింగించు సూత్రినాతండు వలికె॥

క॥ ఆఱకటనిడి ప్రాఙ్ముఖుఁడై। పఱచి జలధిలోనఁ జడలఁ బాఱు నెడం జే
వఱిదప్పి నిలువఁ జాలక। యొఱగిన గాలవునిడించె నొకగిరిమీఁదన్॥ భా॥

ఒఱయుట=నికషణము-

ఇది శబ్దమగునపుడు 'ఒఱపు=ఒర' అని రెండు రూపములనుండును- అవియు ద్విరూపము లేయగును- ఉదాహరణము-

గీ॥ ఎఱమిఁగడచిపోవుఁ బలుచ గ్రమ్మఱవచ్చి। ముక్కుముక్కుమీఁద మోముజుట్టి
నేఁచి తిరుగునీకపీఁకలతో రాయి। నొఱయఁ జిత్రగతుల మెఱయనవ్వ॥ భా॥

క॥ కొఱగాకుండియు మన్మథు। నొఱపులఁ బడియె జనితండు యువతి ప్రీతిన్॥ ॥భా

చ॥ ఉరుతర వాలభోగులభుజోర్ములనొప్పుచుఁ బొంగి మింటితో
నొరయుచు దిక్తటంబులొగి నొత్తుచు నద్రుల భూమహంబులన్॥ రామాయణ॥

క॥ ఒరసి కొనిపోవ నత్తఱి। సురసైన్యం బార్చుటయును జూచి తిమిరమున్॥ తి-ఉ-ధా॥

మ॥ చరమాశా నికషోపలాంచలమునన్సంధ్యాప్రకాశోదయం
బారగావించి॥ * * * * * జై॥

కరఁగుట = స్రవించుట.

సీ॥ రేలెల్ల నమృతమరీచినంటుననంటికరఁగి నిర్మలపయోఘములఁదొరఁగు॥ వసు॥
సీ॥ * * కరచెనీరుగా సురపహేతి॥ వసుచరిత్రము॥
చ॥ కొఱలెడితేజ చేఁబసిఁడి గుబ్బలియుక్ మతి వెండికొండయుక్
గఱఁగునటంచు సంభ్రమములు కాఁకలనింకునటంచు నెల్లెడన్
తెఱయ నసంపుఁ గప్పురమునించి జగంబులఁ గల్గువారలం
దఱుఁగొని యాడుచుండఁగ సతంబగు రాసిరిగొన్న నేర్పరీ॥ యయాతిచరిత్రము॥

చేకురుట = సమకూరుట.

చ॥ హరిపదసేవఁ జేయుచు ననంతగుణాకరు సన్నుతించుచున్
సరసిజనాథుఁ గొల్చుచు నుజక్రికథాస్థితులాలకించుచున్
నిరతముఁ గాలముం గడుపు నీకు నభీష్టఫలంబులెల్లఁ జే
కురుట దియబ్రమే విమతగోత్రపురేశ్వర జీవితేశ్వరా॥ రా॥

దీనికి 'మురుమొండె?' మను శబ్దోదాహరణముం జూడవలయును.

కొరకు = చతుర్థీవిభక్తిప్రత్యయము.

క॥ నరవర యిటు బంధుచ్యుతి। కొరకగు నష్టాంగకాద్యగురుయోగము వి
స్తరముగఁ జెప్పితి నింకం। గరణీయం బెద్ది నాకుఁ గల్పింపు మనన్॥ ఆ. మా
చ॥ వెఱయఁగ నీప్రసాదమున నిర్జరలోకలలామ నీకు నే
కొఱఁతయు లేదు కోరఁదగు కోర్కెయు నెద్దియుఁ గాన నైన నా
కొఱకు రణంబునందుఁ గపికుంజరులీల్గిన వారు వీరలన్
మఱలఁగ వేడ్కనిచ్చుటయె మన్ననదీననసంతసిల్లుమన్॥ రామాయణము॥

డగ్గరుట = సమీపించుట.

క॥ దురుఁడుడమి ఱేఁచఁగా డ। గ్గరియంతటమిగులఁ జెలఁగు కాఁకలచే వాం
డొరులం గొఁగిటఁ జేర్చుచుఁ। బరికింపుచుఁ గల్లయనుచుఁ బాయుచు మగుడన్॥
క॥ వెఱచఱచి వెఱఁగుపడి సి। వ్వెఱగందుచుఁ గురుబలంబు వీకు లతని డ
గ్గఱనంతనంతఁ జూడఁగ। నుఱక నదీసుతుఁడు డాఁకె నుద్భటభంగిన్॥ భా॥

గురి — దృష్టాంతము.

తే. గీ॥ కరముసాచియగ్ని గురిగాఁగ సత్యముల్ । వేసినారమగుట॥ రామాయణము॥

మ॥ మఱునాఁడమ్మునినాథుఁడెద్దాని జగన్మాన్యత్వవిఖ్యాతికిన్
గుఱియైయుండెడిగంగ దాఁటి మదిగోర్కుల్ప్రోవుగా వీడ డ
గ్గఱిపోవందనచూడ్కి నా రఘువరాకారంబుపై వేడుకన్
జఱచెం గ్రమ్మఁదుసమ్మదాశ్రువులతోఁ బల్మాఱుఁ బ్రోపాడుచున్॥ ర-ఉ॥

సీ॥ గుఱియైన చెలువున మెఱసినలోకరక్షణమన గరళంబుచాయ దోఁప॥ భా॥

చెఱఁగు — వస్త్రాంచలము.

చ॥ రవియను దివ్వెఁ గేతువుచెఱంగున మూసి ధృతోర్ధ్వయంత్రవా
రవిరళఘూర్ణమై కలరవాల్పరవోక్తుల వాంతభూపరా
జివరనిశంగన న్మదనచేతులచాతురి నయ్యపుంగురుం
జవిదలుదార్పవిష్ణుపదమొత్తఁబురింగృహలక్ష్మినూత్నతన్॥ ఆముక్తమాల్యద॥

తే. గీ॥ అవనిగంపింపలలితపీతాంబరంబు । చెఱఁగుదూలఁ జక్రాంశుబు దుఱఁగలింప॥

తరలుట — చలించుట.

చ॥ ఉరుజవశాలియౌతురగముల్మకు చక్రనయావలంబియై
తిరుగు రయంబుచేత నెడఁ ద్రిప్పకమ్మరిసారెచాడ్పునం
బరఁగెఁగడుంధృతాభినవభాండతకుండగనుక్కపట్టుగాఁ
దరలక పైనిదద్భ్రమణదండగతిన్ హరివుత్త్రిఁడొప్పఁగన్॥ ప్రభావతీ॥

చ॥ * * * తదీయహేతిశాం
కరియుతిలోహితావయవగాఁదను నాత్మహృదంతరంబులం
దరలక తాల్చువారలకుఁదార్చుసురీవరణీయవైఖరుల్॥ వసుచరిత్రము॥

చ॥ ఒఱగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడు గ్రుంగెఁ గూర్మముల్
దఱలెనభంబు మ్రోసె సురదంతులు మ్రొగ్గె దిగంతరంబు ల
త్తఱినడలెన్మరుత్సుతుఁడు దర్పమెలర్ప మహోర్వ్యముద్ధతిం
జెఱకఁగ గోత్రశైలములు పెల్లగిలెం గలఁగెం బయోనిధుల్॥ రామాయణము॥

తరులు — వల్లులు.

చ॥ మరువునఁ దమ్మిచూలి ముదిమందతెంగిన యట్లనేర్పుతోఁ
దరులను పైఁడిపడిబానఁదిరంబయియుండెఁగాక యే

వెరవున నిల్పు దీనిదగు వ్రేకపు గుబ్బల వ్రేఁగునన్ ॥ యయాతిచరిత్రము॥

చ॥ తఱులరనిక్కు జాతి నెఱతావియ చిక్కని పొంగమాలికల్
మెఱుఁగులు గ్రక్కు మంగురుల మేలిమిఁ దేఁటులు జొక్కు హారముల్ ॥ వసు॥

తఱుచు = మాటిమాటికి.

క॥ మఱియు రథదంతిహయముల। మెఱయుచుఁ గైదువులు వాడి మెఱుఁగులనీనన్
దఱుచుగ గర్జిల్లెడునం। దఱు రక్షోనాథు పీటఁ దగి యెడు వీరుల్ ॥ రామా॥

మ॥ హరివీరావయవంబులో విరథరథ్యాపార్శ్వభాగంబులన్
దగు చైయుండ ఘనాస్రపంకములు మేదఃఫేనముల్ వ క్త్రితా॥ రామాయణము॥

చ॥ నెఱిఁగురులున్ విలోలసిత నేత్రయుగంబును దేసె లొల్కు వా
తెఱయును దీనియాననము॥ భార॥

క॥ గురువెంద జైత్రుఁ డొందినఁ। గరమలు కన్నావియాడుఁగ ఱచిన నునువా
తెఱమీఁదఁ గానవగు పలు। వరుసయనన్నన లుపల్లవము పైఁ బోఁచెన్॥ పా-హ॥

వాతెఱయనఁగా నోటికిఁ దెరవలెఁ గప్పియుండునదియని వ్యుత్పత్తిచేత నోష్ఠవాచకమైనది- పలుదెరయనియుంగలదు- అదిదంతచ్ఛదపర్యాయము- ద్విరూపమే యగును- 'పరఁగుఁబల్కుప్పు మోవి వాతెర పెదవియనాఁగ నోష్ఠంబు' అనియాంధ్రభాషార్ణవము. పల్కుప్పుశబ్దమే పలుదెరయని ప్రయోగింపఁబడుచున్నది- 'పలుదెర సొబగులానుచు' నని వసుచరిత్రము. దీనివలన యవనికాపర్యాయమగు తెరశబ్దమును ద్విరూపమే యగునని యెఱుంగవలయును- ఈ శబ్దమందలి రేఫము భారతమునందే లఘువుగఁ బ్రయోగింపఁబడియెను- ఎట్లన.—

చ॥ తెరయును మేలుకట్టుదగు దీపములుం జెలువొంద మేటి చ
ప్పరమునఁ జారుహృద్యమగు పాన్పున నాదట నిద్రవోవున
గ్గురువధకారిఁ గాంచి॥ * * * భారతము॥

తొఱలుట = కలియుట, తొరలుట = జాఱుట, పడుట, రాలుట-

తొఱలుట, కవియుట, తొఱఁగుట, మందఱ॥ 'రెండు దెరగులవారితోఁ దొరలుకొనుట' అవి యప్పకవి॥ ద్విరూపము లప్పకవియును జెప్పినాఁడని తెలియుటకుఁగా వ్రాసినారము. ఈ శబ్దమునకుఁ దిమ్మకవి రూపాంతరము వ్రాయునపుడు 'మేనాఱ గుబ్బ యొప్పదె' అను పద్యముదాహరణముగా వ్రాసినాఁడు- ఆచట విడుచుటయని

యర్థము గాని జాఱుటయని యర్థము గాదు. అది సకర్మకము. ఇది యకర్మకము. త్యాగార్థకమగు తొఱఁగుట గురురేఫమే గాని లఘువు గాదు. తే. గీ॥ పొగడబ్రాహుల మొదలను బుష్పరసము। దొఱఁగనెత్తావియందున 'నెఱయనాఱ్చె' ననిమ్మతియొక యుదాహరణము వ్రాసినాఁడు గాని యుందలి 'నెరయ' ననుశబ్దము నాకవి 'ధరణీమండలి దిర్దిరందిరిగె' ననుపద్యములో లఘురేఫముగఁ బ్రయోగించుటచే ద్విరూపమయ్యె. అట్లగుటవలనఁ దొరఁగుటకు ద్వైరూప్యము లెస్సగ సమర్థింపఁబడలేదు.

చ॥ అరిఁజూచుఞ్ హరిఁ జూచు సూచకములై యందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
దొరఁగం బయ్యెదకొంగొకింత దొలఁగం దోడ్తో శరాసారముం
దరహాసామృతసారముం గురియుచుం దన్వంగి కేలీగతిన్॥ సో. హ॥

సీ॥ పరమాత్మ్యపదములఁ దొరగిపాఱెడు నేటితరగలపై లీలదాఁటిదాఁటి॥ నృ. పు॥

సీ॥ నిలిపిమూలాధారనిర్గతనిర్గుణధామంబువద్ద్రింధిభమనకారి
రైపోయి పరమాంబరామృతబింబంబుఁ గఱువంగఁదోఁదోనఁదొఱఁగు॥ సో. హ॥

ఎదురు—అగ్రము, అనఁగా ముందఱ.

క॥ గురుఁడత్యురుతరగతిని। స్ఫురభంగింజుట్టివచ్చు సునిశితబాణో
త్కరచండవేగమున కురు। దురుసన రాదయ్యె నపుడు ద్రుపదసుతునకున్॥ భా॥

చ॥ నిడుదనుఘూళికల్గడుమ నైకొని తీఁగెలు సాఁగఁ జుట్టికొం
చడవిఁ గడారకాచకటుకాకృతి సుళ్ళు మెలంగె గాడుపుల్
జడగతి నధ్వనీనపరిమత్ప్వటునిశ్వసితానిలం బెసు
ప్పుడమతిసార్చులై సుఱసుఱందుదిసుళ్ళుగ ద్రుక్కనోయనన్॥ ఆ. మా॥

సీ॥ * * * గద్దఱియుద్దెఱకట్టెదుఱను॥ ఆప్పకవి॥

పై నాముక్తమాల్యద ప్రయోగమువలనఁ గూడ సంయుక్తగురురేఫములగపడు.

నెఱయ—మిక్కిలి, లెస్సగా.

ఇది యవ్యయము. 'అయ్యద్రి నెఱయమెఱసె' 'నీకంటెనిక్కంపుఁబగవాఁడు నెఱయమేలు' ఈ ప్రయోగములం బట్టియిది యవ్యయమని తెలియనగుచున్నది.

క॥ నెఱయఁ బ్రధానపదార్థము। తెలుఁగుటపరిబోధమూలమెఱుకలెల్ల
న్నెఱుఁగిడుటమమ్మమువ్వర। గులుకొనియొక్కఁడుగ నెఱిఁగికొనుటదలంపన్॥

మ॥ ధరణీమండలి దిర్దిరందిరిగెఁ బాతాళంబుఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామర నివాసశ్రేణులందోలిసై
నెరయుంబంకజసంభవాలయమునన్నిండారె నవ్వేళశ్రీ
కరదైతేయ తనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోషమై॥ నృ-పు॥

నెరయుట=ప్రసరించుట, ప్రకాశించుట-

సీ॥ * * నెరయుటయనఁగనుబరఁగుఁబ్రసరణాఖ్య॥ ఆంధ్రభాషార్ణవము॥

క॥ తరళనయనాబ్జదళములు। నెరయఁగఁదైమున్నుజల్లినృపతులఁజూచిం
చిరితనుకుసుమచయాలం। కరణవిశేషములఁ జేసకొంతలుప్రీతిన్॥ భార॥

క॥ నీరిగుబ్బచన్నుఁగొండలు। దరులంగఱిమొగులుపగిదిఁదవిలితిరుగు న
మ్మరుతంద్రిమనుపునసముల। నెరయునమీక్షాన సింగిణీసుల్తానా॥ యయా॥

ఈనెరయుధాతువుసకర్మకమగునపుడు నెరపుటయనిరూపము-

తే॥ నెరపిప్రియమువల్కి తెర్వత్తురిట్టిది। ధర్మువెపుడుసీవుదలఁపవేల్లు॥ భా॥

ద్విపదము॥ అరిమిచ్చఁగరములు నెరపనియునులు
సురభినిశ్వాసలీలనెరపెసింధురవల్లి॥

మ॥ సరసీజేక్షణుఁడైపయోనిధిసారస్యంధ్యాతటిత్పూర్వమై
నెరసెంజీఁకటికార్మొగుల్॥ * * * వసుచరిత్రము॥

క॥ మఱిమఱిచీఁకటియప్పుడు। నఱిముఱిభటులుడుగకడరి యనిసేయంగా
మెఱసితమమెల్లనెడఁ గ్రిం। క్కిఱిసినమఱిపాసి నిలిచిరంతను నంతన్॥ భార॥

చ॥ ఎఱిఁగితినీతెఱంగువిను మబ్జముఖీయొకనాటిముంద ఱం
దఱయునుగూడియాడఁగ సుధాకరశేఖరుకాంతసీమదిన్
నెఱపినకోర్కెఁ దీర్పనాకనేర్పరిసీకలవచ్చునంటకుం
దఱియిదివోదినంబును సుధాభవనంబును బ్రొద్దుజూడఁగన్॥ స్వా-హ॥

తే-గీ॥ వత్సరంబునుగడచనువ్రతమునాకు। దానినీయెడసలిపియుత్సాహవృత్తి
మెఱయనీకుఁ గృతజ్ఞతనెఱపితొల్లి। యొగ్గుజేసినవారి జయింపఁబోదు॥

ద్విపదము॥ ఘనుఁడుదిలీపుఁడుసైకొన్నప్రతిన। నెఱపఁజాలఁడునీవునెఱపంగఁదివిరి॥

మూలము.

తే-గీ॥ పఱపు పఱపుట పెఱిగెఁ బల్లులు మఱుఁగుట

మఱలె వెఱగివి యుభయధర్మములనొప్పు
నీలనగరాంబురుహసూర! నిఖిలదోష
ఘోరరోగాగదంకార మేరుదీర॥

ఇందలి పదములకర్థోదాహరణములు వ్రాయఁబడు-

పరపు = విశాలము-

క॥ అరదములు సవరణలతోఁ। బరపైయొక్కొక్కయూరి పఱపున నరిగెన్
బరుసనిపలుకుల నాకృతి। పరుషతనసురాళి వోలె భటతతి మెఱసెన్॥ భా॥

చ॥ చెఱకును రాజనంపువరి చేలును దట్టపుఁ బోకమ్రాకులుం
దఱుచగు పువ్వుఁదోఁటలును దమ్మికొలంకులు నేటికాల్వలుం
బఱపగు నారికేళవనపఙ్క్తులు మామిడితోఁపులుం గడున్
మెఱయుచు నాత్మకున్ముదము మెచ్చు నచ్చెను వుఘ్నటింపఁగన్॥ శ- పూ॥

పరపుట = ప్రవహింపఁజేయుట-

చ॥ గిరిశజటాటవీ నియతఖేలనలోలతరంగయై సురా
సురనరసేవనీయజలశోభితయై యసమానపావన
స్థిరమహిమాఢ్యయై పరఁగు దేవతరంగిణిఁ దెచ్చి యుర్విపైఁ
బరపి నిజప్రసూతయనఁ బ్రస్తుతి నొందఁగఁ జేసె నెల్లెడన్॥ ఏ-హ॥

ఇది యకర్మకమగునపుడు పరచుట యని యగు- అదియు ద్విరూపమే-

క॥ మెఱుపు ధనుర్దండము గుణ। ముఱుము విశిఖవృష్టి దొరఁగె నొక్కట దఱుచై
పఱపె రుధిరంపుఁగాలువ। లతిముఱిఘనభుజుఁడు ద్రోణుఁడడరి నరేంద్రా॥ భా॥

పెరుగుట = వర్ధిల్లుట-

చ॥ తిరిసినకూడుఁ దెచ్చి నలుదిక్కులబోషలు తిండి వెట్టఁగాఁ
జెరిగినపొట్టతోడ నాక పెంటపయిం దొరవోలె నెవ్వరిన్
సరకుఁగొనం దపట్టుకొని చాఁగ ఱగొన్నబతేమొఱుంగుఁడ
క్కరిబలు మోపు మోచు నయగారితనంబిరువుట్టిగట్టినన్॥ సో-హ॥

ద్విపదము॥ హరునిచాపము రాముఁడతిసత్వయుక్తి
పెరిగనేఁడిదె మొక్కుపెట్టుచున్నాఁడు॥ రం- రా॥

ద్విపదము॥ హరునిచాపము రాముఁ డతిసత్త్వయుక్తి
పెరిగి నేఁడిదె యెక్కుపెట్టుచున్నాఁడు॥ రం- రా॥

చ॥ పెఱిగితి గాక నీవు నొకప్రెగ్గడవే సభలుండు భంగిమున్
నెఱుఁగనివాఁడవై భ్రమసి యెవ్వరిముందఱ నేమిమాటలో
యఱిదివారి జంకెలకు నంతటఁ గ్రోవడి వచ్చి తిచ్చటన్
గఱువఁగవచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్॥ సో-హ॥

ఈ పైపద్య ప్రథమపాదమునఁ "ప్రెగ్గడ" శబ్దమునకు నెత్వమున్నదని శంకింపవలదు. 'చ॥ ప్రెగడన్న ధ్వజినీశుఁడంబునిధిగంభీరుండు' అని శ్రీనాథకవియును వ్రాసినాఁడు. పెరుగుటకు రెండురూపములుగా సోముఁడే ప్రయోగించుటవలన రెండుపద్యములు నతనివే వ్రాసితిమి. సంశయనివృత్తి కయి మఱియు నుదాహరింతుము.

క॥ కురుసేనగదా గెలుచుట। కరముభరము నరునకనకు గాండీవమునన్। బెరిగినయమ్ములమంటలు। దరికొని తెగఁ గాల్చునట్టిద యగుం జుమ్మీ॥

తే॥ దుఃఖమని నొడుచెఱువునఁ దొరగునలుఁగు। లనఁగఁ గన్నీరు ధారలై యతిశయిల్లఁ
బెఱుగునడలునఁ దనముక్కుఁ జెఱమలదర। * * రామాయణము॥

ద్వి॥ పెఱుగుటల్లెను పెక్కువదక్కి। తఱుగుటకై కాక తామేల నిలుచు॥ రం-రా

మరగుట=ఆసక్తమగుట.

క॥ సురుచిరధర్మంబెప్పుడు। పరికింపక నీవు కామపరతంత్రుఁడవై
తరుణీసంగతినుండఁగ। మరగి ననుం జెలిమిఁ జేరమఱచితిఁ గంటే॥ రామా॥

క॥ హరిచేష్టితములు గ్రమమున। మరగి నిజముగాఁ దమతమ మగలదొరఁగి యా
హరియందభర్తృబుద్ధిం। బరిణతలై రా వ్రజంబు బాలికలెల్లన్॥ ఏ-హ॥

(ఈ ధాతువునకు మరగించుట. మరపుట- యివి ణిజర్థరూపములు.)

క॥ సురలు గొనిరి కాంచన వి। స్ఫురిత సుపాత్రమున బలరిపుఁడు వత్సముగా
మరగించి సవితదోగ్ధగ। నరుదగు తేజంబు దుగ్ధమై సిద్ధింపన్॥ ఏ-హ॥

క॥ సిరిఁ జూపి నన్నులోఁబడ। మరపెదననిచూచెదేలమను జేకొని పైఁ
దిరముగ నామదిఁ బాయదు। తరణిం బాయని తదంచితప్రభ భంగిన్॥ రా-ణం॥

రగడ॥ కఱచిచఱచియఱచి పఱచుక పినిఁ జంపు నచ్యుతునకు
మఱగితిరిగి విఱిగి సురగు మద్దులీడ్చు మిత్రునకును॥ అప్పకవి॥

మరలుట—తిరుగుట.

క॥ నరపతులనెల్లభీష్మున। కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్
మరలఁగఁజనియెద॥ * * * భార॥

క॥ ఎఱిఁగియుసాహసమతివై। మఱలింపఁగఁ దగునె రథము మానవపతికిన్
వెఱపునె సేనాతనికిం। బఱతునె వాలావుపెంపుబడిమఱచితివే॥ రామాయణము॥

పలుమఱు—అనేకపర్యాయములు.

క॥ విఱుగుటనొచ్చుటమనదెసఁ। దలుముగనాడెదవు పాండుతనయుల బలమే
డ్డైఱఁదలుగక పెనఁగుటె పలు। మఱుఁజెప్పెదవకట యేమి మాయయొ తలఁపన్॥

మ॥ స్మరదంతావళరీతి బృంహితములై ఝుంకారములొక్కొ యనీ
సరసీవాటి విశృంఖలక్రమము మించం జొచ్చి తేఁటుల్వారిం
బారిఁ గ్రీడాగతిఁబుష్కరంబుల రసంబుల్సల్లుబోరాడుఁ బ
ల్మరు నాకంఠముగాఁగఁ గ్రోలి మధురాలాపావిలోకించితే॥ రామాభ్యు॥

(దీనివలననే వేమఱుశబ్దముంగూడ ద్విరూపమని యెఱుంగవలయును.)

వెఱగు—ఉపాయము.

"పెటికలు" అనుశబ్దోదాహరణముంజూడుఁడు.

చ॥ వెరగుపడంగనేల యలివేణి భవత్పతిఁ గానె యేను నీ
విరసతమాన్పలే కటులవేఁగుచు నంతటిలోఁ బ్రయోజనాం
తరమతినేగినేటికిని వాని ప్రసంగము లేమివచ్చినన్
దిరుగ వసించిన స్వైనుకదిక్కున నీవిధమెల్లఁ జూచుచున్॥ ప్ర-ప్ర॥

మూలము.

తే॥ ఆశ నేరుట తేరుట దూరుటయును। పొగుటయును వేమారు అావెరుదీర్ఘ
వర్ణపూర్వ ద్విరూపముల్వఱలుభూమి। నందనీనాథ పవననందనసనాథ॥

ఇందలిపదముల కర్థోదాహరణములు వ్రాయఁబడును.

ఆఱుట—ఉపశమిల్లుట.

క॥ కాఱడవిఁ బఱచుమృగముల। నూఱడకొందిగిచి డస్సియున్న తటిశ్రమం
బాఱఁగ॥ భారతము॥

క॥ కౌరవులుసేయు నవమతి। కారణముగఁ గోపమెత్తు గర్ణుని వదనాం
భోరుహముగనుఁగొనఁగ శ్రమ। మాఱున్నావశము గాక యంతన బుద్ధిన్॥ భా॥

ఏఱుట = సంగ్రహించుట.

ఉ॥ మీఱినకోఱలున్నిగిలి మింటికిఁ బర్వినపల్లవెంద్రుకల్
తేఱినమిట్టగ్రుడ్లు నతితిగ్మతరంబగు నట్టిసాహసం
బాఱని తెజముం దెసలనంటిన చేతులు లోకరాజిలో
నేఱిన మేఱిరూపముల నెంతయుఁ జేర్చిరి రాక్షసుల్వడిన్॥ రా-ణ॥

క॥ భూరిశ్రవసుండాక్కట। వీర వినోదంబుసలుప వేడుకమై దు
ర్వారతమైవచ్చెద మొక్కఱి। నేఱిహానుముసంగరమున కిటమాలోనన్॥ భా॥

తేఱుట = తేటపడు.

"తూఱువు" అను శబ్దోదాహరణమునుం జూడవలయును.

క॥ వారన్యోన్యంబు ముఖాం। భోరుహములు చూచి నేత్రములఁ జిఱునగవుల్
దేఱఁగ నిట్లనిరి యహం। కారగుణాంకురిత బహుళకలికింగలికిన్॥ సై॥

దూఱుట = నిందించుట.

క॥ పిఱిడితనంబు వెట్టుచు। దూఱంబని లేమనిన్నుఁ దొల్లిటిచెయ్వుల్
దీఱవవి యనుభవింపక। వేఱొందు నె పూర్వజన్మ వివిధకృతంబుల్॥ రా-ణ॥

ద్విపద॥ పౌరులు నన్నుఁ జూచి బాష్పముల్ దొరుగ
దూఱుచు నన్నుఁ జూచి తొలఁగుచున్నారు॥ రం-రా॥

చ॥ దూ। ఱెదు మతి కాని బుద్ధి విపరీతతఁ బొందకపోయి మాడుమా॥ ఆ-మా॥

ఆముక్తమాల్యదలో దూఱుట రేఫముగఁ జెప్పఁబడినదని తిమ్మకవి యాక్షేపించినాఁడు.

పాఱుట = పక్షిగమనము.

తే॥ నూఱుగతులనీవు పాఱు జేసన్నిరయ। నెఱుఁగఁబులుఁగులెల్ల నెట్లు వాఱు
నడఱియాకసమున నిడు బాటునట్ల పా। ఱుదము రమ్ము జలధి చదలనన్నుఁ డు॥ భా॥

శా॥ శ్రేణుల్గట్టినభోంతరాళమునఁ బాఱెంబత్తులు॥ మనుచరిత్రము॥

చ॥ ✻ ✻ ✻ రాట్నంవుగం। డ్రలు నాఁ దేనె నెఱలంకులంబొరలి పాఱన్వచ్చు పంకేరుహంబులు॥

వేమాఱు=నూటిమాటికి.

క॥ మీఁటినమానసులకిఁకుకకు।మాఱలుగకయున్న మీఁ సమగ్రతమ వే
మాఱుఁగొనియాడఁగాఁదగు।గీఱునెసాత్త్వికులబుద్ధి కిల్బిషచయముల్॥ నృసింహపు॥

"పలుమాఱు" అను శబ్దమునకు హ్రస్వరూపమందు ద్విరూప్యము కలుగుట వ్రాసినాఁగము. మేమఱు పల్మఱు శబ్దములొక్కటియే. కావున మున్ను వ్రాసిన యుదాహరణములవలననే ద్విరూప్యము - దీర్ఘములువచ్చినపుడును సిద్ధమగునని యెఱుఁగవలయును. ఇందులకు సంశయింపరేని హ్రస్వమగునపుడు రేఫమగుట కుదాహరణము ద్వితీయాశ్వాసములో 28వపుటను "ఱురుద" అను శబ్దోదాహరణముం జూడవలయును.

ఱా, ఱాయి=శిల.

క॥ నా యుల్లమరయ నినుమో।ఱాయో కాకిట్లు రూపఱక విననేర్చెఁగా
నాయకసముదయ ఖరభవ।దీయవచనచయముగలియుఁదేఱందిరమై॥ భా॥

గీ॥ రఘుకులేంద్రప్రసూతియనఘవిభూతి।రాతు పౌరాతితరణనీరజమురజము
రాతి రుచిరాతిరూపవిభ్రమగుణోత్క।రాతిరోహితవిఖ్యాతినాతిఁజేసె॥

క॥ రాచందమగలరాముఁడు। రాచందముగల్గుతపనిరాచానను॥ రామాభ్యు॥

వేఱు=భేదము.

ఇది గురువగుటకు బహుస్థలముల స్పష్టముగానఁ బ్రయోగములు వ్రాయఁబడవు.

తే-గీ॥ వేఱెయరదంబునెక్కియాశూరవర్యు।లసముడింపకపోరి నానాస్త్రనిహతిఁ
దోరఁగుశోణితములఁదోప్పఁదోఁగియపుడు।పుష్పితాశోకములరీతిఁబొల్పుమిగిలి॥ జై॥

ఉ॥ వేఱనలేదు ధారుణి నవీనతరాంధ్రకవిత్వసంపదా
ధారసరసజ్ఞులైనకవితల్లజులైన వినుండు పాండితీ
పారగులార యో పరమబంధువులార తదీయశబ్దసం
భారము పారముందెలియఁ ఛాల్పడనేనసుఁడీ జగంబునన్॥ ఆహోబిలపతి॥

మూలము.

సీ॥ కొఱ తూఱు పునుపఱు గుఱు అంకె జిచ్చుక్రమ్మఱ కాఱులు లఘుత్వమహితములని
ఎరవుప్రక్కెరకురుల్గొరవంకగోరకలు పరిమార్చె నెరయుట గరగరికలు
పరువము నారుసు వరుగులు రోయుట రేగు నారిగ గురురేఫములని
యప్పకవీశ్వరుండనియె నాతఁడు ప్రయోగముల నెచ్చటనైనఁ గాంచఁబోలు
నస్మదీయమతంబున నాదిమతము। గురువులన్యంబులెల్ల లఘువులుగాన
నిచ్చవచ్చు తెఱంగుననియ్యకొనఁగఁ। దగియె బుధులకు మకరాక్ష దశన దక్ష॥

మూలము-

తే॥ హ్రస్వరూపంబుగల్గినయప్పుడెట్టి। రేఫముత్తరమగునట్టి రేఫమె యగు
దీర్ఘరూపంబుగల్గిన దృఢనఖాగ్ర। దూరనిర్ఘాత ఘోరదుందుభిశరీర॥

టీక॥ హ్రస్వదీర్ఘరూపముగల్గుశబ్దమునకు హ్రస్వరూపముగల్గినపుడు పరమందు లఘువుండునో గురువుండునో ద్విరూపముండునో దానికి దీర్ఘరూపముగల్గినపుడును నదియెయుండునుగాని పూర్వవర్ణకమునకు వికృతివచ్చినఁగాని పరమునందలి రేఫమునకు వికృతిరాదనుట. ఉదాహరణము- లఘువు-అరయుట, ఆరయుట గురువు-అఱుచుట, ఆఱుచుట. ద్విరూపము చేకుఱుట-చేకూరుట॥ ఇవ్విధి యప్పకవిచేతను జెప్పంబడియె- సీ॥ చేకూరెననుటకుఁ జెకురెననియిట్లుపొడుగులెల్లను హ్రస్వములుగఁ జేసి। పలికెడు వేళ రేఫములను ఱాలును మునుపటియట్లనెదనరుచుండు

క॥ నారాయణపదవాచ్యం। బారయ బ్రహ్మంబుదాని ననిశము వినియు
న్నారమతిందలఁచియునిం। పారంబాగడియు రమించు టతుల హితమగు॥ భా॥

తక్కినవాని నిట్లనె యెఱుంగవలయును.

చ॥ వరుసఁగ నన్నయాది కవివర్యుల కావ్యములందుఁబొందుగా
నరసి మదక్షిగోచరము లైన లఘుత్వ గురుత్వ రూప యు
గ్మరుచిర రేఫముల్ క్రమముగా వివరించితి నింపు నింక ను
ర్వరఁగల రేఫముల్ సుకవివాగ్విసరంబుఁగాంచుఁడీ కవుల్॥

చ॥ తలఁపఁ దెలుంగు బాస యమితంబని పూర్వులథర్వణాదులుం
బలుకఁగ నాకు నన్ని దెలుపంగఁ దరంబగునే భవత్కృపా

కలితకటాక్షవీక్షణ విలాసమున న్మదిఁదోఁచినట్లు నే
దెలిపితిఁ గైకొనందగు సుధీజనకల్పక శేషతల్పకా॥

శా॥ ఈ కావ్యం బొనరించుబుద్ధి మును నాకీవిచ్చుటం జేసి నే
నీ కర్పించితి భర్తవీవె భువిఁ దీనిన్మెచ్చినన్ గేరినన్
నీకే చేకురు నుబ్బు ప్రస్తుతులెవ్వుడు న్నిత్యుండవీవాటచే
నాకేలా దుదిఁజింతలన్ స్వజనబృంద త్రాణనిత్యవ్రతా॥

⁕ఆశ్వాసాంతము.⁕

శ్లో॥ వామాంకాసీన సీతా మృదుల భుజలతాశ్లిష్టమూర్తిస్సుకీర్తిః
శ్రీమాన్విజ్ఞానముద్రాంచితకరకమలశ్చారునీలాభ్రగాత్రః
నిత్యశ్రీనిలపల్లీనివసన రసికస్సత్కృతింమత్ప్రణీతాం
సీతారామః కటాక్షప్రసృతఘనకృపాశీకరస్స్వీకరోతు॥

శ్లో॥ ప్రబంధేషు ప్రాచాం ప్రభురయమృషీణాం చ రసికః
ప్రసన్నస్స్యాదస్మిన్ప్రచురబహుదోషైకధమితి
నశంకామేయస్స్మాద్యజనపరిశుద్ధేషు చరుషు
ప్రసాదస్తుల్యోభూదపి శబరయోషార్పితఫలే॥

శ్లో॥ అతిమరుతాసుతేన మరుతః పురతస్స్ఫురతా
వినయజుషాయుతానుజనుషాపరుషార్తిఖిది
జనకభువాకృపారసభువాధికృతస్సుకృతీ
కృతిమవతాదిమాం రఘుపతిః కరుణార్ద్రమతిః॥

శ్లో॥ స్వస్తిప్రశస్తగుణపుష్పసురద్రుమాయ
సీతాస్మితద్యుతి వశంవదలోచనాయ
భక్తాంతరంగముకురాంతరగోచరాయ
భూయాదహన్యహని మంగళమంగళాని॥

శ్లో॥ ప్రభవతిదోష విముక్త్యై వివేకినాం యత్పదానుసంధానం
జయతు చిరాయాథరాయాం ద్విరేఖవర్ణాకృతిశ్చాసౌ॥

టీక॥ వివేకినామితి- ఏకత్ర- సప్తవిధకవీనాం మధ్యే వివేకినామ కశ్చిత్కవిః

ఉక్తంచాభియుక్తైః- గుణదోషవిభాగజ్ఞోవివేకీపరికీర్తితఇతి- అన్యత్రనిత్యానిత్యవస్తువిచారశీలాః- ఏకత్ర-పదానాంశబ్దానాం- అన్యత్ర-పదస్యాంఘ్రేః- ఏకత్ర- ద్విరేఫవర్ణాయస్యాస్సా ఆకృతిర్యస్యేతి- షట్పదశ్యామమూర్తిరిత్యర్థః॥

మూలము.

మ॥ భ్రమణక్లేశ వినాశ ధుర్య శ్రుతికర్మబ్రహ్మకాండద్వయ
ప్రమితైశ్వర్య పులస్త్యపౌత్రహత గృధ్రక్షేమవిశ్రాణన
క్షమ కారుణ్యక దివ్యసఖ్యభరణస్వప్రీణితారణ్యకా
విమతక్షుణ్ణసురావనార్థనరతావిష్కార నిష్కారణా॥

టీక॥ భ్రమణం జననమరణరూపం శ్రుతౌయాకర్మకాండ బ్రహ్మకాండా-తయోర్ద్వయేన ప్రమాదేన ప్రమితం యథార్థానుభూతమైశ్వర్య మీశ్వరత్వం యస్యసః పులస్త్యపౌత్రోరావణః- దివ్యసఖ్యమేవ భరణస్వం- మూల్యధనం తరపణ్యామిత్యర్థః- భరణ్యం భరణం మూలం నిర్వేశః పణఇత్యపీత్యమరః. తేనప్రీణితఃప్రీతింప్రాపిత ఆరణ్యకో అరణ్యేభవ ఆరణ్యకః కిరాతో గుహాభ్యోయేవసః ఆరణ్యాన్మనుష్యఇతి- సురావనార్థోనరతాఃవిష్కారోమనుష్యత్వప్రకాశనంయస్యసః॥

※మూలము.※

క॥ అక్షుద్రభావనాశా। విక్షేత్రకృపా ఝులర్ఝులీకల్లోలా
నుక్షణహల్లోహల నిజ। వీక్షణగుణసత్పథప్రవృత్తోద్ధర్తా॥

టీక॥ భవితుర్భావనానుకూలవ్యాపారా భావనాఃస్వర్గాది ప్రాప్త్యనుకూలపురుషప్రవృత్తయ ఇత్యర్థః॥ అక్షుద్రాస్తావివశాలయః కలమషష్టికాద్యాః తేషాంక్షేత్రం కేదారం తత్పాకోచితభూరిత్యర్థః॥ పుంనపుంసకయోర్వప్రం కేదారం క్షేత్రమిత్యమరః। శాలయః కలమాద్యాశ్చషష్టి కాద్యాశ్చ పుంస్యమీత్యుభయత్రామరః॥ ఝులర్ఝులీశబ్దః ప్రవాహపర్యాయోదేశ్యః। విషయ మృగతృష్ణా ఝులర్ఝుల్యా మితిమురారిః। అనుక్షణం। ప్రతిక్షణం। హల్లోహలైర్మగ్నోన్మగ్నైః॥ పరిమళలహరహల్లోహలమదబంభరేతి కవితాపితామహః॥ ప్రగల్భాంగనా కలనాదోదిత పాహిపాహిముఖవాక్కల్లోలహల్లోహలేతి దశావతారచరితె రామకవిః॥ గంగాహల్లోహలవాగ్విలాసేతి తేనాలిరామకృష్ణకవిః॥ నిజవీక్షణైరేవగుణైః కరణైః సత్పథప్రవృత్తాః।

క ర్తరిక్తః। భగవదర్పణబుద్ధ్యానిత్యనైమిత్తిక కర్మానుష్ఠాన శాలిన ఇతి యావత్। తే షాముద్ధర్తా। ఏతేన భగవతశ్చతుర్వర్గఫలప్రదాయకత్వం వివక్షితం॥

పంచచామరము.

గర్వతిమిరజటిలతాటకానిశాపనోదనా
ఖర్వకందళప్రతాప కల్యభానుమండలో
చ్చైర్విభాసమృద్ధిభూతచండవిక్రమోన్నమ
చ్ఛర్వరీచరప్రకాండజాల ఖండనక్రియా॥

టీక॥ జటిలాసాంద్రా। తాటకైవనిశా। కంద ళేతి। తత్కాలోదిత ప్రతాప సూర్యమండలస్య విభాసమృద్ధిభూతాః కిరణసంపత్తిభూతాః ఖరదూషణదశకంఠా ది ఖండన క్రియాః యస్యేతి॥

గద్యము.

ఇది

శ్రీనీలపురధామ సీతారామచంద్రకారుణ్య సంప్రాప్తసాధుకవితాధార
శ్రీమదోగిరాలాన్వయక్షీరపారావార పూర్ణిమారాజపేర సుధీ
రాజకుమార వినయవిద్యా సనాథ రంగనాథ
ప్రణీతంబైనద్విరేఫవర్ణదర్పణంబునందు
ద్విరూపరేఫ నిరూపణంబను
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

స్వస్త్యస్తు.

